# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1962

సంపుటము 39 : : సంచిక ౯

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1962

# వేదనా వాసుదేవము

శ్రీ నాయని సుబ్బారావు

శుకమార్గమ్మునుబట్టి పోవునటవే సూనుండు వాఙ్మౌక్తికై
సకలోహమ్ముల నారుపోసికొను నిచ్చన్ రాగధాన్యంపు పా
లిక మద్వ్యగ్రత కిట్టి సార్థకత కల్పింపన్ దలంపూని యెం
త కరాళించెదవయ్యా! వంశవికలోద్యద్ధ్వాన్త వంశీరవా!

ప్రాంశు ప్రోత్థిత నమ్రమూర్ధ చలనప్రస్తార సౌభాగ్యముల్
వంశాంకూరములెల్ల నీదు విలయవ్యాపారసంరంభ ని
స్త్రింశోదగ్రత ముక్కముక్కలుగ విచ్ఛేదమ్ములైగాని నీ
వంశీగాన నిరంతర వ్యసనముల్ వర్జింపవా భూమిపై!

అవిచారమ్మున నిట్లు వెల్వఱుతు నిందావేశపూరమ్ములౌ
కవితల్ నీపయి నీప్రపంచఘటనా కార్యక్రమమ్మందు మ
ద్భవితవ్యార్థము లెల్ల భద్రములుగా భావింపగాలేని నా
యవివేకమ్ము మహావివేకమహితాత్మా! సైచి రక్షింపవే!

విరసోక్తమ్ములు జీవితప్రకరణాల్పిష్ఠ ప్రసారమ్ములన్
బిరుదంచున్ గతిలేనివారు పొగడన్ బిట్టుబ్బి చేపట్టి నీ
చరలోకాచరలోక నాటక మహైశ్వర్య ప్రసారమ్ము కం
దెఱపై యప్రతిభుండ నేనొక మృషానిర్వాహకస్వామినై!

పాలింపంబడి లౌకికాల్పవిషయోపజ్ఞాచమత్కార వా
గ్జాలమ్ముల్ సరినాకు నెవ్వరనుచున్ గర్వించి ప్రశుత్యర్థముల్
నీ లీలల్ వివరింపబూని గళవాణీనాళముల్ పూడి బెం
బేలై పోయెద నో రోకింక తెలివన్ భేకస్వనాఘోరమై!

ఏదో వేదనపుట్టి యెందుకొ అకో హృద్గర్భమందార్త ర
వోదక్షు న్నినుజుట్టి పట్టుకొని తీగల్ సాగి నీ దివ్య సం

వాదాశంసనపద్యపుష్పచయమై భాసిల్లె నీ వేదనా
మోదమ్మెల్లుక్రము దానిలో సఫలతామోదమ్ము దై వాఱగన్!

శ్రుతిసీమంతిని చెందిరంపు కళుకుల్ శుద్ధాంతరంగమ్ములన్
జతనమ్మై వికసించు శాంతికలికల్ సాహిత్య సౌహిత్య సం
భృతమార్గమ్ములు తేజుకొల్పు పలుకుల్ విశ్వామయస్వాస్థ్య మం
చితయోగమ్ముగ సంతరించుగుళికల్ నీ వేదనావాసనల్!

నా పత్నీ రమణీ సుధాప్రణయితానందమ్ములం దేలితిన్
నా పుత్రీ విదుషీయశోవిసర విన్యాసమ్ములం బొంగితిన్
నా పుట్టిల్లను పండె నీదు చలువ న్మానాథ! సంసార సౌ
ఖ్యా పూర్ణమ్ముగ నేమి కావలయునయ్యా! యింక నా కిచ్చటన్!

ఆఘ్రాణింపుము నాదు కావ్యమిది నీకై విచ్చె సంప్రీతిగన్
వ్యాఘ్ర క్రూరనఖోపమాన విషయ వ్యావిద్ధముల్ నిత్య తృ
ష్ణాఘాతోన్మదితేంద్రియాళి కుపసంహారమ్ము శాసించినన్
శీఘ్రప్రక్రియ నిన్ను జేర్చుకొనుమంతే మోక్షలక్ష్మీశ్వరా!

# రాజరుద్రుని గోరవెంకపల్లి దానశాసనము

శ్రీ కె. హెచ్. వి. శర్మ

ఆంధ్రప్రదేశ పురాతత్త్వ శాఖాధికారులుగ కొలదికాలము మాత్రమే నియమించబడిన శ్రీ యన్. రమేశన్‌గారు హైదరాబాద్ స్టేటు మ్యూజియములో నింతవరకును పడియుండి వెలుగుముఖము చూడని గొన్ని తామ్ర శాసనముల నిటీవల నొక గ్రంథముగ బ్రకటించి ఆంధ్రదేశ చరిత్రమునకు మహోపకారము గావించిరి. వారి యాజమాన్యమున నీ రెండేండ్లలో ఆంధ్రదేశమునకు సంబంధించిన యనేక శాసన సంపుటములు వెలువడినవి. ఇంకను దేశమంతటనుండియు చాల తామ్ర శాసనములు సంపాదించబడి ప్రస్తుతము హైదరాబాదు స్టేటు మ్యూజియములో భద్రపఱుచబడియున్నవి. అచిరకాలమున వానిని గూడ గ్రంథరూపమున బ్రకటించు యత్నమున నారుండగా మన దురదృష్టవశమున వా రా పదవిని విడచి, మద్రాసులోని ఉన్నతస్థానము నాక్రమించుట దానితో మరల ఆంధ్రప్రదేశ పురాతత్త్వశాఖ యథాప్రకారము సుషుప్త్యావస్థను పొందుట సంభవించినది. ఈ రెండేండ్ల కాలమున శ్రీ రమేశన్‌గారు శాసన సంపాదన, ప్రచురణ విషయముల జూపిన శ్రద్ధ, ఆదరణములకు ఆంధ్రుల మెంతయు వారికి కృతజ్ఞులము కావలసియున్నది.

ఈ దాన శాసనపు రేకులు గుంటూరుజిల్లా యొక గ్రామములోని పాడుపడిన నూతిలో దొరకినవట. శ్రీయుతులు పుల్లెల శేశాద్రిశాస్త్రి, యన్. భగవాన్‌దాసుగార్ల ద్వారా అవి సంపాదించబడి, ప్రస్తుతము హైదరాబాదులోని స్టేటు మ్యూజియములో నుంచబడినవి. మొత్తము మూడు రేకులు మాత్రమే గలవు. శాసనమంతయు చాల చక్కని సంస్కృత శ్లోకములలో తెలుగు లిపిలో మొత్తము డెబ్బది పంక్తులలో రేకుల రెండు ప్రక్కలను చెక్కబడియున్నది. వారిచే ప్రకటించబడిన ప్రతిబింబములతో శాసన పాఠములను సరిజూచునపుడు కొన్ని వ్యత్యాసములు నాకు గాన్పించుట, వారి వ్యాఖ్య గూడ సమగ్రముగ లేకుండుట చే మరల దీనిని భారతి ద్వారా ప్రకటించుచున్నాను.

## శా స న మూ ల ము

లక్ష్మీశో జయతి మహావరాహ మూర్తి
ర్లగ్నా యద్దాంష్ట్రాగ్రే మహార్ణవాంబు పూరాః
భూకాంతో ద్వహన రసా దుదీయమాన
స్వేదాంభః పృషతతతిశ్రియం వితేనుః 1

పర్యాప్తం ప్రథయతు వ స్సతా మభీష్టం
పార్వత్యాః ప్రథమతనూభవో ద్విపేంద్రః
నూనం యః ప్రణత శుభప్రదోహి భూయః
సంపత్త్యై సతత ముదీర్ణ దాన వృష్టిః 2

సంజీవనం యా సకలౌషధీనాం
న కేవలం కింతు సుధాభుజాం చ
మహేశితుర్మౌళి విభూషణం సా
మూర్తి స్సుధాంశో ర్ముద మాతనోతు 3

ఆద్యస్య బాహూ శిఖరా దుదియాయ ధాతుః
శ్రీ కాకతి క్షితిభృతా మయ మన్వవాయః
యత్రోదయంతి పురుషాః పరుషా రణేషు
మందాం శ్రియో విదధతేస్మ ఫలేషు నిందామ్ 4

తస్మిన్మహాదేవ మహీ మహేంద్ర
స్సాత్మాన్మహాదేవ ఇవా వ తీర్ణః
సాటోప కోపారుణ వీక్షణేన
క్షణేన యః శత్రు పురాం నిహంతా 5

అథ సకల మహీంభృన్మస్తకన్యస్త పాదః
పరిచిత వియదాశ స్సద్యశ శ్చంద్రికా భిః
అధిగత జని రస్మా చ్ఛౌర్య గాంభీర్య సింధో
ర్గణపతి రితి రాజా రంజయామాస పృథ్వీమ్ 6

సామ్రాజ్య సింహాసన మత్యుదగ్రం
యస్మిన్ సమారోహతి రాజసింహే
ఆరోహతిస్మాస్య విదూర భాజాం
తదైవ రాజ్ఞామపి మౌళి మాజ్ఞా 7

మంథాచల వ్యాకులితస్య సింధో
రపత్యతా దోష మపాచికీర్షుః
అక్షోభ్య సత్త్వా దుదియా య తస్మా
ద్రుద్రాంబికేతి ప్రథయా స్వయంశ్రీః 8

తస్యాస్తనూజా తనయో నయజ్ఞః
ప్రతాపరుద్రః ప్రథమాన భద్రః
చతుస్సముద్రా వలయాం ప్రశాస్తి
విశ్వంభరాం విస్మయనీయ భూమా 9

యస్మిన్మహీం శాసతి యామినీషు
దోషాహ్వయః పాథసి భంగసంగః
ద్విజాధి రాజ ప్రతిపక్ష భావో
రాహౌ పునర్నక్వచన ప్రజాసు. 10

తదీయ సేనాపతయ శ్చతుర్థ
కులప్రసూతాః చతురా రణేషు
ధన్యా వదాన్య ప్రవరా జయంతి
ఖ్యాతాః క్షితా దిక్షు కులప్రదీపాః 11

తేషామభూ దద్భుత విక్రమాణా
మగ్రేసరో బొల్లయ నామధేయః
యః స్వామి భక్త్యా శివపాద భక్త్యా
ప్రాప్తః ప్రసిద్ధిం మహతీం మహీంచ 12

తస్యాత్మభూ ర్దేవయ వాహినీశః
సత్కీర్తి చంద్ర ప్రభవో బభూవ
సమంతత శ్శశ్వ దుపేయుషీభిః
సంపన్నదీభిః పరిపూర్యమాణః 13

వేలూరి బొల్ల ప్రభురస్య జాత
స్సూను స్సదాంభోజ వికాస భానుః
యస్య ప్రతాపేన విజృంభితేన
నిమగ్నతః శత్రు యశశ్శశాంకౌ 14

దానై ర్మహద్భి స్సకల ద్విజానాం
సంపన్నిదానైః ప్రథిత ప్రభావః
అపారిజాతోఽపి యశః ప్రసూనై
ర్యః పారిజాతస్య సమాన ధర్మా 15

విరోధినాం సంయతి కాలరుద్రః
ప్రతాప విస్ఫురణ వీరభద్రః
అశ్రాంత కల్లోలిత భూరి భద్ర
స్తదాత్మజో రాజతి రాజరుద్రః 16

యస్య ప్రతాప ప్రసరాదతీవ
సంతాపితానాం రిపునాయకానాం
నాన్యాగతి ర్య త్పద కల్పవృక్ష
చ్ఛాయాంతరేః సంశ్రయమంతరేణ 17

యదీయ విశ్రాణన వారిసేకా
ద్వివర్థమానా వసుధాలవాలే
వివేల్లి తాశా విటపా విహాయ
స్తరుం సమారోహతి కీర్తివల్లీ 18

నిమజ్జతాం స్వర్గతి మాతనోతి
పరప్రతాప ప్రశమం విధత్తే
కథం కవీంద్రైః కథనీయ ఏష
యత్ఖడ్గధారా సుయశః ప్రభావః 19

శాకాబ్దే వేద భూద్విక్షితి యుజివిజయాబ్దేఽశ్వ యుజ్మాసి పూర్వే
పక్షేఽష్టమ్యాం బుధస్యాహని బుధవినుతో రాజరుద్ర స్స ఏషః
పుణ్యాయాం తుంగభద్రా తటభువి పురతో భీమనాథస్య శంభోః
సమ్యక్సం పూజితస్య క్రమసహిత లసద్వేద విద్భ్యో ద్విజేభ్యః 20

గ్రామం ప్రసిద్ధం గొరవెంకపల్లి
నామాగ్రహారం సమదత్త యుక్తః
సమస్తభోగై స్సహితం స తేజ
స్స్వామ్యం పరైరప్రతిలంఘ్య తేజాః 21

వాసుదేవ మండలికో గయాక్షేత్రాధి నాయకః
తత్రార్ధహారీ విదుషా మాద్యః కౌశిక గోత్రజః 22

ఉపమన్య వసిష్ఠాఖ్య గోత్రజ శ్శ్రుతి పారగః
మహితాచార సంపన్నో మైలారప్పయకోవిదః 23

భారద్వాజ కులోద్భూతో యజుర్వేదస్య పారగః
పోతిపెద్ది రితిఖ్యాతనామా విప్రస్తథాఽపరః 24

పదక్రమ యుతే సాంగే యజుషిప్రౌఢి మాశ్రితః
బొల్లి మంచి స్తథాచాస్య త్ప్రాతం కౌశిక గోత్రజః 25

శ్రుతిస్మృతి ముఖాశేష హృద్య విద్యా విశారదాః
ఏతేతయో ద్వితీయ్యార్థహారిణో హత కిల్బిషాః 26

సమాదిశ్య గయాశ్రాద్ధ కృతయే స్వపితు స్తథా
త్రైఃకృతే దక్షిణాత్త్వేన తేభ్య స్తమతి సృష్టవాన్ 27

అథసీమా నిరూప్యంతే.

ప్రాచ్యాం దిశి శ్వేతశిలా। ఆగ్నేయ్యామ్ప్రాంశు బింబోపలక్షి తాల్పా సరిత్। దక్షిణస్యాం దిశి శ్వేత పాషాణ శకలోప లక్షితః కుబ్జపర్వతః। నైఋత్యాం కృత మాల తటాకః। ప్రతీచ్యాం దేవ తటాకః। వాయవ్యాం దిశి అల్ప ఘటమేయ జలప్రస్రవోప లక్షితః పాషాణాభోగః। ఉత్తరస్యాందిశి నీలశిలామయ శిలోచ్చయః। ఐశాన్యాం మండల దేవి తటాకః॥

స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః 28

సామాన్యోయం ధర్మసేతుర్నృపాణాం
కాలే కాలే పాలనీయో భవద్భిః
సర్వానేతా న్భావినః పార్థివేంద్రాన్
భూయో భూయో యాచతే రామచంద్రః 29

మొదటి మూడు శ్లోకములలో మహావరాహమూర్తి, విఘ్నేశ్వరుడు, చంద్రుడు వరుసగా స్తుతించబడిరి. తదుపరి కాకతీయాన్వయవర్ణన. ఆద్యుడైన బ్రహ్మయొక్క బాహు శిఖరమునుండి శ్రీ కాకతిరాజుల వంశ ముదయించినది. ఆ వంశమునందు యుద్ధములలో పరుషమైనట్టియు, ఐశ్వర్యముయొక్క ఫలములయందు నిరాదరణ గల్గినట్టి పురుషులు జన్మించిరి. సాక్షాత్పరమేశ్వరుడువలె సాటోపకోపారుణవీక్షణమున క్షణములో నెవ్వడు శత్రుపురములకు నాశకు డయ్యెనో అట్టి మహాదేవరాజు అం దవతరించెను. ఆ శౌర్య గాంభీర్య సముద్రునకు సమస్త భూపాలుర శిరస్సులయం దుంచబడిన పాదములు గలట్టి, సద్యశశ్చంద్రికలచే వ్యాప్తమైన దిగాకాశములుగల గణపతి యను రాజా ప్రభవించి భూమిని రంజింపజేసెను. ఉదగ్రమైన సామ్రాజ్య సింహాసనము నా రాజసింహు డధిరోహించినతోడనే దూరమునసుండు రాజుల శిరస్సులయందు కూడ ఆతని యాజ్ఞ వహించబడినది. మంథాచలక్షోభమున సముద్రునకు ఉదయించిన దనెడి దోషమును పోగొట్టుకొనుటకుగాను స్వయముగ లక్ష్మి రుద్రాంబికా నెపమున ఆ యక్షోభ్యసత్త్వుడగు గణపతిదేవునియందు జన్మించెను. ఆమె దౌహిత్రుడు, నయజ్ఞుడు, అధిక మంగళములు గల ప్రతాపరుద్రుడు చతుస్సముద్రావలయ విశ్వంభరను మిక్కిలి ఆశ్చర్యముగ బాలించుచుండెను. ఆతడు భూమిని శాసించుచుండగా దోషావ్యయము రాత్రులయందు, భంగసంగము సముద్రునియందు, ద్విజాధిరాజప్రతిపక్షభావము రాహువుయందేగాని, ప్రజలలో నెచ్చటనులేవు. ఇక వారి సేనాపతుల ప్రశస్తి. చతుర్థ కులజులు, రణములయందు మిక్కిలి చతురులు, గొప్పదాతలు, మంచిఖ్యాతిని పొందినట్టివా రాకాకతీయుల సేనాపతులు. స్వామిభక్తి, శివపాదములయందలి భక్తితో గొప్ప ప్రసిద్ధిని, భూమిని బడసిన బొల్లయ వారందఱిలో నగ్రేసరుఁడు. ఆతని పుత్రుడు దేవయవాహినీశుడు ఎల్లప్పుడు, మాటి మాటికి పొందబడుచున్న సంపత్తులనెడి నదులతో వృద్ధిని పొందినవాఁడై యోగ్యమైన కీర్తిచంద్రుని ప్రభవమునకు కారకుఁడయ్యెను. ఆతనికి సదాంభోజ వికాసభానుడు, విజృంభించిన ఎవని ప్రతాపమున శత్రురాజులు, వారి యశస్సనెడి చంద్రులు మునిగిపోయిరో అట్టి వేలూరి బొల్ల ప్రభువను పుత్రుఁడు పుట్టెను. శాసన దాతయగు రాజరుద్రుని ప్రశంస. సమస్తమైన ద్విజులకు, సంపత్తులకు కారణమైన భూరిదానములచేతను, అస్తమించిన శత్రు సముదాయముగలవాడయ్యు (అపారిజాతోఽపి) కీర్తి ప్రసూనములతో గూడ పారిజాతముతో సమాన ధర్మము గలవాఁడు, యుద్ధములయందు విరోధివర్గమునకు కాలరుద్రుడు, ప్రతాపవిస్ఫారణమున వీరభద్రుడు, ఎడతెగని శుభములు

గలట్టి రాజరుద్రుఁ డాతనికి గల్గెను. ఆతని ప్రతాప ప్రసరములచే మిక్కిలి తపింపఁజేయబడిన శత్రునాయకులకు, వాని పదకల్పవృక్షచ్ఛాయాతటవు ఆశ్రయముతప్ప, వేరుగతియే లేదు. దానమనెడి ఉదకసేచనమున భూమియే ఆలవాలముగ వృద్ధి నొందిన ఆతని కీర్తిలత దిక్కులను శాఖల నల్లుకొని ఆకాశమును వృక్షము నధిరోహించినది. మునిగినవారికి స్వర్గము నిచ్చుచు, శత్రువుల ప్రతాపమును ప్రశమింపజేయు నాతని ఖడ్గధారయందలి యోగ్యమైన యశఃప్రభావము కవీంద్రులచే నెట్లు వర్ణించబడగలదు? తదుపరి దాన విషయము. శాకాబ్దములు వేద, భూ, ద్వి, క్షితులచే లెక్కించబడు విజయ సంవత్సర ఆశ్వయుజ శుక్ల అష్టమీ బుధవారమునాండు పవిత్రమైన తుంగభద్రానది యొడ్డునగల భీమనాథేశ్వరుని లెస్సగా పూజించి, బుధనుతుడైన రాజరుద్రుడు క్రమాంతము క్షుణ్ణముగ వేదమును దెలిసినట్టి బ్రాహ్మణులకొఱకు గౌరవెంకపల్లియని ప్రసిద్ధమైన అగ్రహారమును సమస్త భోగములతోడను, సతేజస్స్వామ్యముగ నిచ్చెను. ఇక దాన ప్రతిగ్రహీతలనుగూర్చి తెలుపబడెను. కౌశిక గోత్రజాఁడు, పండితులందఱిలో శ్రేష్ఠుఁడు, గయాక్షేత్రమున కథినాయకుఁడగు వాసుదేవ మండలికుఁడా గ్రామములో సగము తీసికొనును. ఉపమన్యవశిష్ఠాఖ్య గోత్రజాఁడు, శృతిపారగుడు, గొప్ప ఆచారవంతుఁడైన మైలార అప్పయ్య కోవిదుడు, భారద్వాజ కులోద్భూతుడు, యజుర్వేద పారగుడగు పోతిపెద్ది, పదుక్రమములతో గూడ సాంగమైన యజుర్వేదమునందు ప్రౌఢియైనట్టి కౌశిక గోత్రజాఁడగు బొల్లిమంచి, ఈ ముగ్గురు శృతి స్మృతి మొదలుగా సమస్త విద్యలయందు పారగులైనవారు ఆ(మిగిలిన) రెండవ భాగమును పొందగలరు. తన తండ్రి గయాశ్రాద్ధమున కాతఁడు వారలను నియోగించి, అట్లు వారిచే నిర్వర్తించబడగా వార్లకు దక్షిణగా ఆ గౌరవెంకపల్లి గ్రామమును విడిచిపెట్టెను. దత్తాగ్రహారపు సీమాచిహ్నము లిట్లున్నవి. తూర్పున తెల్లరాళ్ల గుట్ట. ఆగ్నేయమునకు సన్నని చిన్న కాలువ. దక్షిణమున తెల్లరాతి ముక్కలుగల చిన్న కొండ. నైఋతమున సువర్ణ గన్నేరు చెఱువు. పశ్చిమమున దేవుని చెఱువు. వాయువ్య దిక్కున చిన్నపిడత మునుగు ఊటకాలువగల కొండ. ఉత్తరదిక్కున నల్లిశానపురాళ్లగుట్ట. ఈశాన్యమున మండలదేవి చెఱువు. తదుపరి రెండు వ్యాసగీతములతో శాసనమంతమైనది.

గణపతిదేవుని గరవపాడు, కోలవెన్ను దానశాసనములు తప్ప, ఇంతవరకుపలబ్ధమైన కాకతీయులనాటి తామ్రశాసనములన్నియు వారి సామంతులు, సేనాపతు లిచ్చినట్టివియే. గణపతిదేవుని కాలమున నాతని సేనాని సారంగధరదేవుని శరంగపుర శాసనము, ఆతని పుత్రిక రుద్రాంబ కాలమున విరియాల సూరని వైనాయకపుర దాన శాసనము (కోటగిరి శాసనము), అట్లే ఆమె సామంతుడు ఎల్లణదేవుని ఆలపాడు దాన శాసనము, ఇవన్నియు వారి, వారి సామంతులు, సేనాపతు లిచ్చినట్టివి మాత్రమే. మిగత రాజవంశములలో సామంతులు, సేనాపతులు తామ్రశాసనముల నిచ్చుట చాల అరుదు. గజపతుల కాలమున ఆ యా ప్రాంతములకు ప్రతినిధులుగ నియమించబడిన గజపతి రాజపుత్రులు హంవీరదేవ, గాణదేవ, రఘుదేవ నరేంద్రాదులు, తామ్ర శాసనముల నిచ్చుట గలదు. ఇట్లు రాజపుత్రులు, రాజవంశమునకుఁ జెందినవారు తామ్ర శాసనముల నిచ్చుట తరుచు కలదుగాని, కాకతీయులనాటి కాలమున వారి సామంతులు సేనాపతులు ఈ దాన శాసనము లిచ్చినంత విరివిగ మరెచ్చటను గానరాదు.

ఈ దాన శాసనకాలము శకవర్షములు 1214 విజయ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ అష్టమి బుధవారమనగా క్రీ. శ. 1293 సెప్టెంబరు 9 నకు సరిపోవును. అప్పటి కింకను కాకతి రుద్రాంబ జీవించియేయున్నదికాని, ప్రతాపరుద్రుడు యువరాజుగనే రాజ్యభారమంతయు స్వయముగ తానే వహించుచుండినట్లు దీనినిబట్టి స్పష్టమగుచున్నది. ప్రతాపరుద్రీయమున విద్యానాథుడు కూడ "ధీరోఽయం యువరాజ ఏవ వహతి శ్రీ వీర రుద్రోద్ధురం" అని తెల్పియున్నాడు. తదనుగుణముగ మాతామహి రుద్రాంబ జీవించియుండిన కాలము నాటి శాసనము లన్నిట, నాతడు కుమారరుద్రదేవ మహారాజులని, రుద్రదమ కొమారులని, మనుమరుద్రదేవుడని ఇత్యాదిగా వ్యవహరించబడినాఁడు. ఆతడు యువరాజుగ నుండిన కాలమున నీయబడిన తామ్ర . శాసనములలో నింతవరకుపలబ్ధమైన వానిలో నిదియే మొట్టమొదటిది.

కాకతీయుల వంశమునుగూర్చి, ఇందు "ఆద్యస్య బాహుశిఖరా దుదియాయధాతుః శ్రీ కాకిత క్షితిభృతా మయ మన్వవాయః" అని బ్రహ్మ బాహువులనుండి యుద్భవించిన క్షత్రియులని వర్ణించబడినది. కాని, లింగాల, మల్లవోలు, వర్ధమానపురము మున్నగు శాసనములలో పెక్కుట వారు బ్రహ్మపాదముల నుండి యుదయించిన చతుర్థకులజు లనియే స్పష్టముగ గలదు.

జగత్సిసృక్షయా విష్ణు నాభీ పద్మాసన స్థితః
అంతర్నియుక్త ధీ ర్వేధా యోగీవ మిలితేక్షణః
అసృజ చ్చతురోవర్ణా న్ముఖ బాహూరు పాదతః
అన్యా న్యచ్చావచాదీని భూతాని స్థావరాణిచ
అథ స్వీకృత వర్ణోక్త ధర్మ నిర్మలచేతసః
జాతా ద్విజాతయః పశ్చా చ్చతుర్థకుల ముజ్వలం
తత్రానేక నృపాల భాల లిఖితాం వీరాంక వర్ణావళీం
దర్శం దర్శ మనర్గళం సముచరత్త్రిపః ప్రతాపానల
యస్యోదంచిత కాకతీశ్వర కులక్షీరాబ్ధి సంవర్ధన
ప్రౌఢాహంకృతి చంద్రమాస్సమభవ త్ప్రోలాభిధానో నృపః

వీనినిబట్టి మొదటవారు నిస్సందేహముగ చతుర్థకులజాలే అనియు, క్రమముగా క్షత్రియత్వ మారోపించబడినట్లు సుస్పష్టము.

# రాజరుద్రుని గోరవెంకపల్లి దానశాసనము

ఇక ప్రతాపరుద్రునిగూర్చి దీనిలో నాతఁడు రుద్రాంబ కూతురు కొడుకని 'తనూజా తనయః' అని గలదు. పాను గల్లు శిలా శాసన మొకదానిలో గూడ నాతఁడు 'తత్పుత్రీ తనయః' అనియే పేర్కొనబడినాఁడు. ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు ఆతనిని రుద్రాంబ దౌహిత్రుఁడనియే తెల్పినాఁడు. ఇక శివయోగసారములోని "అకుపిత రుద్రమాంబికకు నాత్మజ నా బొగడొందు ముమ్మడమ్మ" యని యుండుటనుబట్టి ప్రతాపరుద్రునితల్లి ముమ్మడాంబ కాకతిరుద్రాంబకు కూతురు వంటిదేగాని, నిజముగ కూతురు గాదని వాదించుట యసంద ర్భము. శ్రీ రమేశన్‌గారిచే ప్రకటించబడిన కాకతీయులనాటి రెండవ తామ్ర శాసనమున గొన్ని వింత విషయములు గలవు. వరాహ దేశ మధ్యవర్తి వర్ధమాన పురవరాధీశ్వరులైన కృష్ణ కన్నార దేవ వంశజుఁడు, ఏకవీరుని పౌత్రుఁడు, జైతుగి కుంతల దేవుల పుత్రుఁడగు ఎల్లణదేవుడనువాఁడు కాకతి రుద్రమదేవి కృపవలన దేశమును పొంది, నిజ భార్యయైన రుద్రమదేవి రెండవ కుమార్తెకు పుణ్యముగాను, అలపాడు గ్రామమును 50 భాగము లకుపైగా సమస్తమైన భోగములతోడను పాత్రభూతులైన విప్రులకొరకు దానమిచ్చెనని యున్నది.

"అస్యా రుద్రమ దేవ్యాః కృపయా దేశం సమాసాద్య
నిజ భార్యాయాః కాకతి రుద్రమదేవీ ద్వితీయ తనయాయాః
పుణ్యార్థ మ యుగ్మాంతర పంచాశద్భాగ కల్పనయా
సహితం సర్వైర్భోగై ర్విప్రేభ్యః పాత్ర భూతేభ్యః
ప్రాయచ్ఛ దాలపాడుం ఎల్లణ దేవ క్ష్మానాథః

ఆమె పేరు మాత్రము శాసనములో చెప్పబడలేదు. ఉపలబ్ధమైన శాసన, వాఙ్మయాధారములనుబట్టి రుద్రమ దేవికి ముమ్మడాంబ, రుయ్యాంబ యని ఇద్దరు కుమార్తెలు మాత్రమే గలరని తెలియుచున్నది. అందు ముమ్మడాంబ భర్త మహాదేవరాజని, వారికి ప్రతాపరుద్రుడు జన్మించి నట్లు, రుయ్యాంబను ఇందులూరి గన్నయ పుత్రుఁడగు అన్నల దేవుడు వివాహమాడినట్లు స్పష్టమగుచున్నది. ఇక నీ ఎల్లణ దేవుని భార్య గూడ రుద్రాంబ కుమార్తెయేయని మొట్ట మొదట మా రీశాసనమునుబట్టి తెలియుచున్నది. ఆలపాడు గ్రామము నామె పుణ్యార్థము దానమిచ్చుటనుబట్టి బహుశః ఆమె యప్పటికే గతించిన ట్లగపడును. కనుకనే శివయోగ సారకర్తగాని, తదితరులుగాని ఆమెనుగూర్చి ప్రస్తావించ కుండుట గావచ్చును.

కాకతీయుల సేనాపతులనుగూర్చి వారు చతుర్థకుల ప్రసూతులనియే వర్ణించెను. కాని, శాసనదాతయగు రాజ రుద్రుఁడే వంశమువాఁడు, ఎచ్చటనుండి పాలించుచున్నా డనునది తెల్పబడలేదు. ఆతని తండ్రి వేలూరి బొల్ల ప్రభువు; తాత దేవయ వాహినీశుడు; ముత్తాత మరల బొల్ల సేనాని యని మూఁడు తరములవారు పేర్కొనబడిరి. ఈ వంశవృక్షమును పురస్క రించుకొని, యాతఁ డే వంశమునకు జెందినదియు, ఏ ప్రాంత మును బాలించినవాఁ డనునదియు తెలిసికొనవలసి యున్నది.



కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా జూటూరు పద్దగల లింగాల గ్రామములోని కాకతి ప్రతాపరుద్రుని కాలము నాటి శకవర్షములు 1213 నందన (క్రీ. శ. 1293) సంవ త్సరపు శాసన మొకదానిలో మహా సామంత్త చెఱకు వేలూరి బొల్లయరెడ్డి పుత్రుఁడగు రాచరుద్రుడు పేర్కొనబడి నాడు. అచ్చటనే గల మల్యాల, నందికొట్కూరు గ్రామముల లోని మరికొన్ని శాసనములలో నీ రుద్రదేవుడు చెఱకు పెద్ద దేవయ పుత్రుడగు మనుమ బొల్లయరెడ్డి కొడుకని గలదు. మనుమ బొల్లయరెడ్డి యనుటనుబట్టి, యాతని తాత గూడ బొల్లయ యని తెలియుచున్నది. ఈ శాసనములన్నియు కాకతి ప్రతాపరుద్రుఁడు యువరాజుగ నుండినపుడు శకవర్ష ములు 1212, 1213 (క్రీ. శ. 1291—93) ప్రాంత మున చెఱకు రుద్రదేవు డిచ్చిన దానములనుగూర్చి దెలుపుచున్నవి. ఈ శాసనములలో పేర్కొనబడిన వంశవృక్షము, కాలము సరిగా ప్రస్తుత దానశాసనములో వర్ణించబడినవానితో సరిపోవు చుండుటచే శాసనదాతయగు రాజరుద్రుడు పై శాసనముల లోని వేలూరి లేక మనుమబొల్లయరెడ్డి పుత్రుఁడగు రాచ రుద్రుడనియు, చెఱకు వంశీయుడనియు నిస్సందేహముగ నేర్పడగలదు.

కాకతీయుల సేనానులగు నీ చెఱకు వంశీయుల శాసన ములు కొన్ని నల్గొండ, మహబూబునగరు జిల్లాలలో గలవు. అందు నల్గొండజిల్లా జలాలుపురమున గల రెండు శాసన ములు చాలముఖ్యమైనవి. చెఱకు వంశీయుల వర్ణన వానిలో పూర్తిగ నున్నది. దురదృష్టముచే ఆ శాసనములు రెండును కొంత శిథిలావస్థలో నుండుటచే గొన్ని విషయములు మాత్రము స్పష్టమగుటలేదు. నా చేతనైనంతవఱకు వానిని సవరించి యందలి విషయము నిందు పొందుపఱచుచున్నాను.

బ్రహ్మపాదకమలములనుండి యుద్భవించిన ధర్మాత్ము లగు చతుర్థకులశేఖరుల వంశమందు కాటయ యనువాడు జన్మించెను. ఆతఁడు కొంగొంది ధవళుడను పురినిఁజంపి ఏఱువ మండలమును భేదించి చెఱకు పంద్రెండు గ్రామములను (బేత) రాజువలన పొందెను. అది మొదలు లోకమున నాతఁడు చెఱకు ప్రభువని రూఢియయ్యెను. నారాయణునకు లక్ష్మివలె నాతని నికి కామాంబిక భార్య లయ్యెను. వారలకు కేత, సూర, బొల్ల లను ముువ్వురు పుత్రులు గల్గిరి. అందగ్రజుఁడగు కేతనికి తిక్కాంబిక భార్య. ఆమెయందు కాట, మార, ఎఱ్ఱియ నామ ధేయులిరువురు మొత్తము నలుగురు పుత్రులు గలిగిరి. వారు కాకతి రుద్రదేవుని సేనానులుగ చోడోదయ భూపతిని, అరసాల సేనాపతి మున్నగువారినందఱిని నిర్జించి నిజస్వామి యైన రుద్రదేవున కశేష ధనములను సమర్పించిరి. కాకతి రుద్రనృపాలుడును, వారలకు గుండియపూడి, చెఱపూడి, గొట్టి పల్లి, పసులతొఱ్ఱు మున్నగున వనేక గ్రామముల నిచ్చెను. వారిలో (కాటయ) మన్మథుడు రతిదేవిని, ఇంద్రుడు శచిని, నారాయణుఁడు లక్ష్మినివలె కుప్పాంబను వివాహమాడెను. పాండురాజు కుంతియందు ధర్మజ, భీమార్జునులవలె నాతడు

కుప్పాంబయందు కాట, మార, బొల్లయ అను ముప్పుర పుత్రులను బడసెను.

శ్రీమద్రుహ్మాంఘ్రి సంభూతా
శ్చతుర్థ కులశేఖరాః
ధర్మాత్మనో జయం త్యేషాం
వంశే కాటాహ్వయోఽభవత్
క్రొంగ్గొండ ధవళం వ్యాఘ్రం
సభిత్త్వేఖువ మండలమ్
చెఱికు ద్వాదశగ్రామాన్
(లేభే బేత) నరేశ్వరాత్
తతః ప్రభృతి లోకేయ
మభవ చ్చెఱికు ప్రభుః
తస్య కామాంబికా పత్నీ
శ్రీపతే శ్రీ రివాభవత్
కేతసూరశ్చ బొల్లశ్చ
త యోర్జాతా స్త్రయస్సుతాః
తస్యాగ్రజస్య కేతస్య
పత్నీ తిక్కాంబికాఽభవత్
స తస్యాం తనయాన్ లేభే
కాటం మారం చ ధీయుతం
ఎఱియ ద్వయ మిత్యేతాన్
చతురః సద్గుణాన్వితాన్.

ఆసీ త్కాకతి రుద్రదేవనృపతిః స్తేషాం పతి ర్మానినాం
య శ్చోడోదయ ధారణీతలపతే ర్ధాటీ విశీర్ణీ కృతా
తన్ముఖ్యేప్యేరసాలు నామ పృతనాధీశో రణేనిర్జితః
తస్యాశేష ధనం సమర్పితే మభూత్తస్మై నిజస్వామినే

*　　*　　*　　*

కుప్పాంబా ముపయేమేఽసౌ
(కాటః) సౌభాగ్య శాలినీమ్
రతింకామః శచీమింద్రః
లక్ష్మింనారాయణో యథా
కాటం మారంచ బొల్లంచ
లేభే తస్యా మసౌ సుతాన్
కుంత్యాం పాండునృపో
ధర్మసుత భీమార్జునా నివ

ఈ శాసన కాలము శకవర్షములు 1124 దుందుభి సంవత్సర చైత్ర పౌర్ణమి భానువార మనగా క్రీ. శ. 1202 మార్చి 10. కుప్పాంబా పుత్రుడగు బొల్లయ తన తాత, తండ్రి, సోదరులపేర కేతేశ్వర, కాటేశ్వర, మారేశ్వరులను, సూర్యదేవరను ప్రతిష్ఠించి యనేక దానము లిచ్చినట్లు గలదు. ఈ బొల్లయ 'జమ్మలూరి పురవరేశ్వర, పరమ మాహేశ్వర, శ్రీ విశ్వనాథ దేవ దివ్య శ్రీ పద్మారాధక' యని పేర్కొనబడెను. ఈతని తాతలు కాకతి రుద్రదేవునకు చోడోదయుని నిర్జించుటలో సాయపడినట్లు గలదు. ఆతఁడు రుద్రదేవుని హనుమకొండ శాసనములో పేర్కొనబడినవాఁడే కావలెను.

రెండవ శాసనమున గూడ వీరి వంశవృక్షము సరిగా నిట్లే వర్ణించబడినది. కుప్పాంబికా నందనుడగు ఆ చెఱికు బొల్ల సేనాపతి పరాక్రమాదులు విశేషముగ నిం దుగ్గడించబడినవి. ఆతనికి గంగాదేవివలె మల్లాంబిక భార్య. ఆమెయందు వివిధ విబుధ రక్షణాదక్షులు, శత్రువులను నశింపజేయుట యందు కడు సమర్థులు, లమిత బలయుతు లగు నలుగురు పుత్రులను గణపతి, విశ్వనాథ, కేత, ఇమ్మడి విశ్వనాథులను వారలను బడసెను.

తటాకై రనేకై ర్విచిత్రైశ్చ సత్రై
ర్వనై శ్శీతలాసార సార ప్రపాభిః
సువర్ణ ప్రవర్ణై ర్వరై ర్ధేను దానై
రసౌ బొల్ల వీర స్సు పుణ్యో బభూవ

తస్యా సీ న్మల్లాఖ్యా
జాయా గంగే వయారేజే

*　　*　　*　　*

లమిత బలయుతా న్సుతాన్ స తస్యా
మలభత బొల్లచమూపతి స్తనూజాన్

కాంత శ్శాంతే ర్భువన మలినీ దేవరాజీవరాజీ
పూషా తేషాం గణపతి రితి ఖ్యాతిమా నగ్రజోఽభూత్
ద్వైతేయో కో పృతను పృతనాధీశ్వరో విశ్వనాథః
నామ్నాధామ్నా తరణి సరణిం మేరు ధీర స్స సూనుః

వివిధ బుధవరేషు శ్లాఘనీయ స్తృతీయో
జయతి జగతి వీరః ఖ్యాతిమా న్కేతయాఖ్యః
ద్విష దుదయ దశాభి ర్ధహ్యమానాభి రుచ్చై చ్చ
ర్జ్వలయతి నితరాం య స్వప్రతాప ప్రదీపమ్

సుశ్రీ రిమ్మడి విశ్వనాథ ఇతి భూలోకైక కల్పద్రుమ
స్తుర్యోయం ద్విజవర్య సేవిత రసాభోగ స్సహాఖ్యాయతే
సామోద స్సుమన స్స్ఫురన్మధుర వా ఙ్మానా ఫలై రన్వహం
యో విద్యాధర సిద్ధ సాధ్య వివిధా నానంద యత్యాశ్రితాన్

తదుపరి ఈ ఇమ్మడి విశ్వనాథుని గుణగణములు పరాక్రమాదులు ప్రశంసించబడినవి. కిదప ఇమ్మడి దేవయ, బహుశః ఆతని పుత్రుడే గావచ్చును, శకవర్షములు 1175 ప్రమాది సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి శుక్రవారమనగా క్రీ. శ.

# రాజరుద్రుని గొరవెంకపల్లి దానశాసనము

1253 ఏప్రిల్ 4 న బొల్లేశ్వర, మల్లేశ్వర, గణపేశ్వరులని శివలింగములను ప్రతిష్ఠించి, వాని కనేక దానములొసంగి నట్లున్నది.

శాకే బాణ స్వరేశాన మితేబ్దే చ ప్రమాదినీ
వైశాఖ శుద్ధ పంచమ్యాం శుక్రవారే శుభే దినే
బొల్లేశ్వర మల్లేశ్వర
గణపేశ్వర నామ శైవ లింగానామ్
కృతవా నసౌ ప్రతిష్ఠాం
ప్రాసాదే ష్విహ శివ ప్రసాదార్థే

*   *   *   *

ఇమ్మడి దేవయ రథినీశ్వర
వర ధర్మోత్ర సుస్థిరో భవతు
ఆకల్పం భూలోక స్సు కల్పః
కల్పతే తి తరాం యోఽయమ్

ఇమ్మడి దేవయతండ్రి ఇమ్మడి విశ్వనాథ రథినీనాథుని ప్రశస్తితో శాసన మంతమగును.

ఈశాసనమునుబట్టి చెఱకు బొల్ల సేనాని కాకతి మహాదేవ, గణపతుల కాలముననుండినట్లును నాతని పుత్రులందఱు గణపతి దేవుని సేనాపతులనియు తెలియుచున్నది. ప్రస్తుత దాన శాసనములో మొట్టమొదట పేర్కొనబడిన బొల్లయ ఈతఁడే. కాని, ఈతని పుత్రుడు దేవయ వాహినీశుఁడు జలాలపుర శాసనమున చెప్పబడలేదు. ఇమ్మడి విశ్వనాథుని పుత్రుఁ డొక ఇమ్మడి దేవయ యుండుటచే నీ బొల్లయరెడ్డి పుత్రుడగు దేవయపేరు కర్నూలుజిల్లా మల్యాల శాసనమున పెద దేవయ యని వ్యవహరించబడినది. ఈ పెదదేవయ మల్లాంబికా పుత్రుడగునో కాదో తెలియదు.

మహబూబునగరుజిల్లా ఆత్మాకూరులో వీరివి మూఁడు శాసనము లున్నవి. మొదటి శాసనమున శకవర్షములు 1186 రక్తాక్షి (క్రీ.శ. 1264) లో ఇమ్మడి దేవయ మహా సామంత చెఱకు ఇమ్మడి విశ్వనాథ దేవరకు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగా శ్రీ సిద్ధ మహాలక్ష్మీ దేవి ప్రతిష్ఠను గావించి కొన్ని దానము లిచ్చినట్లు గలదు. ఇందలి ఇమ్మడి విశ్వనాథ, దేవయలు పై జలాలపురశాసనములో పేర్కొనబడిన తండ్రి, కొడుకులే యనుటకు సందియములేదు. శకవర్షములు 1208 వ్యయ (క్రీ. శ. 1286) నాటి రెండవ శాసనమున శ్రీ మన్మహా సామంత చెఱకు ఇమ్మడి బొల్లయరెడ్డి బహుశః ఆతని తండ్రి ఇమ్మడి దేవయకు పుణ్యముగా కొన్ని దానములు చేసినట్లున్నది. మూడవ శాసనమున శకవర్షములు 1217 మన్మథ (క్రీ. శ. 1295) లో శ్రీ మన్మహా సామంత చెఱకు ఇమ్మడి జెటిబొల్లయ రెడ్డి పృథ్వీరాజ్యము చేయుచుండగా నాతని లెంక భొప్పరి పోచెయ అమురాది మైలారదేవునకు కాల్వ యొకటి వృత్తిగా నిచ్చెనట. ఈ రెండు శాసనములలో పేర్కొనిన ఇమ్మడి లేక జెటి బొల్లయరెడ్డి, ఇమ్మడి దేవయ పుత్రుడు, విశ్వనాథుని పౌత్రుడు కావలెను. నందికొట్కూరు శాసనములను, ప్రస్తుత దాన శాసనమున ప్రశంసించబడిన పెదదేవయ పుత్రుడగు మనుమ లేక వేలూరి బొల్లయ ఈ ఇమ్మడి లేక జెటి బొల్లయరెడ్డి సమకాలికుడు మాత్రమే. వా రిరువురను భిన్న వ్యక్తులుగనే గ్రహింపవలయును.

మహబూబునగరుజిల్లా కొల్లాపురము తాలుకా కల్వకొలను గ్రామమున నీ చెఱకు సామంతుల శాసనములు మరి మూడు గలవు. శక వర్షములు 1208 వ్యయ (క్రీ. శ. 1286) శాసనమున మహా సామంత చెఱకు గణపతిదేవుడు, ప్లవంగ సంవత్సరమునాటి శాసనమున ఇమ్మడి దేవయ, కాకతి ప్రతాపరుద్రునికాలము శక వర్షములు 1243 దుర్మతి (క్రీ. శ. 1321) నాటి మూఁడవ శాసనమున మహా సామంత చెఱకు జగదాళు ఇమ్మడి దేవయంగారి పుత్రుడు ప్రోలయరెడ్డి వరుసగా పేర్కొనబడినారు.

పైన వివరించిన శాసనములన్నియు సమన్వయము చేసిన నీ చెఱకు సామంతుల తాత్కాలిక వంశవృక్ష మీ క్రింది విధముగ గన్పట్టును.




కృష్ణాజిల్లా నందిగామ తాలుకా నడిగూడెములోని జమీందారుగారి ఇంటిముందుగల కాకతి ప్రతాపరుద్రుని కాలమునాటి మూఁడు శాసనములలో నీ చెఱకు వంశీయు లిరువురనుగూర్చి గలదు. మొదటి శాసనము శక వర్షములు 1222 శార్వరి (క్రీ. శ. 1300) నాటి దానిలో మహా సామంత చెఱకు జగద్దాళు మారయ గణపయరెడ్డి; రెండవది శక 1228 ప్లవంగ (క్రీ. శ. 1307), మూడవది శక 1236 ఆనంద (క్రీ. శ. 1314); వానిలో చెఱకు జగద్దాళు అన్నమరెడ్డివారు పేర్కొనబడినారు. వీరికి పై వంశవృక్షమువారితో నేమి సంబంధమో స్పష్టముగ తెలియదు.

విర్యాల, మల్యాల, రేచెర్ల మున్నగు తదితర చతుర్థ వంశజులవలె నీ చెఱకు సామంతులు కూడ కాకతి రాజులను మొట్ట

మొదటినుండియు పుత్ర పౌత్రాను పారంపర్యముగ సేవించుచు వారి యుద్ధములలో పాల్గొనుచుండిరని విశదమగుచున్నది.

దోనూరి కోనేరునాథకవి రచించిన ద్విపద బాల భాగవతమున ఆరవీటి వంశకర్తయగు తాత పిన్నమరాజు చెఱకు రాజనరేంద్రు నొకని గెలిచి యాతని సప్తాంగములను హరించినట్లు వర్ణించబడినది.

సమితారి తాత పిన్న మహీవిభుండు
సమితిలో జెరకు రాచ నరేంద్రు గెలిచి
అలవుగా సప్తాంగ హరణం బొనర్చి
పాలు పొందె భువి మన్నె పులి యను పేర

రామరాజీయమునందు కూడ తాత పిన్నమరాజు బిరుద గద్యలో "సమస్త దురాచార చెరకు రాచనాయక రాజ సప్తాంగ హరణ" అనిగలదు. వీనినిబట్టి అతఁ డొక చెఱకు రాచనరేంద్రుని నిర్జించెనని స్పష్టము. ఆ చెరకు రాజనరేంద్రుడు ప్రస్తుత దాన శాసన దాతయగు రాజరుద్రుడేగాని, లేదా యాతని సంతతివాఁడుగాని కావచ్చును.

ఈ శాసనోద్దేశ్యము కడు విచిత్రమైనది. రాజరుద్రుఁడు తన తండ్రి గయా శ్రాద్ధ నిమిత్తము నలుగురు బ్రాహ్మణులకు గొరవెంకపల్లి అగ్రహారమును దానమిచ్చెను. ఇంతవఱకు నుపలబ్ధమైన తామ్ర శాసనము లన్నింటిలో నీ విధముగ గయా శ్రాద్ధ నిమిత్త మీయబడిన దాన శాసన మిది యొక్కటియే. గయలో దొరకిన దక్షిణ హిందూదేశపు రాజుల శాసనములు కొన్ని వెనుక భారతిలో ప్రకటించితిని. అవి యన్నియు, ఆ యా రాజుల కాలమున వారి వారి ప్రతినిధులుగగాని స్వయముగగాని, గయాక్షేత్రమున కరిగి పితృకార్యాదులను నిర్వర్తించిన పిదప నచట వేయించిన శాసనములు. ఈ దాన శాసనము రాజరుద్రుడు తన తండ్రి బొల్లయరెడ్డి గయా శ్రాద్ధమునకు బ్రాహ్మణులను నియోగించి వారట్లు నిర్వర్తించినందుల కీయబడిన దానమును గూర్చి తెల్పుచున్నది. తండ్రిని మాత్రమే పేర్కొనుటచే నాతని తల్లి ఇంకను జీవించి యుండినట్లు తలంపవలెను. పై నుదహరించిన మల్యాల శాసన మొకదానిలో శక వర్షములు 1213 ఖర సంవత్సర వైశాఖశుద్ధ పౌర్ణమి గురువారమనగా క్రీ. శ. 1291 ఏప్రిల్ 15 నాండు చెఱకు పెదదేవయ కొడుకగు ఎనుమబొల్లయరెడ్డి పేరను బొల్లేశ్వరమని లింగ ప్రతిష్ఠచేసి, శివాలయ మంటపాదులను కట్టించి మఠము లేర్పాటుచేసి కొన్ని దానము లిచ్చినట్లు గలదు. దీనిని బట్టి క్రీ. శ. 1291 పూర్వమే బొల్లయరెడ్డి శివైక్యమును పొందియుండును.

ఈ దానము ఆశ్వయుజ మాస శుద్ధ అష్టమినాఁ డనగా నవరాత్రులలోని మహాష్టమి పుణ్యకాలమందీయబడినది. దానికి ముందు భాద్రపదమాసపు మహాలయ పక్షములలో రాజరుద్రుడు బ్రాహ్మణులను గయకు పంపి యుండును. స్వయముగ తానే గయకు వెళ్లనక్కర లేదనియు, నామగోత్రములు చెప్పి, యెవరిచేతనైనను పితృకార్యములు చేయించవచ్చునని "నామగోత్రే సముచ్చార్య పిండపాతన మిష్యతే; యేన కేనాఽపి కస్మైచి త్పృయాతి పరమాంగతిమ్," అని యుండుట రాజరుద్రుఁడు ముగ్గురు బ్రాహ్మణుల నందులకు నియోగించెను. కాకతీయుల కాలమున వారి సేనానుల శాసనములలో చాలచోట్ల గయ, వారణాసి ప్రస్తావన గలదు. ప్రస్తుతము హనుమకొండలోని రాజరాజనరేంద్రుని గ్రంథాలయమువద్ద పడియున్న కాకతి మొదటి రుద్రుని నాటి శాసన ఖండ మొక దానిలో నాతని మంత్రి పుంగవు డగు గంగాధరుని గూర్చి ఇట్లున్నది.

యేన స్నాతం త్రిదశ తటినీ పావనే వారిపూరై
ర్దత్తాః పిండా నిజపితృగణ ప్రీతయే రుద్రపాదే
వారాణస్యాం విధివ దసకృ త్పూజితో విశ్వనాథ
స్తీర్థేతీర్థే వసు వితరణైస్తర్పితా శ్చార్థివర్గాః

దశాశ్వమేధ మున్నగు తావుల నాతఁ డొనరించిన ధర్మకార్యములు గూడ అందు వివరించబడినవి. సిద్ధేశ్వర చరిత్రమున రుద్రయదేవుఁడు తనతండ్రిని జంపిన పాపమును బోగొట్టుకొనుట కనేకమంది బ్రాహ్మణులను కాశి, గయాక్షేత్రములకు పంపినట్లు వర్ణింపబడియున్నది. ఈ రుద్రదేవుని కాలమునాటి శాసన మొకటి గయలో గలదు. గణపతిదేవుని కాలమున అతని సేనాని మల్యాల గుండయ అలేటి అప్పయ యను బ్రాహ్మణుని వారణాసికి, గయకునుపంపి, అందుల కిచ్చిన దానము బూదపుర శాసనములో వివరించబడినది. మొత్తము కాకటీయులనాటి శాసనములలో నివి గాన్పించినంత బహుళముగ తదితర రాజుల శాసనములలో నెచ్చటను గానరావు. కాకతి రాజులు, వారి సామంతులు, సేనానులు కూడ గొప్ప శివభక్తులు. ఆ కాలమున వారు గావించిన లింగప్రతిష్ఠలు, కట్టించిన శివాలయములకు లెక్కయేలేదు.

ప్రతి గ్రహీతంలో మొదటివాడును, దత్తాగ్రహారములో సగభాగమును పొందినట్టి వాసుదేవ మండలికుఁడు గయాక్షేత్రమున కధినాయకుడట. ఈతఁడు ఉత్తర హిందూస్థానమువాఁడు. ఇతని యాజమాన్యముననే ఆ పితృకార్యము నిర్వర్తించబడినది. కనుకనే ఆతనిది సగభాగము. మిగత ముగ్గురు మైలార అప్పయ, పోతిపెద్ది, బొల్కిమంచులు ఆంధ్రదేశస్థులు. రాజరుద్రునిచే పితృ కార్యార్థము గయకు పంపబడినవారు. కావున వీరి ముగ్గురది ఆ గ్రామములో మిగత సగ భాగము. ఉత్తర దేశస్థుని 'వాసుదేవ మండలికుడని' దక్షిణ దేశస్థుని 'మైలార అప్పయ' యని ఇంటిపేరులు ముందు వెనుకనుంచి శాసనకర్త వ్యవహరించుట గమనించదగినది. ఇట్టి ఆచారము 13 వ శతాబ్దముననే భారతదేశమున గలదు.

దత్తాగ్రహారము గొరవెంకపల్లి యెచ్చటిదో తెలియుటలేదు. బహుశః అది రాజరుద్రుని పాలనములోని నేటి కర్నూలు మండలములో నుండవలెను.

శాసనము నిర్దుష్టమైన సంస్కృత శ్లోకములలో ప్రహర్షిణీ, ఉపజాతి, వసంతతిలకా, మాలినీ, ఇంద్రవజ్రా, ఉపేంద్రవజ్రా, స్రగ్ధరా వృత్తములతో సుందరమైన చిన్న కావ్యమువలె శోభించుచున్నది. కవికి చక్కని ధారాశుద్ధి గలదు. ఆతని పేరుమాత్రము తెలియదు.

# వసంతోత్సవము

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఇందీవరమ్ముల నీను గ్రాల్గన్నుల
శరదిందుముఖులు చామరము లిడగ
పణిసనూను కణాద బాదరాయణ సూత్ర
ఫక్కి విద్వాంసు లుపన్యసింప
పార్శ్వభూమి నభీరు భట కదంబ కరాళ
హేతిచ్ఛటాచ్ఛాయ నిరులుకొనగ
సామంత మండనోద్దామ మాణిక్యాంశు
కుండలం బొలసి యారెండ గాయ
మూరు రాయరగండ పెండారమణి మ
రీచి రింఛోళి గలయ నావృతములగుచు
నంకపాళి నట ద్దుకూలాంచలములు
చిత్ర మాంజిష్ఠ విభ్రమశ్రీ వహింప

భువనవిజయాఖ్య సంస
ద్భవనస్థితసింహపీఠి ప్రాజ్ఞుల గోష్ఠిన్
కవితా మధురిమ డెందము
దవులన్ గొలువుండె సదయుడవ్ ప్రభు వగుచున్....

యాదవత్వమున సింహాసనస్థుడుగాని
సింహాసనస్థుడై చెన్ను మెరయు
గొల్ల ఇల్లాండ్రతో గోడిగించుటచేసి
పరకామినీ సహోదరత జూప
మఱి జరాసుతునకై మధుర డించుటచేసి
పరపర్గ దుర్గముల్ బలిమి గొనగ
పారిజాతము సాసపడి పట్టి తెచ్చుట
నౌదార్యమున దాని నడుగు పరుప
గోరి తొలుమేన తనకైన కొదువలెల్ల
మాన్చుకొన వచ్చి భువనైకమాన్యలీల
నవతరించిన కృష్ణుడౌననగ మించె
నరసవిభుకృష్ణరాయ భూనాయకుండు...

దయమానాక్షివిలోక
లోకహితకృత్ప్రారంభ
రంభాకుచద్వయదుర్గాధిపతిద్విషత్ప్రతీత
గాథావ్యక్తదోస్సార
సారయస్సాంద్రదిశాంత
శాంతహృదయారజ్యన్నయాచార
చారయుతోపాయవిచార
చారణగణప్రస్తూయమానోదయా
అతులక్షాంతిగభీర భీ రహితచిత్తాంభోజ భోజక్షమా
పతివిద్యాపరిపాక పాకరిపుశుంభద్భోగ భోగాధిప
ప్రతిరనూఫర్త్యనుభావ భావభరితశ్రీకాంత కాంతారపా
లితకాళింగకులేశ లేశతరవృత్తిక్షీణవైరివ్రజా.....

*　　*　　*　　*

చిన్నాదేవి:—అక్కగారూ, తిరుమలదేవిగారూ! మీ తాతగారైన నందితిమ్మనగారు ముక్తపదగ్రస్తములో పద్యము చెప్పినారని పెద్దన్నగారు గూడ చెప్పినారు. ఏమైనను పెద్దన్నగారి గంభీరమైన శైలిముందు తాతగారి మృదువైన శైలి నిలుచుట లేదు.

తిరుమల:—చెల్లీ చిన్నాదేవీ....మొదటి రెండు పద్యములలో నే నొప్పుకొనుచున్నాను. ఇందీవరమ్ముల నీను గ్రాల్గన్నుల అన్న పద్యము ముందు యాదవత్వమున సింహాసనస్థుడుగాని యన్న పద్యము కొంచెము వెనుకపడుతుందేమోగాని ఈ ముక్తపదగ్రస్త పద్యాలల్లో మా తాతగారిదే పయిచేయి.

చిన్నా:—ఎందుచేత ?

తిరుమల:—తాతగారి పద్యం దయామానాక్షి అని మొదలుపెట్టింది. చివర ప్రస్తూయమానోదయా అని యున్నది. మొదటి దయా అన్న ముక్తమైన పదము ఈ ఉదయా అన్న పదంలో గ్రస్తమైంది. మధ్యనున్న లోక లోక, సార సార, శాంత శాంత, చార చార—అవి ముక్తపద గ్రస్తాలు....ఇది మళ్లీ ముక్తపదగ్రస్తమవటంవల్ల అలంకారం సంపూర్ణమైంది. పెద్దన్నగారి పద్యంలో మొదటి అతుల అన్న శబ్దం మళ్లీ రాలేదు.

చిన్నా:—అక్కగారూ.....తమరు పట్టమహిషులు.....తమరిదృష్టి నా కెట్లా వస్తుంది?

తిరు:—చెల్లీ వసంతోత్సవం జరుగుతోంది. మన అష్టదిగ్గజములైన కవులేకాక, చాలమంది కవులు వచ్చారు. మనం మాట్లాడుకొంటూ కూర్చుంటే వాళ్ల కవిత్వాలు వినటం పడదు.

చిన్నా:—మనం ఇక్కడ కూర్చున్నంతసేపు చక్రవర్తిగారు మనవంక చూస్తూ, మనం ఉన్నామని సింహాసనం మీద నుంచి కదలరు. మనం అంతఃపురంలోకి పోదాం. అంతః

పురోద్యానంలో నిజమైన వసంతోత్సవం జరుగుతోంది. ప్రాణనాథులు అక్కడకు వస్తామన్నారు. ప్రభువులు మనవంక చూచేప్పటికి మనం కనిపించకపోతే వారు కూడ తొందరగా వస్తారు.

తిరు:—మరి ఈ కవులందరినీ వినటం ఎలాగా? వారెవరెవ్వరో తెలిసికోటం ఎలాగ?

చిన్నా:—వీరందరినీ చూడట మెందుకు....అష్టదిగ్గజాలకంటె గొప్పవారేమి?

తిరు:—అలా అనగూడదు చెల్లీ......వారందరూ గొప్పవారే. మన అష్టదిగ్గజాలు వారికంటె కొంత గొప్పవాళ్ళ కావచ్చు....మన అష్టదిగ్గజాలలో మాత్రం అందరూ పెద్దన్నగారంతవారా ఏమిటి?

చిన్నా:—అక్కగారూ......అందుకనే మీరు పట్టమహిషి కావటానికి యోగ్యమైనవారు. నంది తిమ్మనగారు మీ అరణపు కవి, మీకు మహోపకారి. ముద్దుపళ్ళు కాణాచి మీ తాతగారు......వారిని వదలిపెట్టి మీరు పెద్దన్నగారినే గొప్ప చేస్తున్నారు.

తిరు:—అయితే పోదాం పద. నా వంది ఉన్నాడు. వసుబంధుడు. ఆయన వచ్చి, ఆ కవులందరినిగూర్చి మనకు చెప్తాడు. నీ వన్నట్లు చక్రవర్తిగారు కూడ క్రీడా సరస్సునిగల ఉద్యానంలోకి తొందరగా వస్తారు. చిమ్మనగ్రోవులు సువాసనాద్రవ్యాలతో నింపిన వసంతంతో నిండిన గంగాళాలతో సామంత ప్రభువుల కూతుళ్ళు, చెలికత్తెలు, పరిచారికలు మనకోసం అక్కడ వేచిఉంటారు...... పద......

*  *  *  *

ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంఫిత కావ్య
స్మృతిరోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూ ప్రసాదన రసికా....

చిత్తజభిదంఘ్రియుగ చింతనకళాధి
గతజిష్ణుసమ వైభవ విశేషా
విత్తరమణామరగవీ తరణిభూజలద
విశ్రుతకరాంబురుహ గోష్ఠీ
నృత్తమణిరంగతల నీతిమనురాజనిభ
నిర్భరదయారసపయోధీ
మత్త గజయూథ మదమగ్న సుఖితాళిరవ మాన్య
గృహమంగళమహశ్రీ....

సుధీమధురవాక్సుధాసుముఖ నాగమాంబాసుతా
మధుప్రసవసాయక స్మయ విరామరమ్యాకృతీ
దధీచ విధు కామధుక్ ధనద దుగ్ధ సింధుప్రదా
వధీరణ పరాయణోజ్జ్వలవదాన్యతాలంకృతా..

తిరుమలదేవీ చరణో
దర లాక్షాకల్ప కల్పితస్థలకమలా
స్ఫురదిందీవర బంధుర
హరిహయమణివలయకూట హర్మ్యవిహారీ....

*  *  *  *

చిన్నా:—అక్కగారూ! అక్కగారూ విన్నారా.....విన్నారా....!

తిరు:—చిన్నా! విన్నానమ్మా విన్నాను.

చిన్నా:—పెద్దన్నగారికి మీ యందెంత గౌరవము!

తిరు:—చెల్లీ! ఆ మహాకవు లిద్దరు చక్రవర్తికి మనయందెప్పుడు ప్రేమ చెడిపోకుండా రక్షిస్తున్నారమ్మా....

చిన్నా:—అది అట్లా ఉంచండి. ప్రభువు శ్రీ కృష్ణదేవుడైతే మీరు రుక్మిణీదేవి.....ఆయన శ్రీరామచంద్రుడైతే మీరు సీతాదేవి......

తిరు:—మొదటిమాటే బాగుంది చెల్లీ......

చిన్నా:—నేనంటే మీకు ప్రేమ ఎప్పుడులేదు?

*  *  *  *

శ్రీసదనలోచనాబ్జద
యూసారమరందపోషితార్థిభ్రమరో
ల్లాసగుణ మలయకూట
ప్రాసాదనివేశ కృష్ణరాయ మహీశా.

*  *  *  *

చిన్నా:—అదుగో మహాప్రభువులు భువన విజయాన్ని వదలిపెట్టి మలయకూటానికి వస్తున్నారు.

తిరు:—అవునమ్మా....మనమూ మలయకూటాన్ని అంటుకొనియున్న పుష్పోద్యానం దగ్గరకు వచ్చాము. అటు కవుల పద్యాలు వినిపిస్తున్నై. ఇటు రాచకూతుళ్ళ, చెలికత్తెలు వాళ్లలో వాళ్ళ మాట్లాడుకుంటూ మన కోసం ఎదురు చూస్తున్న నవ్వులూ, మాటలూ వినిపిస్తున్నై.

చిన్నా:—అయితే మన మక్కడకు పోదాం....

తిరు:—ఎల్లాగైనా ప్రభువు వసంతోద్యానంలోకి వచ్చేసరికి ఆలస్యం పడుతుంది. ఈలోగా వసుబంధుడు వస్తాడు. అతడు ఎంతమంది కవులు వచ్చారో చెపుతాడు. వాళ్లను గురించి విని వెళ్దాం.

చిన్నా:—అల్లాగే.

తిరు:—అదుగో వసుబంధుడు.

వసు:—మహారాణుల కిద్దరకు నమస్కారము.

తిరు:—ఏమయ్యా భట్టూ, మేము పెద్దన్నగారూ, తిమ్మన్నగారూ పద్యాలు చదవగా మాత్రమే విన్నాము. ఇంకా ఎవ రెవరు వచ్చారు.

వసు:—చాలామంది కవులు వచ్చారు తల్లీ....మాదయ్యగారి మల్లన్న వచ్చారు.

చిన్నా:—ఆయన మన అష్టదిగ్గజములలోనివారేగదా. రాజశేఖరచరిత్రం వ్రాసినవారు.

వసు:—మన ధూర్జటిగారు కూడ ఉన్నారు.

చిన్నా:—ఏదీ! ఆ పద్యం చదువు....స్తుతమతియైన యాంధ్రకవి యన్నపద్యం.

తిరు:—చెల్లీ....నీకింకా చిన్నతనం పోలేదు.

చిన్నా:—అదికాదు అక్కగారూ......కామిగాని మోక్షగామిగాడు. ఆయన శివైక్యం పొందుతాడు.

తిరు:—మనం వైష్ణవులమ.

చిన్నా:—కాని, నందితిమ్మయ్య తాతగారు ఇందాక చదివిన పద్యం చూడండి. చిత్తజభిదంఘ్రియుగచింతన కళాధిగత జిష్ణు సమ వైభవ విశేషా....శివపదారాధన చేయటం మూలంగా చక్రవర్తిగారి కింత భోగం వచ్చిందట.

తిరు:—అందులో తప్పులేదు. ఈశ్వరునియొక్క భావం ఐశ్వర్యం.....శివారాధనచేస్తేనే ఐశ్వర్యం వస్తుంది.

చిన్నా:—ఏమయ్యా వసుబంధూ, అయ్యలరాజు రామభద్రుడుగారు పద్యాలేమైనా చదివారా?

వసు:—చదివారమ్మా.

చిన్నా:—ఆయన ఎంత మంచి కవయ్యా. ఆయన రామాభ్యుదయంలోని పద్యం మొన్న వచ్చి నా కొకటి వినిపించారు. ఆ పద్యం మళ్లీ వినిపిస్తావా..... అక్కగారు కూడ వింటారు....

.కానక కన్న సంతానంబు గావున
కానకే కన్న సంతానమయ్యె

చిన్నా:—శ్లేషంటే అట్లా ఉండాలి. తెలుగు మడికారంలోంచి శ్లేష పుట్టించటం.....

వసు:—అమ్మా! తక్కిన పద్యం కూడ చదవమంటారా?

చిన్నా:—వద్దులేవయ్యా.....తక్కినవన్నీ సంస్కృత శబ్దాల లోంచి శ్లేషలు పుట్టించటమేగా......ద్విజ గోత్ర అగమ శబ్దాలకు చాలా అర్థాలున్నాయయ్యే, అందులో పెద్ద నేర్పులేదు.

వసు:—రామరాజభూషణుడుగారు కూడ పద్యాలు చదివారు.

తిరు:—శ్లేష అంటే నీ కాయన గుర్తు వచ్చాడు కాబోలు.

వసు:—అవును మహారాణీ! శ్లేష అంటే సంస్కృతంలో సుబంధుడు, తెనుగులో రామరాజభూషణుడు గుర్తుకు వస్తారు కదు తల్లీ...

చిన్నా:—పింగళి సూరన్నగారి రాఘవ పాండవీయం మాత్రం తక్కువదా....

రెండర్థమ్ముల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యమ్ముగా
కుండున్ తద్గతి కావ్య మెల్ల నగు నేనోహో యనంజేయదే
పాండిత్యం బది యెందునన్ దెనుగుకబ్బం బద్భుతంబంద్రు ద
క్షుం డెవ్వాడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్

తిరు:— భట్టుమూర్తిగారు కూడ హరిశ్చంద్రనలోపాఖ్యానము వ్రాసినాడుగదా. కాని కథలు జోడించాడట. అది బాగుంది కదా......

వసు:—తల్లీ శబ్దస్వారస్యం తెలియటంలో ఈ రాజ్యంలో తమకంటె ఎవరున్నారు? తిమ్మన్నగారి ఆ పద్యంలో ఆడంబర శబ్దానికి తమరు చేసిన వ్యాఖ్యానం నే నొకనాడు ప్రభువులతో మనవి చేశాను.

తిరు:—అవునయ్యా.....నీ యుపకారం మరచిపోను.

చిన్నా:—ఏమిటాపద్యం? చదివి ఆ వ్యాఖ్యానం నాకు కూడ విన్పించు......

వసు:—

సమ్మర్దక్షమధీనిబంధనవిధాసంక్రందనాచార్య ధీ
రమ్మన్యాచలవజ్రపాత ధరణీరక్షాంబుజాక్షా చర
ధ్యమ్మార్గస్థదశాస్యరాజ్యసమసహ్యప్రోద్భవాతీర భా
గుమ్మత్యారి శివంసముద్రపుర వప్రోత్తమ్మాల నాడంబరా

అమ్మా, శివసముద్రము కావేరీనదిలో నున్నది. దానియొకపాయ యా దుర్గమును చుట్టి వచ్చుచున్నది. సేనలా కోటను ముట్టడించుటకు వీలులేకపోయెను. అపుడు చక్రవర్తిగారు పెడగా నొక పెద్ద కాలువ త్రవ్వించి ఆ నదినీరు దానిలోనికి మళ్లించి, అపుడు దుర్గమును ముట్టడించినారు. శ్రీ పట్టపురాణిగారు చేసిన వ్యాఖ్యాన మేమనగా లక్షమంది సైన్యము కాలువ త్రవ్వెడివారు త్రవ్వుచుండగా, నీరు మరలించెడివారు మరలించుచుండగా, నీరు లేక ఎండిపోయిన కావేరి యడుగుభాగమునందలి బురద నెండించెడివా రెండించుచుండగా, కోటకు లగ్గ లెత్తెడివారు ఎత్తించుచుండగా ఆ దృశ్య మెట్లుండవలయును. ఇది యంతయు నా ఆడంబర శబ్దము సూచించు చున్నదట.

చిన్నా:—అక్కగారికి నమస్కారము. తమరిబుద్ధి ధ్వనివేత్తల బుద్ధితో సమానంగా ఉంది.

తిరు:—వసుబంధూ, పింగళి సూరన్నయు, తెనాలి రామకృష్ణయ్యయు వయస్సుచేత చిన్నవారు గదా......

వసు:—అవును మహారాణీ, వా రిద్దరు నష్టదిగ్గజములలోనివారే. వారి వయస్సే కలిగిన ఇంకొక మహాకవి కలడు.

చిన్నా:—ఆయన పేరు?

వసు:—చరిగొండ ధర్మన్న.

చిన్నా:—అంత గొప్పవాడా?

వసు:—ఆయన శతావధాని.

తిరు:—అనగా నేమి?

వసు:—ఆయనను గురించి ఎవరో యనిన ట్లీ పద్యమున్నది.

శతలేఖిన్యవధాన పద్యరచనానంధానురత్రాణ చి
హ్నితనామా చెరికొండ ధర్మనుకవీ నీ వాగ్విలాసమ్ము తా

శితికంఠోజ్జ్వల జూటకోటర కుటీ శీతాంశురేఖా సుధా
న్వితగంగా కనకాబ్జ నిర్భర రసావిర్భూత మాధుర్యముల్

చిన్నా:—బాగున్నది. శతలేఖిన్యవధానమంటే ఏమిటి?

వసు:—ఒక్కసారి వందమంది కూర్చుండి, వంద ప్రశ్నలు వేయుచుండగా, వందమందికిని వారువా రడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పుదురు....

చిన్నా:—అందులో గొప్పేముంది? కొంచెము కష్టమేననుకో.

వసు:—అమ్మా! అంతేకాదు. వందమందికి వంద పద్యములలో మొదటి పాదములే చెప్పుదురు. తరవాత నా రడుగకుండ ఎవ్వరును గుర్తు చేయకుండ నా వంద పద్యముల రెండవ చరణములు తనంతట తానే చెప్పికొంచు పోలవయును. అట్లే మూడు నాల్గు చరణములును చెప్పవలయును. తరువాత నీ సంఖ్యగల పద్యమును చదువుమన్న ఏ చదువవలయును....

తిరు:—వసుబంధూ, ఆయనట్లా చేస్తాడా?

వసు:—చిత్తము మహారాణీ.

తిరు:—పూర్వ మెవరైనా యిట్లా చేసినవారున్నారా?

వసు:—ఈవిద్య కాయనే మొదటివాడు. దీని నాయనయే కనిపెట్టినాడు.

చిన్నా:—అయితే అందరుకవులకంటే ఆయనే గొప్పవా డంటాను.

వసు:—కాదుతల్లీ, ఆయన గొప్ప జ్ఞాపకశక్తి కలవాడన్నమాట. ఇంతకంటె కావ్యమునందు రస ముత్తమ మైనదిగదా. సంకుసాల నృసింహకవిగా రున్నారు. ఆయన తన రస నిర్మాణశక్తినిగురించి యిట్లన్నారు.

యతి విటుడు కాకపోవునే యస్మదీయ
కావ్య శృంగారవర్ణ నాకర్ణనమున
విటుడు యతి కాకపోవునే యస్మదీయ
కావ్య వైరాగ్యవర్ణ నాకర్ణనమున

చిన్నా:—ఆయన మన యష్టదిగ్గజములోనివాడేగదా...

తిరు:—వసంతోత్సవమున కీ మహాకవులందరు వచ్చిరా...

వసు:—వచ్చినారు తల్లీ!

చిన్నా:—ఒకరిని వదలిపెట్టినట్లున్నావయ్యా.....

వసు:—చిత్తము చిత్తము.... కందుకూరి రుద్రకవిగారిని మరచిపోయినాను....ఆయన ఈశాన్యదిశా గజము.

చిన్నా:—ఆయన గొప్ప మంత్రశాస్త్రవేత్త యటగదా...

వసు:—అవునమ్మా, యీమంత్రశాస్త్రము మనదేశములో తొలినాటినుండియు నెక్కువగా విశ్వబ్రాహ్మణుల యందున్నది. ఆయన విశ్వబ్రాహ్మణుడు....గొప్పపండితుడు.

తిరు:—ఆయన ఏమైనా గ్రంథమును వ్రాసెనా?

వసు:—రెండు గ్రంథములు వ్రాసెను. ఒకటి నిరంకుశోపాఖ్యానము. అది చాలా ప్రౌఢప్రబంధము. రెండవది సుగ్రీవవిజయమన్న యక్షగాన ప్రబంధము.

తిరు:—క్రీడాభిరామము వంటిదా?

వసు:—కాదు మహారాణీ, క్రీడాభిరామము వీథి. ఇది యక్షగానము. ఇందులో దరువులు కందార్థములు మొదలైనవెన్నియో యుండును. ఇది యొక విలక్షణమైన కావ్యము. జక్కినులు, కొరవంజులు, మొదలైనవారి నాట్యవిశేషములు దీసికొని యీయన యీ కావ్యమును నిర్మించెను. ఇట్టికావ్యముల కిదియే మొదలు.

తిరు:—ఏమయ్యా, మనప్రభువుల కాలం ఆంధ్రభాషా సరస్వతికి గొంగుబంగారంవలె వుండే.

చిన్నా:—అవును అక్కగారూ, మహాప్రబంధాన్ని పెద్దన్నగారు కోటకొమ్మున కూర్చుండబెట్టారు. శ్లేషకావ్యానికి భట్టుమూర్తి పట్టాభిషేకం చేశారు. ద్వ్యర్థికావ్యానికి పింగళి సూరన్న పట్టంకట్టాడు. ఇందుకటి చెరిగొండ ధర్మయ్యగారు శతావధానాన్ని సృష్టించారు. ఈయన యక్షగానాలకు పునాది వేశాడు.

తిరు:—ఇంకా ఎవరువచ్చారయ్యా కవులు?

వసు:—ఆత్మకూరి .మొల్లవచ్చింది. ఆవిడ రామాయణం వ్రాసింది.

చిన్న:—ఆవిడది...కుంభకారకులమట గదా....

వసు:—అవును. చాలావినయవతి. ఊరకేవచ్చింది కాని ప్రభువుల మీద పద్యంకూడా చదువలేదు.

తిరు:—రామకథ వ్రాసిందా? ఎంత పుణ్యాత్మురాలు, నాకు నవ్వొస్తోంది.

చిన్న:—ఎందుకు అక్కగారూ.

తిరు:—పెద్దన్నగారు మహాభాష్యంలో ఉన్నదని ఒకమాట చెప్పారు. కుమ్మరిదగ్గరకు పోయి ఒకకుండ చేసిపెట్టు అనిఅడిగినట్టుగా యీ శబ్దం చేసిపెట్టు అనిఎవర్నీ అడగలేమట. ఈవిడ కుమ్మరికులముదిగదా, శబ్దంచేసిపెట్టు అని అడుగవచ్చున్నమాట,

(చిన్నాదేవి సన్నగా నవ్వును)

వసు:—వెలగపూడి వెంగయామాత్యుడుగారు వచ్చినారు.

చిన్నా:—ఆయన యేంగ్రంథం వ్రాశారు.

వసు:—కృష్ణకర్ణామృతం తెనుగుచేశారు.

తిరు:—సంబాధే సురభీనాం

అంబా మాయాసయస్త మనుయాన్తం
లంబాలకమవలంబే
తం బాలం తనువిలగ్న జంబాలం.....
యీ పద్యాన్ని ఏమి చేశారు?

వసు:—ఆ గ్రంథం ఇంకా నావద్దకు రాలేదు. మామేనల్లుని దాని ప్రతి వ్రాసుకొని రమ్మన్నాను. అత డింకను రాలేదు. మహారాణులు క్షమింపవలయును.

చిన్నా:—హరిభట్టుగారు వచ్చారా? ఆయన ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాసిన నృసింహపురాణం పూర్తిచేశాడు. వరాహపురాణం, మత్స్యపురాణంకూడా వ్రాశారట. ఎవరో చదివితే ఆయన పద్యాలు కొన్నివిన్నాను. ఆయనరచన చాలా ప్రౌఢంగాఉంది.

వసు:—వచ్చినారు తల్లీ.

తిరు:—ఇంతేనా? మరింకెవరైనా వచ్చారా?

వసు:—చెప్పదగినవారిలో నొక్కరే మిగిలారు. ఆయన పేరు మల్లారెడ్డి.

చిన్నా:—ఆయన కవా? బిక్కనవోలు రాజుగదా!

వసు:—ఆయన శివధర్మోత్తరం....షట్చక్రవర్తుల చరిత్రం వ్రాసిన కవి.

తిరు:—ఆయననుగురించి విన్నామని జ్ఞాపకంవస్తూన్నది. ఆయనకు తనఅన్నగారంటే మహాభక్తిట.

(పెద్దధ్వని)

తిరు:—ఇంకా సభ చాలించలేదల్లే వుంది. పోయి అదేమిటో చూచిరా.

చిన్నా:—అక్కగారూ, ఇంతమంది వచ్చారుగాని తాళ్లపాక వారిలో ఎవరూ రాలేదేమి? మనం తిరుపతి వెళ్లినప్పుడు వారిదర్శనం చేశాం. తిమ్మక్కగారు పెద తిరుమలయ్యగారి సవతితల్లి సుభద్రాపరిణయ మన్న ద్విపదకావ్యం వ్రాసింది. జ్ఞాపకముందా?

తిరు:—వారెప్పుడూ తిరుపతిని వదలి రారు. వారు తమ సర్వ జీవితాలూ భగవంతుని కైంకర్యమందే వినియోగిస్తారు.

చిన్నా:—అక్కగారూ, మనము తిరుమలక్షేత్రంలో ఉన్న దినాలే దినాలు. ప్రతిదినం ప్రొద్దునమొదలు రాత్రివరకూ అన్నమయ్యగారి సేవలే విన్నాముగదా, ఏమికవిత్వం? ఏమితెలుగు....ఆహా.

తిరు:—నిజమే చెల్లీ. నేనక్కడ ఉన్నరోజుల్లో మహాకవులైన పెద్దన్నగారిని నందితిమ్మన్నగారినీ మఱచిపోయాను. అడుగో వసుబంధుడు. ఏమిటయ్యా ఆ మహాధ్వని....

వసు:—చక్రవర్తులు పళ్లెమునిండ దీనారములు పోసి ఆశువుగా మామీద నెవరు దివ్యమైన పద్య మల్లెదరో వారికిత్తు మన్నారట. అపుడు పెద్దన్నగారు లేచి ఈ పద్యము చదివినారట....

శరసంధాన బలక్షమాది వివిధైశ్వర్యమ్ములన్ గల్గి దు
ర్భర షండత్వ బిలప్రవేశ చలన బ్రహ్మఘ్నతల్ మానినన్
నరసింహక్షితి మండలేశ్వరుల నెన్నన్ వచ్చు నీ సాటిగా
నరసింహక్షితిమండలేశ్వరునికృష్ణా రాజకంఠీరవా

తిరు:—ఓహో ఏమి క్రమాలంకారము? ఏమి రమణీయంగా వుంది....

చిన్నా:—అయితే యీ గందరగోళ మెందుకు? పెద్దన్నగారు బహుమానాన్ని స్వీకరించారు సరిపోయింది..

వసు:—పెద్దన్నగారు స్వీకరించబోతుండగా తెనాలి రామకృష్ణయ్యగారు లేచి ఆపద్యంలో తప్పున్నదన్నారు. దానితో కలకలం ప్రారంభమైంది....

తిరు:—అపుడు చక్రవర్తి ఊరకున్నారా?

వసు:—ప్రభువులకు కోపం వచ్చింది.. తప్పేమో చెప్పమన్నారు.

తిరు:—తప్పేమి?..

వసు:—రాజకంఠీరవా రాజసింహమా అని అర్థముగదా. నరుడు అర్జునుడు, సింహము, క్షితిమండలము, ఈశ్వరుడు యీ నల్గురియందు నాల్గుదోషములు చూపించి అవి లేనిచో వారు నల్వురు ప్రభువులతో సరివత్తురని గదా పద్యముయొక్క అర్థము. సింహమునందు బిలప్రవేశమన్న దోషమున్నదిగదా.. ఆ దోషము గలిగిన సింహమును తెచ్చి రాజసింహా యనుట తప్పన్నారు.

చిన్నా:—ఇచట కంఠీరవ శబ్దం శ్లేష్మవాచకం..

తిరు:— ఆ పద్యంలోనే ఆ శ్రేష్ఠత్వం చెడిపోయింది కదమ్మా.

చిన్నా:—అయితే ఆ కుత్సికని తెనాలిరామకృష్ణయ్య అంతకన్న మంచిపద్యం చెప్పగలడా?

వసు:—ఆయనచెప్పినాడు. బహుమానమును స్వీకరించినాడు....

చిన్నా:—ఏదీ ఆ పద్యం చదువు....

వసు:—

కలనన్‌దావక ఖడ్గఖండిత రిపుక్ష్మాభర్త మార్తాండ మం
డల భేదం బొనరించి యేగునెడ తన్మధ్యమ్మునన్ హారకుం
డల కేయూర కిరీట భూషితుని శ్రీ నారాయణుంగాంచి రో
గలగంబారుచు నేగు నవ్వ యను శంకన్ కృష్ణరాయాధిపా

తిరు:—ఆహా ఏమి పద్యం.. ఛాందోగ్య దేవతలు సంతోషిస్తున్నారు.

చిన్నా:—అవతారమెత్తిన శ్రీ కృష్ణదేవుడు హుంకరిస్తున్నాడు..

వసు:—మహారాణులు క్షమించినచో, ఒకమాట యందును....

తిరు:—అనవయ్యా అను...

వసు:—మహారాణులైన తమరే ఆ ఛాందోగ్యదేవతలు.. ఆ కృష్ణావతార సంతోషదృత్తులు..

చిన్నా:—అక్కగారూ.. యీపాటికి చక్రవర్తులు వచ్చియుందురు. మనం వెంటనే వెళ్లాలి.

తిరు:—వసుబంధూ.... నీవు వెళ్ళవయ్యా వెళ్ళు....

* * * *

చిన్నా:—అక్కగారూ చూచితిరా.. వసంతోద్యానమంతా చిమ్మనగ్రోవులతో వెదజల్లబడ్డ ఎఱ్ఱనినీళ్లతో నిండిన ఆకాశంతో నిండిపోయింది. అరుగో చక్రవర్తిగారు..

శ్రీకృష్ణ:—చిన్నా, అపు నాకాశమంతా ఎఱ్ఱనిఎండలు కాస్తున్నది.. సన్నని చీకట్లు క్రమ్ముతున్నది..

తిరు:—ప్రభూ యీ దోషం తమరిదే..

కృష్ణ:—నే నింతవర కొక్క చిమ్మనగ్రోవి పట్టుకొనలేదు.... నాదేమున్నది....

తిరు:—

ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీగతిన్
వింధ్య గహ్వరమున్ దూరగ చూచి
తారచట కాపై యుండుటన్
చాల నచ్చెరునై
యెఱ్ఱని వింతచీకటులు వచ్చెం జూడరేయంచు
వే సారిదించూతురు
వీరరుద్రగజరాట్శుద్ధాంత ముగ్ధాంగనల్.

ఆ భావమే చిన్నాదేవి కీ యూహ కల్పించింది..

కృష్ణ:—మరి నీకేమిభావం కల్పిస్తున్నది....

చిన్నా:—అక్కగారి కేభావం కల్గిస్తోందో మనవి చేయమంటే చేస్తాను.

కృష్ణ:—ఆ భావం నీకూ నాకూ ఇద్దరకు గలిగితే మనవి. లేకపోతే నీవి..

చిన్నా:—తమ రంగీకరిస్తే మనవి..

కృష:—సరే చెయ్యి..

చిన్నా:—

శ్రీరంగేశ్వరనాభిపంకజరజశ్శ్రీకంబె
చోళేంద్రతన్వీరాజత్కుచపాళిమంజరులకంబెన్
సహ్యాభూభృత్తటీనీరంధ్రీకృతగైరికద్రవముకంబెన్
వన్నె గావించె కావేరీతోయము
కృష్ణరాయ డహితోర్వీనాథరక్తప్రభన్

కృష్ణ:—తిరుమలా.. చిన్నా.. నేనింతసేపు వృథాగా ఆ కొలువులో కవులగోష్ఠి చేస్తూ కూర్చున్నాను. ఇక్కడికివస్తే ఆకవులగోష్ఠి యీ వసంతోత్సవము రెండూ కలిసి వచ్చేవి..

తిరు:—ప్రభూ.. తమరికి కోపంవస్తే క్షమించాలి..

కృష్ణ:—ఎవరైనా పొగుడుతూంటే కోపగిస్తారా.. పెద్దన్నగారు చిన్నాదేవిలో తిమ్మన్నగారు తిరుమలదేవిలో ప్రత్యక్షమైతే శృంగారరసాధిదేవత సరస్వతీదేవిలా కన్పిస్తే.....

తిరు:—అడుగో వంది.. వసంతోత్సవము ప్రారంభించుటకు వేళయైనదని చదువుచున్నాడు..

వంది:—

ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవిలోక గుంఫితవాక్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూ ప్రసాదన రసికా..

నరసింహ కృష్ణరాయని
కర మరుదగు కీర్తిహొప్పె కరిభిద్గిరిభి
త్కర్కరికరిభిత్ గిరిగిరి
భిత్తురంగ కమనీయంబై....

కృష్ణ:—యీ కరిభిత్ గిరిభిత్ ఎట్లా ఉందంటే చిమ్మనగ్రోవులతో వసంతం చల్లినట్లుంది.

వంది:—

నేర్పుమై నల్ల యది నెరుల తొలుపూ దురిమె
దర్పకున కర్పింప దలప దెంతటి పెరిమ
ఇంటిపావురపు రొద యేల వినె దారజము
వింతయే విరహిణుల వెతబెట్టు బేరజము
చామరో సురపొన్నలకు నీచాయ చాయల సల్కునేటికి
భామ కోయకు వేగపడి పూబాళ పాళముగాదు నేటికి
తావి గుబులుకొనంగ తొడగె ఘృతాచి చూచితె యీ యశోకము
రావె తేనియకంచు పలికెదు రంభ రంభలలో ననేకము
అమృత మధురములైన ఫలరస మాని మానిని త్రుళ్లె శుకములు
గుమురులగు లేమావి చిగురులు కోయ కోయని కూసెపికములు
గుమగుమని వాసనల గేదగికొమ్మ కొమ్మకు నందెనోటికి
రమణి గొజ్జగిపొదలు కడుదూరమ్ము రమ్ము చలమ్ములేటికి
చనకు డిక దవ్వులకు పువ్వులకు......

# హరివంశ ముద్రణ సంస్కార పరిశీలనము

శ్రీ వి. రామకృష్ణరావు

ఎఱ్ఱన హరివంశము 1864 లోను, 1901 లోను వావిళ్ళవారిచే ముద్రింపబడినది. 1960 లో తృతీయ ముద్రణము జరిగినది. ఈ తృతీయ ముద్రణ పరిష్కర్తలగు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు "ఈ కూర్పు రాఁగల కూర్పున కుపకరించునది మాత్రమే కాఁగలదు" అని తెలిపినారు. ఈ ముద్రణమునందలి అపపాఠములను కొన్నింటిని చూపి, నాకు తోచిన రీతిని సాధుపాఠములను నిర్దేశించుచున్నాను.

## 1. యతిభ్రంశములు

(1) 'ఇంతియు నీయంతవార లన్యులు గలరే'
(పూ. 8. 117)

ఇట 'ఇంతియు' అనుదానిని తొలగించి, ఆస్థానమున 'అంతియు' అని నిల్పినచో యతిభంగము తొలగును. "అంతియు నీయంతవార లన్యులు గలరే" సాధుపాఠము కానోపును.

(2) జనని శోకంబు గ్రమ్మఱఁ దన్నుఁబొదువ

ఇట "జనని శోకంబు గ్రమ్మఱఁ దనునుబొదువ" కవిపాఠము. "తన్నును = తనును" అని బాలవ్యాకరణముచేతనే సిద్ధించును. (ప్రకీర్ణ 7 సూ.). ప్రౌఢవ్యాకర్త ఈ రూపమును పునరుక్తముగా సాధించెను. (ప్రౌఢ. శబ్ద 73)

(3) 'ధేను కారిష్ట కేశి మర్దన విభూతి' (ఉ 3.31)

"ధైను కారిష్ట కేశిమర్దన విభూతి" అని కావచ్చును. "ధేనుక ఏవ ధైనుకః".

(4) ఋగ్యజు స్సామములు నీకు నెల్లనాఁడు
దేవదేవ! సమీహిత స్థాపకములు (ఉ. 4-94)

ఇట "దేవదేవ! సమీహిత స్తావకములు" కవిపాఠము కాదగును. "స్తావకః—ప్రతిస్తౌతీతి. స్తు+ణ్వుల్. స్తవకర్తా. స్తుధాతోర్ణ్వక ప్రత్యయేన నిష్పన్నః. యథాభాగవతే 4—15—21. "స్తావకాన్ తానభిప్రేత్య పృథుర్వైన్యః ప్రతాపవాన్, మేఘ నిర్హ్రాదయా వాచా ప్రహసన్నిద మబ్రవీత్" అని శబ్దకల్పద్రుమము. ఋగ్యజుస్సామములు భగవంతుడగు శ్రీ కృష్ణునకు స్తావకములు = స్తుతికర్తలు—అని ఋషులు కీర్తించుట సుసంగతముగా నున్నది.

(5) "వినయమున నధికారులు గొలిచిపోవ"
(ఉ 4—189)

దీనిని "వినయమున నధికారులు వెంటఁబోవ" అను రీతిని సవరింపనగునని తోచెడి.

(6) బలదేవుండును సత్యకప్రభుఁడుఁ బ్రద్యుమ్నుం డునున్ లోనుగా (ఉ 5—6).

ఇట "బలదేవుండును సత్యక ప్రభుడునున్ బ్రద్యుమ్నుఁ డున్ లోనుగా" అని యుండదగును. మూలములో "సహ యాదవ పుంగవైః" అని మాత్రమే యున్నది.

(7) "ఒనరించు మాయలో నడఁగి మడఁగు"
(ఉ 5—170)

'ఒనరించుమాయలో నుడిగి మడగు' సాధుపాఠ మని లోచును.

(8) ప్రతిబద్ధంబైన మేచకాభ్రముఁబోలెన్
(ఉ 9—191)

దీనిని "ప్రతిబద్ధము మేచకాంబువాహముఁ బోలెన్" అను రీతిని సవరింపనగునని తోచుచున్నది.

(9) శార్దూలాంకముగా ఖరాళి కలితో
ద్యత్స్యందనుల్ దానవుల్ (ఉ 10—28)

దీనిని "శార్దూలాంకముగా ఖరాళి కలితోచ్చ స్యందనుల్ దానవుల్" అను రీతిని సరిచేయనగునని తోచును. స్యందనములకు ఔన్నత్యమును చెప్పుట పరిపాటి. "కాంచనోన్నత రథ మెక్కి" (ఉ 10—30) అని హరివంశములోనే ప్రయుక్తము.

(10) 'చూచుచుండంగఁ దగునె తదావహవమున'
(ఉ. 10—172)

"అరయుచుండంగఁ దగునె తదాహవమున" అను రీతిని సంస్కరింపనగునని తోచుచున్నది.

(11) "కొనిపో నుత్తమ బుద్ధి తత్త్వ నిధియొ
క్కండ దర్పఁ డీ మేరకున్ (ఉ 10—241)

"కొనిపోనుత్తమబుద్ధితత్త్వ నిధి యొ క్కండ దర్పఁ డీ మేరకున్" సాధుపాఠము. 'ఒక్కండు' అను రూపము కలదు. "ఒ, కొండును దెస లేక ఏడ్చుకోమలతను" (ఉ. భా. 9—10); "ఒ, క్కండును లే దధిప నీదు కొడుకులు"
(స్త్రీ 1—83)

(12) ప్రీతుండై హరిగాచు మమ్మనుచుఁ బెంపా
రంగఁ దద్ద్వారయా"
(ఉ. భా. 10—23 పాఠాంతరము)

'ప్రీతుండై హరి నాకు నమ్మ నను చున్ జెంపారఁ 'దద్దారయా' అని యుండదగును.

(13) క॥ తొమ్మిదవుసారి వినయ
జ్ఞమ్ములకుం బలి యనఁ జను హయమేధఫలం
బమ్మెయిఁ గాంచు.... (ఉ. భా. 10-307)

"తొమ్మిదవుసారి వినిన మ,హమ్ములకుం బలియనఁ జను హయమేధ ఫలం, బమ్మెయిఁగాంచు" అను రీతిని కవి పాఠముండును. "మహః—పుం. మహ్యతేపూజ్యతేఽ స్మిన్నితి! మహ+'పుంసి సంజ్ఞాయాంఘః ప్రాయేణ' ఇతి ఘః! మహ +అచ్ ఇత్యుజ్జ్వల దత్తః......యజ్ఞః! ఇతి శబ్ద రత్నావళీ॥ యథా హరివంశే......మహైః సురేశ మర్చని......"సొంత శబ్దమును గలదు."మహః(స్).....'మహ=సర్వధాతుభ్యోఽసున్'ఉణా. ఇతి అసున్....యజ్ఞః! ఇతి శబ్ద రత్నావళీ." (శబ్ద కల్పద్రుమః). నవమే క్రతురాజస్య వాజిమేధస్య భారత" (323 అధ్యా-37) అని మూలము.

## 2. గణభంగములు

(1) గీ. అయ్యయమ్మదమ్ముఁ డన యని పిలుచుచు
(పూ. భా. 3—127)

ఇది ఆటవెలది పాదమునకు సరిపడుచున్నది. కాని, తక్కిన మూడు పాదములు గీత పాదములుగా నున్నవి. కాన దీనిని గీత పాదముగా సరిచేసికోవలెను. దీనిలో 'తమ్ముఁడన యని పిలుచుచు' అని యున్నది. 'తమ్ముడు' అను దాని సంబోధనము 'తమ్ముఁడ' అని యుండవలెను. 'తమ్ముఁడు' అనునది సంబోధన రూపము కానేరదు. కాబట్టి 'అయ్యయమ్మ తమ్ముఁడయన యని పిలుచుచు' అని యుండదగును. ఈ పద్యపాదమునకు పాఠాంతర మిట్లు చూపబడినది. "అయ్యయన్నదమ్ములను రమ్మనుచుఁ బిలుచు". ఈ పాఠాంతరముబట్టి "అయ్య నన్న దమ్ములను రమ్మని పిలుచుచు" అన్నది కవి పాఠమనగును.

(2) క॥ అనురాగంబునఁ దనవా
హనవృషభంబు డిగ్గఁ దరుణియుఁ దానున్
(ఉ. భా. 6—35)

దీనినిబట్టి "అనురాగంబున నంతటఁ దన వాహన వృషము డిగ్గఁ దరుణియుఁ దానున్" అను రీతిని కవిపాఠ ముండునని చెప్పవచ్చును. పాఠాంతర ప్రకరణములో పై చివరి పాదమునకు 'హన వృషభము డిగ్గి దయితనందిడి యేఁగన్' అనునది పాఠాంతరముగా రాయబడినది. ఈ పాఠాంతరమున గణభంగదోషములేదు. కాన ఈ పాఠాంతరమే గ్రాహ్యమనదగును.

(3) క॥ హృషీకేశ నామశోభి వెందును గృష్ణా'
(ఉ. భా. 6—80)

పూర్వముద్రణములో 'హృషీకేశనామ శోభి వైతివి కృష్ణా' అని యతిభ్రంశము కూడ ముద్రితమయ్యెను. శ్రీ వజ్ఝ వారు "హృషీకపతినామశోభి వీ గతిఁ గృష్ణా' అను రీతి నుండ వచ్చు నన్నారట. 'హృషీకేశ' అనుటకు 'హృషీకపతి' అనుట గతిమారిన సవరణమని ఆక్షేపణము. 'హృషీకేశ' శబ్దమును పద్యములో ఇముడ్చలేక గణభంగమునకే ఎత్తిన తలయొగ్గినాడట! అది అతని మతమట! హృషీకేశుని హృషీకపతి యనుట కలదు. "అథ సత్యనారాయణ పూజా పద్ధతిః'....పుష్పాంజలిం గృహీత్వా—

"నమస్తే విశ్వరూపాయ శంఖచక్రధరాయచ
పద్మనాభాయ దేవాయ హృషీకపతయే నమః"

(శబ్ద కల్పద్రుమకోశమునుండి—సత్యనారాయణ శబ్దము వద్ద).

నూతన ముద్రణములో 'హృషీకేశ నామశోభి వెందును గృష్ణా' అని యున్నది. కాబట్టి 'హృషీకపతి నామశోభి వెందును గృష్ణా' అని కవి పాఠము కావచ్చునని ప్రతిపాదింపనగును.

ఇది యిట్లుండగా శ్రీ నడకుదుటి వీరరాజుగారు తమ 'విమర్శ తరంగిణి'లో ఇట్లు వ్రాసియున్నారు. "దీని నాల్గవ పాదమున గణభంగమును యతియునుఁ దప్పినవి. పై సంస్థానపు వ్రాతప్రతి (పీఠికాపుర సంస్థానపు తాళపత్రప్రతి) యందిట్లున్నది. "సుషమ హృషీకేశ నామ శోభివి కృష్ణా". శ్రీ నడకుదుటివారు ప్రకటించిన ఈ పాఠము సలక్షణముగా నున్నది.

(4) క॥ శీలోపేతోత్సవ నిరతిశ
యాలంకృత........(ఉ. భా. 6—266)

ఇచ్చటి గణభంగమును తగురీతిని సంస్కరింపవలెను.

(5) క॥ ఒయ్యొ, య్యన పొగ రెక్కఁగఁ గన్నియుం, దనమున
నెంతయును భ్రాంతితనుఁ బొదిరికొనన్"
(ఉ. భా. 7—71)

ఇట 'కన్నియుం, దనమున' అనుచోట 'కన్నియు, తనమున' అని గ్రహించినచో సరిపోవును.

కొన్నిచోట్ల ముద్రణ లోపమువల్ల గణభంగము లేర్పడినవి. తప్పొప్పుల పట్టికకు ఎక్కలేదు.

(1) సీ. ఆజిలోఁ దొడరి యుత్తేజిత పరశుధా
రాముఖంబు నతిరౌద్రభంగి (పూ. భా. 4-53)

'ధా, రాముఖంబున నతి రౌద్ర భంగి' అని యుండవలెను.

(2) గీ. అంద్రె రజ్జులాడునే శూరుఁడైనవాఁడు
(పూ. భా.4—165)

"అంద్రెరజ్జులాడునె శూరుడైనవాడు" అని యుండవలెను.

(3) గీ॥ రెండు పీనుంగులు ధరిత్రీతలమున
(పూ. 9—101)

'రెండు పీనుంగులును ధరిత్రీతలమున' అని యుండ వలయును.

(4) గీ॥ 'కావ వలయును ననాలస్యకలనబురము'
(ఉ. భా. 5—129)

'కావవలయు ననాలస్య కలనఁబురము' అని యుండ దగును.

(5) క. ఆచపలుర నరకుఁ దొట్టి యకట ఎఱుఁగవీ
చెడుటలు మేలులుగా'' (ఉ. భా. 6—222)

''ఎఱుఁగవీ, వీ చెడుటలు మేలులుగా'' అని యుండదగును.

(6) క. ఇందుధరుని వదనముునను ననేకాగ్ని శిఖా
(ఉ. భా. 8—154)

'ఇందుధరుని వదనమున ననేకాగ్ర శిఖా' అని యుండ వలెను.

## 3. అ ప పా ఠ ము లు

### ఈవుత

''ని, త్యమ్ముగ నాయు వీవుత గుణాఢ్యుఁడు ప్రోలయ
వేమశౌరికిన్ (పూ. 1—3)

'ఆయు విచ్యుత' అని యుండదగును. ''ఈవుతన్—అనునది సాధువనుటకు మార్గము కన్పట్టదు. అందలి 'చ'కారము 'వ'కార మగుట మున్నగునవి శాస్త్ర విరుద్ధము—ప్రయోగ విరుద్ధము'' (వ్యా. సం. సర్వ. 1394 పుట.).

### సర్వసురల

''జాతమాత్రుఁడై బాలుఁడు సర్వసురల'' (పూ. 3-18). ఇట్లే 'బ్రహ్మాదిసురలు' (ఉ. భా. 6-73), 'అవని సురల' (ఉ. 9—202), 'అఖిల సురలు' (ఉ. 10—200) అని ముద్రితము లయ్యెను. 'సర్వ సురుల, బ్రహ్మాదిసురులు, అవనిసురుల, అఖిల సురులు'—అని సంస్కరింపవలెను. 'సురాసురలు' అని ముద్రించి (పూ 4—141) 'సురాసురులు' అనుదానిని పాఠాంతరముగా చూపినారు. ఈ పాఠాంతరమే గ్రాహ్యము. (బాల. తత్సమ 60 సూ.). ''స్త్రీత్వ బహుతే సురాదే రసమాసే'' అని ఆంధ్ర శబ్ద చింతామణి.

### ఎరఁగి

''చరణాం, బురుహముల కెరఁగి యపరిస్ఫురితములగు (పూ 3—43)

శ. ర., సూ. ని. కర్తలు ''ఎరఁగి ప్రియమువలికి తెరువిత్తు రట్టిద'' (ఆది 7—112) అని నన్నయ ప్రయోగించినట్లు భ్రమపడి 'ఎరఁగు' అను దాని నంగీకరించినారు. శ్రీ వజ్ఝలవారును దీనిని వైయాకరణ పారిజాతములో సమ్మతించినారు. కాని 'ఎరఁగు' అన్న పాఠముతప్పు. 'తెరలి' అన్నది సాధుపాఠము. (నన్నయ యత్తినల ఉపజాతులు 'భారతి' ఫిబ్రవరి). పూర్వ లాక్షణికు లెల్లరు 'ఎఱఁగు' లోనిది శకట రేఫమే యని చెప్పినారు. 'చరణాంబురుహముల కెఱఁగి' అని సరిచేయ వలెను.

### గరుడఁడు

''గరుడని తోడఁ గూడ నిజకాయము వర్ధన మొందఁ జేసినన్' (పూ 4—170)

ఇట్లే అన్ని చోట్ల ముద్రితము (పూ 7-61, 9—98 ఉ. 7—249, 8—65, 8—76, 8—105, 8—295). ''గరుడః—పుం. గరుద్భ్యాం పక్షాభ్యాం డయతే ఉడ్డయతే.ఇతి గరు + డీ + డః. పృషోదరాత్ త లోపే సాధుః. యద్వా గిర ఉడచ్ ఉణా 4—155 ఇతి ఉడచ్. స్వనామఖ్యాత పక్షి (శబ్ద కల్పద్రుమః). ఇట్టిది సంస్కృత శబ్దమే యగుటచే గరుడుని, 'గరుడుఁడు' అని సంస్కరింపవలసియున్నది.

### పఙ్క్తులు

'పర్వపుఁ గాలముల్ జలద పఙ్క్తులచే (పూ. 5—43)

'బలసి భజింపఁ జంద్రుఁడుడు పఙ్క్తులలో' (ఉ. 5-17) చిన్నయసూరి 'పఙ్క్తి' అని వర్గ పంచమాదేశముతో ఉదాహరించుట ఇట్లు ముద్రించుటకు హేతువు కావచ్చును. 'పంక్తులచే, పంక్తులలో' అనియే ముద్రించుట యుక్తతరము. (వ్యా. సం. సర్వ 49—51 పు. బా.—ఉద్యో 12 పుట).

### రాకపోకలు

'ఓ, నర్చి తన రాకపోకలు (పూ 5—163)

ప్రౌఢవ్యాకర్త రాకపోకలు అను రూపమును సమ్మతించి సూత్రించెను. కాని 'రాకవోకలు' అని యుండుటయే సముచిత మనదగును· (వ్యా.సం. సర్వ 277, 278 పు. బా.—ఉద్యో 47 పుట.).

### డిండీరోత్కర

'డిండీరోత్కర వీచులంబెనుప సుద్రేదేకించెఁ గూలంకషల్ (పూ 6—116)

''డిండీరాంతర .... నుడ్డీనించె (పూ. ము)'' అని సూచించినారు. ఈ పూర్వముద్రిత పాఠములో 'డ్డడ' యతిలేదు. కాన, అదే గ్రహింపనగును. లేద 'దిండీరోత్కర' అని గ్రహింపవచ్చును. 'దిండీర' శబ్దము గలదు. (చూ. అప్పక. 2—147, 148). 'దిండీరాయిత కీర్తి విభ్రమ ధరిత్రీ మండలాఖండలా' (జై—భా 4—127. శ. ర. అనుబంధము 'సవరణలు—వివరణలు' 844 పుట.).

### వ్రేల్చి

కనలు కన్నుల నిప్పు లెనసి పురోమార్గ
ములు । వేలి సకలాటవులును బొదివె (పూ 7—84)

'పెందూళి, కెందూళి' అను రూపములే సాధువులు (వ్యా. సం. సర్వ 377—378 పు.)

### కాత మనవద్యత

'నిత్యయౌ, వనరుచి నొప్పు గాత మనవద్యత (ఉ 4—211)

హరివంశములో పెక్కుచోట్ల 'కాత' అను కకారరూపమే ముద్రితము (పూ 1—124, 181; 2—197, 4—183, 7—10 ఉ 4—105). కాన 'కాత యనవద్యత' అనియే యిక్కడను ముద్రించుట లెస్సయేమో! 'కాత మనవద్యత' అనునది శ్రీ వజ్ఝలవారి మతమున అసాధువు (వ్యా. సం. సర్వ 1388—90 పు.). శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి మతమున నిది సాధువే (ఎడు తలసంధి విచారణ—భారతి, నవంబరు 1961). దీని సాధుత్వము వివాదగ్రస్తము. (ఎడు—తలసంధి విచారణ పరామర్శ—భారతి 1961 మార్చి; కలిపయ పాఠగ్రంథులు—భారతి 1961 జూన్.). పరిశోధకులు సముచితమని తోచిన దానినే గ్రహింతురు గాక!

### భస్మరాసులు

రూ, పటి తఱుచుగ భస్మరాసులయిరి నరేంద్రా (పు. 2—67)

ఇట్లే జలరాసులు (పూ 5—90)

రత్నరాసులు (పూ. 7.177)

క్రూరరాసులు (పూ 8—93)

'భస్మరాశులు' అను రీతినే ఇవెల్ల నుండవలెను. (వ్యా. సం. సర్వ 543 పు.)

### పెన్నింట

'పెన్నింటం దేలుచు' (ఉ 6—30)

'పెన్నింటల' (ఉ. 7—94)

'పెన్నీంటల' అని యుండవలెను. 'నీరు' శబ్దపు ఔపవిభక్తిక రూపమగు 'నీంట' ఇట ప్రయుక్తము. (వ్యా. సం. సర్వ 936, 937 పు.). 'నిట్టయవలిదరిని బెట్టువాఁడ' (ద్వా 3—107) అను ప్రయోగమునుబట్టి 'నిట్ట' శబ్దమునకు ప్రవాహమను అర్థము కలదనుటయే యుక్తము. కాని, 'నింట' శబ్దము కలదనుట సరికాదనియే తోచును.

### పూవమ్ము

'పుష్పసాయకు పూవమ్ము చామయయ్యె' (ఉ 7—56).

'పూవుటమ్ము' అనియే గాని, 'పూవమ్ము' అనునది ప్రయోగదృష్ట ముకాదు. (విరా 2—28). పువుటమ్ము చాయ' అను పాఠాంతరమే గ్రాహ్యము.

### మెలఁత

'మెలఁత యేమని చెప్పెదు మీ కృగాక్షి' (ఉ 7—189)

''ముని, లోకము సేరుటయు నమ్మెలఁత యెలుఁగెనుగన్' (అను. 3.221) అను తిక్కన ప్రయోగము దీని ఉత్వమధ్యతకు ప్రబల ప్రమాణముగా నున్నది. హరవిలాసములో సైతము శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణమున 'మెలఁత' అనియే ముద్రితము. (హర 3—20). 'మెలఁత' అను అత్వమధ్య మర్వాచీనముగా వచ్చెనని తోచును. కాన మెలుఁత అని సరిచేయవలెనని తోచుచున్నది. (వ్యా. సం. సర్వ 1277 పు).

### లోపడ

'తడవుగఁ బోరి శాత్రవుని దండడి లోపడఁబట్టి (ఉ 8—121).

'లోపడు' శబ్దము లేదు! 'లోఁబడు అనియే యుండవలెను.

### నీ ప్రెగడల

''భూపతివై యటు పుట్టిన, నీ ప్రెగడల''
(పూ 2—198)

ఇట 'పెగడల' అను పాఠాంతరమే గ్రాహ్యమని తోచుచున్నది. ''పెగడ=ప్రెగడ యొక్క రూపాంతరము'' శ. ర.

### ఐ త్రుంచెన్

''ఆతత రోష సముద్ధతుఁడై త్రుంచెన్ (ఉ 6—177)

''ఆతత......ఐ తునిచెన్'' కవిపాఠము కానగును. 'తునుచు' సూ. ని. లో ఈయబడినది. 'ఎ తునిమెన్' అనియేని కవిపాఠము కానగును.

### చిన్నవోయి

'కడుఁజిన్నవోయి యిది యెక్కడి యొప్పమి'' (ఉ. 7.41)

శ. ర. లో 'చిన్నవోయి' అన్నదే యున్నది. సూ. ని. లో 'చిన్నబోవు' అనియే చూపబడినది. 'విని చిన్నంబోయె దైత్యవీరుఁడు' (దశా 5—32, ''నం, దనుఁడొక్కండును లేమి వీనగరు చిన్నంబోయె'' వరాహ 2—92— సూ. ని.).

### సాందీపుని

'చచ్చిన సాందీపుని సుతు' (ఉ 4—263)

'ఏశేషించి సాందీపుని' (ఉ 4—238)

''సాందీప'' శబ్దము మృగ్యము. 'సాందీపని' అని యుండవలెను. (వ్యా. సం. సర్వ 9978). ''సాందీపనిః—పుం. (సందీపనస్యాపత్య మితి. సందీపన+ఇఞ్ —ముని విశేషః. యథా....'' (శబ్దకల్పద్రుమః). ''సాందీపనిః- ఇ-పు-ముని విశేషః'' (సర్వశబ్ద సంబోధిని). 'మహిత యశుఁడు సాందీపని మా గురుండు'' (పూ. 9—198) అనుచో 'సాందీపని' అని సరిగానే యున్నది. కాన పై రెండుచోట్ల 'సాందీపని' అని సరిచేయదగును.

"ఖేద సందగ్ధ సాందీప నూనుప్రదా" (పారిజా 3—38) అను తిమ్మకవి ప్రయోగమునకు గతి నరయవలసియున్నది.

## వాణిభర్తను

"వాణి భర్తను నీతం డొకరుండు నాఁ జను మహాత్మా వ్యక్తిన్" (పూ 1—9)

సముచ్చయార్థమున "భర్తయును = భర్తను" అని కావచ్చునని నేను వ్రాయగా" అది సరికాదని శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు విమర్శించినారు. 'కొమ్మన్, పురారిన్' అన్న ప్రయోగములు పాదపూరణమునకు ప్రౌఢ వ్యాకరణములో చూపబడినట్లు శ్రీ శాస్త్రిగారు వ్రాసినారు. కాని, అది సరియని తోపదు. 'లేకను, ఊఱడకన్' అనునవి పాదపూరణమునకు చూపబడినమాట నిజమే. కాని, వీనిలోని ద్రుతమును నిరర్థకము కాదనియే శ్రీ వజ్ఝ వా రభిప్రాయపడినారు. (వ్యా. సం. సర్వ 108, 109 పు.). శ్రీ గిడుగువారును "ఇక్కడ దుఃఖితులమగుటను, ఆధారములేకను అని సముచ్చయార్థములుగానే ప్రయుక్తములయి ఉన్నవి" అని వ్రాసిన ట్లుదాహృతము. శ్రీ శాస్త్రిగారు శబ్ద రత్నాకరములో 'ను' శబ్దము క్రింద "ఇది ఉకారేతరములమీఁద యు వర్ణ పూర్వకముగా వచ్చును' అని వ్రాయబడినట్లు చూపినారు. అక్కడనే "ఆ యువర్ణము ఒకానొకచో లోపించును" అని వ్రాసిన విషయమును గమనింపలేదు. 'కొమ్మన్' అనునది సముచ్చయార్థమున యు వర్ణము లోపించుట కిచ్చిన యుదాహరణములలో నున్నది. 'ను' శబ్దము క్రింద చూడనగును.

'భర్తను' అనునదే కవిపాఠమని నేను వాదింపను. అచ్చటి పాఠాంతరములను పరిశీలించి శ్రీ శాస్త్రిగారు సరియైన పాఠమును నిర్ణయింపగలరని ఆశించెదను.

## మాతులురు

"ప్రభులు మాతులురను భవ్యతయును" (పూ 1—22)

'మాతుల' శబ్దమునకు బహువచనము 'మాతులులు' అనియే యుండును. 'దీర్ఘ పూర్వక లోపధము' కాదుగదా! "ప్రభులు మాతులులను భవ్యతయును" అని సవరింపవలెను.

## దంపతీ

"గంధర్వ దంపతీక్రాంత నిర్ఝర సైకతములు" (ఉ 1—55)

'దంపతీ' అనునది 'దంపతి' శబ్దముయొక్క ద్వివచనాంతము. 'దంపతి' అనునది ఇకారాంత శబ్దము. దీనినే సమాసములలో వాడవలెను. విభక్త్యంతముతో సమాసముండరాదు గావున 'దంపతీక్రాంత' అను ముద్రణము సరికాదు. 'దంపతిక్రాంత' అనియే యుండవలెను. కనియెం గ్రీడ దమర్త్య దంపతి మిథో గంభీరహాసంబు (ఉ 6—7) అనుచో వృత్తమగుటచే అపపాఠ మేర్పడక 'దంపతి' అని సమాసములో సరిగానే ముద్రితము.

# వేదాంతదేశికుని

# అభీతిస్తవము

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

వేదాంత దేశికులను పేర ప్రసిద్ధులైన వేంకటనాథుడీ స్తుతికి కర్త. కవితార్కికసింహ సర్వతంత్రస్వతంత్ర బిరుదములు ఇతనికి కలవు. భగవద్రామానుజుల విశిష్టాద్వైత సంప్రదాయ సిద్ధాంతమునకు ఈయన మూలస్తంభము వంటివాడు. ఆ దర్శనము విషయమున తమిళ సంస్కృతములందు ఆయన రచించిన గ్రంథములు అనేకములు. అమూల్యములు.

క్రీ. శ. 1264 వ శుక్ల సంవత్సరమున ఆశ్వయుజ శ్రవణమున, తిరుపతివేంకటేశ్వరుని తీర్థదినమున కాంచియందీయన అవతారము; 1365 వ సంవత్సరమున ముక్తి—అని సాంప్రదాయిక విశ్వాసము. ఈయన చరిత్రము ప్రత్యేకముగా వ్రాయదగినది.

పెక్కు వైష్ణవ క్షేత్రములందలి మూర్తులనుగూర్చి ఈయన రచించిన స్తోత్రములు చిన్నవి—పెద్దవి కలవు. భక్తిశ్రద్ధలు నిండి, దార్శనిక విషయములను వెలువరుచు మహాకావ్యము లవి.

మహమ్మదీయులు 14 వ శతాబ్దిలో శ్రీరంగక్షేత్రమును ముట్టడించి ఆక్రమించుకొనిరి. హిందువుల కది పెద్ద విప్లవకాలము. ఎందరో భక్తులా దాడిలో జీవము లర్పించిరి. శ్రీ రంగనాథుని మూలమూర్తిని ఎట్లు సంరక్షించిరోకాని, ఉత్సవమూర్తిని శ్రీ భూ విగ్రహములతో రక్షించుకొని కొనిపోయి, ఆనాటి వీర వైష్ణవులు తిరుపతి కొండపై దేవళములో సుమారు పదేండ్లుదాచి పూజించిరి. తరువాత చెంజి నగరాధీశుడగు గోపణ్ణనాయకుని సహాయముతో మహమ్మదీయులనుండి శ్రీ రంగమును విడిపించి, మరల శ్రీ రంగనాథుని ప్రతిష్ఠించిన మహాకార్యము శాసనబద్ధమై యున్నది.

వేంకటనాథమహాకవి ఆ విప్లవసమయమున తప్పించుకొని బైటపడిన కొందరిలో ప్రముఖవ్యక్తి. శ్రీరంగనాథుని పునః ప్రతిష్ఠాసిద్ధికి ఈయన ప్రయత్నము ఎంతో పనిచేసినది. ఆ శాసనము గూడ ఈయన రచించినదే.

ఆ మహాభయసమయమందు అభయప్రార్థనగా ఆయన రచించినది ఈ అభీతిస్తవము. కడచిన అష్టగ్రహకూట కాలమున నా ప్రార్థన ఈ తెలిగింపు.

అది మదిఁగొల్చు వారికభయంబిడు; నొల్లనివారికిన్ భయం
బది గలిగించుఁ; దక్కటి భయాభయదాతలు దానిలెంక; ల
య్యాది విధి శంభు శక్రముఖులందఱ మీఱిన తేజ; మిందిరా
హృదయ సఖంబు; దాని భజియింతుమచింత్యము రంగధుర్యమున్

కరుణాశీతలమై, రమాలసద్ధురస్కంబై, జగద్ధ్వాంతఘ
స్మరమై, యార్తుల యొక్క మ్రొక్కునకె రక్షాదీక్ష వాటించి, వా
విరిగా వారిధి పావనా వెలయు కావేరీమహాసైకతాం
తర సంవిన్నిధి నిచ్చ మేల్కొనెడుఁగాతన్ నా మనఃపేటికన్

మితమతినై కడున్ గోలఁది మీఱిన మోహమునన్ గుణత్రయీ
వృతమగు కాయవాఙ్మనసవృత్తులు వోయెడు వింత త్రోవలన్
హితమహితంబుఁ దత్క్రియము నేదియుఁ జూడక నేను బూను నీ
కృతియును రంగనాయక! వరింపఁగదే యుచితార్చనంబుగన్

తమతమ కృత్యమెల్ల నియతంబుగఁ దీర్తురు శక్ర పావకా
ర్యమ యమ మారుతాదులు భయంపడి నీదెసఁ దప్పసేయ; ని
త్యముఁ 'బయికెత్తి పట్టిన మహాకులిశంబును బోలు' నంచు వే
దము వినిపించు నాభయము దాఁటును నిన్ నుతియించు వాఁడొగిన్

ఆరసి నైజబుద్ధినె చరాచరముల్ నియమించు యార్చు ని
న్నే రహిమైనెవండు నుతియించును, మ్రొక్కుఁ, దలంచుఁ, బేర్కొనున్,
జేరుఁ బ్రదక్షిణంబుఁ-దాది నీ గుణమెయ్యదియే నెఱుంగు, వాఁ
డేరికి నెప్పుడున్ వెఱవఁ డెందును నెట్లును జూ గుణేశ్వరా-

తిరమై చిత్తము, ధాతువుల్ సమములై, దేహంబు సాద్గుణ్య ని
ర్భరమై యుండఁగ నెప్పుడే నెవఁడు సర్వక్షేత్రినాద్యున్ నినున్
స్మరియించున్ దగ వానిఁ జేర్తువటె యామాత్రంబునన్ బెద్దని
ద్దుర పెన్మంపున నీతలంపౌనఁగి బంధూ, నీమహాధామమున్

దేవా! రంగపతీ! జనార్దన! రమాదేవీమనఃకాంత! కృ
ష్ణా! విష్ణూ! త్రియుగా! త్రివిక్రమ! హరీ! నారాయణా! యంచు నీ
త్రోవన్ నీ శుభనామముల్ నుడువుధీరుల్ కాలుచేఁ జిక్కఁబో
రే వేళన్; నరకంబులంబడు భయంబింకేల వాక్రువ్వఁగన్?

నిన్నే నెమ్మదినమ్మి, వేల్పులను మన్నింపన్ గడున్ **దాంతుఁడై**
యెన్నండే నొకఁడున్న చోట యగు రంగేశా! మహాపుణ్య సం
పన్నస్థానము, సర్వసౌఖ్యముల పెన్బ్రాపీఠరన్, నీకు న
స్కన్నంబై తగు రాజధానియుఁ, దపస్సారాక్షత క్షేత్రమున్

పురుషార్థప్రియులున్, గుణత్రయజయంబున్ గోరువారున్, రిపూ
త్కర నాశంబును వేఁడువారు, నిల రంగస్థానిఁ జూడంగ నే
ర్తురు సూ, పాడి దొరంగుటన్ గలుగు భీతుల్ వాపి చేపట్టఁ గ్ర
చ్ఛుఱ దీక్షించిన నీ యమేయగుణ దివ్యఖ్యాతిఁ, దేజోనిధీ!

## అభీతి స్తవము

కారపుమందుగా వెఱచుఁగా జగదీశ్వర! నీదుబోధ సం
సారి; కదధ్వదుర్విషరసాలకు గాలపుఁ దిండిఁబోలె వే
కారు; నపథ్య మిట్లుడుగఁ గానని వానినిగూడ గారబం
బారఁ దటానఁ బ్రోచు సమయంబున నీదయ నక్రమంబుగన్

కయిదువులాదిగాఁగఁ గొఱగానివి నీకిది నిశ్చితంబు; ని
ర్భయుఁడవు; వానినెప్పుడును బాయక మోచెద వట్టులయ్యు; నా
రయ నతరక్షణంబు నిజరక్షయె నీకగుఁగా; పరార్థవే
దియె తనకంతరాత్మయని తెల్పవె నిక్కము! రంగనాయకా!

అన్నలుఁ దమ్ములున్ సుతులు నాండ్రును జుట్టలు నాస్తులాదిగా
నన్నియు నల్పసౌఖ్యదములై తమ కర్మవశానఁ జేరు; నే
తెన్నునఁ జూచినన్ భయమె తెచ్చును; నీయనుభూతిఁ గల్గు సౌ
ఖ్యోన్నతి గోరువారికిఁ బ్రభూ! నిలుపోపవి యియ్యనేర్చునే!

తరమే కాదు వచింప నారకపుఁగ్రంతల్, గర్భవాసాదులున్;
బరికింపన్ బహుధాతుసంకలితమా పాళే శరీరంబు; ని
ర్జరలోకాదులునట్టివే, మహిత తేజంబౌ త్వదాస్థాని ముం
దర; నిందేది భయంబు గొల్పవిదనంతా? రంగపృథ్వీపతీ!

దిగులే కల్గఁగఁ జేయునట్టివిగదా దేశాలుఁ గాలాదులన్!
మొగముల్ వేఱు శుభాశుభంబులను చొప్పల్ సూడ; భీతిల్లి యి
ట్లుగడో నన్ గరుణింపవేని జగదీశా! యెవ్వఁడీరీతి నో
మఁగనేర్చున్ దయ? నెవ్వఁడింక ననుకంపా పాత్రుఁడున్ నీకిఁకన్?

అభయంబిచ్చుట యొక్కమ్రొక్కునకె నిత్యంబైన నీపూన్కి; నీ
వభిభాషింపవు రెండుమాటలని విఖ్యాతంబు నీకీర్తి; వెం
డి భువిన్ గాంచిరి రాక్షసప్రముఖులున్ నీమాటచెల్లింపు; నేఁ
డభవా! యయ్యది పొల్లువోవలెనె దీనాగ్రణ్యుఁడౌ నాయెడన్!

దురితపయోధి పొంగుచును దోఁచుననుక్షణమున్; దరింపఁగా
నరిది; యొకప్పుడందు విముఖబ్బైన యేనియు నందు దోషముల్
చెఱుచును నిండి; 'యిట్లు గతిచెడ్డ ననున్ దరిఁజేర్ప నీవ య
క్కఱ మదినెంచి యొక్క ప్రతికారము సూపుము రంగభూపతీ!

గెలువఁగరాని యీ విషయకీలల స్రుక్కుచుఁ జిక్కి, పాతకం
బులు పయికెక్క, నీ సదనుభూతికి దవ్వయి, భీతిఁ జెంది నే
నలఁగెద, 'వీనికిన్ నియతనాథుఁడ నే' ననిపించిఁ రంగభూ
తల రమణా! జగత్పతి! యుదారదయానిధి! నన్నుఁ గావవే !

శ్రుతి నిన్ దెల్పు 'నిరంహాసుండు నిరనిష్టుం'డంచు నైసర్గిక
స్థితి; సర్వేశ్వర! కాన సంహృతియు సృష్టింబోలి నీ కాట సం
తత; మైనన్ శరణన్నవారి చనవున్ దప్పింప భీతిల్లు నీ
మతి నేదేనియుఁ బోవఁద్రోవకుసుమీ మాయిష్ట మొక్కింతయున్ !

ద్రౌపది యంబరీషుఁడు మతంగజరాజు విభీషణుండు గో
గోపకులున్ గయాధుకొమకున్ జిరజీవియుఁ బాము నాదిగా
నీ పదయుగ్మముం గొలిచి నిర్భయతం గనినారు; మేము న
ట్లే పరిపాటిగాఁ బడయమే యది నీదయ రంగభూపతీ !

వెఱపులణంపు రంగమున; వేఱొకకోర్కియు లేనివారికిన్
సిరులను బెంపు; బల్మినిట చేరిన మార్తుర నూచముట్టుగా
నఱుముము; సర్వకాలముఁ దనంతన తోఁచిన నీదుమూర్తి చె
ల్వారసి ముకుంద! మేముఁ బడయంగల మింద సుపర్వసౌఖ్యమున్

శ్రీపతి ! సద్విచిత్రగుణసేవధి ! యాశ్రితలోకరక్షకా!
నీపయినిట్లు మాబరువు నిల్పితి; మింక ననుక్షణంబు నీ
వే పరిదీప్రహేతులకు హేతులతోడుత నడ్డులేని నీ
యోపును ప్రాపుఁ జూపుము మహోన్నతి రంగముఖస్థలంబులన్

కలిదూతల్ యవనుల్ తురుష్కులు మొదల్గా శాక్య లోకాయతో
ర్మిళవృత్తిం బచరించు పెన్దిగులు ధాత్రిం బేర్చె; లోకోత్తరో
జ్జ్వలశక్తిన్ ధరణీసురప్రతతిఁ గావన్ జాలు పంచాయుధం
బులచేనయ్యది రంగనాయకమణీ ! పోకార్పవే ప్రేల్మిడిన్ !

రవిచంద్రాగ్నుల రూపమై, తమము బాఱంద్రోవఁగాఁ జాలి, స
ర్వవిధాస్త్రంబుల నాత్మలోఁగొని, సురప్రద్వేషులం జీల్చుచున్,
దివిజాళిం దనవెంటఁ ద్రిప్పెడు ప్రథాదీప్రంబు చక్రంబు శ్రీ
ధవ ! నీదౌ పెనువీటిలో నడుపుఁగాతన్ ధర్మచక్రస్థితిన్

## అభీతి స్తవము

మనుముఖ్యార్చిత రంగధామముఖరమ్యక్షేత్రరాజిన్ నిశా
టనిభుల్ కూళలు లాఁతివారలిటు పెట్టన్ బేర్చు భీతిన్ వినా
శన మొందింపవె శ్రీధరా దయతలిర్చన్ గూర్చి ప్రేరేప నీ
ఘనశక్తిం గొని నీవ సద్గుణఘనా! కారుణ్యవారాన్నిధీ!

గరుడానంతులు, వాహినీపతియు, రంగత్పత్తనద్వార గో
పురరక్షుల్ కుముదాదులప్రతిమ విస్ఫూర్జద్బలశ్రీల నీ
కరణిన్ రంగముఁ గాచువారయి, జగత్కల్యాణ కైంకర్య సు
స్థిరులై యుందురుగాక దేవర! 'జితం తే!' యంచు ఘోషించుచున్

నీపగవారిఁ బ్రోచుటకు నేరరుగా జగదీశ! ధాతృ దు
ర్గాపతి దేవరాడనిలకాలముఖుల్ సయితంబు; నీదు పెం
బ్రాపును గన్నచో భయమువాటిలదెప్పుడు నెందు; నట్టి నీ
వే పరికించి మాపగఱ వెల్పుము రంగముఖస్థలంబులన్

అది కైటభాఖ్య దేవారి పెన్ జీకటిరట్టు మాయించు మార్తండమూర్తి;
అది మధుప్రఖ్యపలాశాపశదపరాగార్తిఁ బోఁ ద్రోచు ఝుంఝూనిలంబు;
అది దురాసద హిరణ్యమహామహీధ్రంబు అక్కి చీల్చిన శతారంపుధార;
అది కాలనేమిదుర్మదవనస్పతి వేళులంటంగఁ ద్రుంచు గొడ్డంటివాయి;

పలుపలుకులేలయిఁక? నది కొలుచువారి
భవసముద్రముఁ బుడిసింటఁ బట్టిపీల్చు;
ఆక్రమము నీది నేఁడు త్రివిక్రమాఖ్య!
తన్నితోలుత రంగ విధ్వంసకులను!

యతిపతివాక్సుధారసములానుచుఁ బ్రాయముఁ జల్పితిన్; బ్రఫు
ల్లతఁ దలవెండ్రుకల్ నరసె; లాలసనొండిల వేఁడెదన్ దగన్;
హితమతులున్నచోటఁ, బగఱెవ్వరుఁ జేరనిచోటఁ బెట్టు శ్రీ
పతి! నను రంగధామముఖభవ్యపదంబుల నెందునేనియున్!

గురువరదివ్యదృష్టి మొనకొల్పిన వేంకటనాథసూక్తి (తె
న్గు రహి ననంతకృష్ణుఁడిటు గూర్చెను) రంగపతి స్తవంబు; మీ
రరసి పఠింపుఁడయ్య! యభయంబునకై; కరుణాబ్ధి 'భద్రమా,
వెఱవకుఁ'డంచు మిమ్మతఁడె వేళమ ప్రోచు మహాగుణంబులన్!

# పాల్కురికి సోమనాథుని చతుర్వేదసారము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

పాల్కురికి సోమనాథుని పద్యకృతులలో ప్రఖ్యాతి జెందినది చతుర్వేదసారము. సోమనాథుడే పండితారాధ్య చరిత్రమున

"వర వీర భక్తి సద్వైదికంబుగను
విరచించితివి చతుర్వేదసారమున"

అని తాను రచించిన యీ కృతిని భక్తమండలి ప్రశంసించినట్లు చెప్పికొన్నాడు. అన్యవాద కోలాహల శతక గ్రంథకర్త ఏకామ్రనాథకవి, పద్య బసవపురాణ కర్త పిడుపర్తి సోమనాథకవి దీనిని పేర్కొనియే యున్నారు. శ్రీనాథ పోతనాది మహాకవులు దీని ననుసరించుటచే, నిది ప్రాచీన కాలమున వ్యాప్తిలో నుండెడిదని చెప్పవచ్చును.

సోమనాథుని ద్విపద కృతులు రెండింటిని గూర్చియే గాని యాతని పద్యకృతి యగు చతుర్వేదసారమును గూర్చి యీనాటి సాహితీ విమర్శకు లెఱుంగరు. ఇది ఇప్పటికి నలువ దెనిమిది యేండ్ల క్రిందట ముద్రితమైనది. అదియును నొక గుజిలీ ప్రతి. చిన్న యక్షరములతో నపరిష్కృతముగా నున్నది. దాని నైన పరిశోధకులు చదివినట్లు కానరాదు. పాంపీగడల వంటి కాగితములమీద ముచ్చట గూర్చు నచ్చుతో, సుపరిష్కృతమై సుందరముగ వెలువడిన బసవపురాణ పండితారాధ్య చరిత్రలనే నామమాత్రముగ చదివి సోమనాథుని కవితా తత్త్వమును గ్రహింపని నేటి సాహితీ విమర్శకులు పూర్వ ముద్రిత ప్రతులను పరిశీలించు క్లేశమును వహింతురా ? కాని దేశమం దట్టి ప్రతుల విశిష్టతను గ్రహించినవారు లేకపోలేదు.

ఇట్టి చతుర్వేద సారమును లేఖక ప్రమాదాది దోషములను సవరించి, పాఠములను సంస్కరించి, పద్య పాదములను విడదీసి, చక్కగా ముద్రించి, నేడాంధ్రలోకమునకు సమర్పించినవారు శివశ్రీ బండారు తమ్మయ్యగారు. తెలుగు భాషలో వీరశైవ వాఙ్మయ మున్నను, పాల్కురికి సోమనాథు డున్నను, తమ్మయ్యగారి నామము మన దలపునకు దగులుచునేయుండును. ఆ వాఙ్మయ పరిశోధకులకు వా రనవరత స్మరణీయులు.

నలువదేండ్ల నుండి నిస్స్వార్థముగ వీరశైవ మత సాహిత్యమునకు వా రొనరించిన సేవ వలనను, ఆంధ్ర గ్రంథమాలాధిపతులు ప్రకటించిన సుపరిష్కృత [1]బసవపురాణ, పండితారాధ్య చరిత్రల మూలమునను, నేడు ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున 'శివకవి యుగము' అని వాఙ్మయ యుగ మేర్పడినది. ఆంధ్ర సాహిత్య చరిత్రమున—శివకవి కవితా విశిష్టత చిరస్థాయి యైనది.

శ్రీ తమ్మయ్యగారు తమ పీఠిక 9 పుటలో నిట్లు గ్రంథ పరిష్కరణను గూర్చి వ్రాసియున్నారు.

"భక్తవరులు, వీరశైవులు శ్రీ చలవాది రాచయ్యగారు విశేషముగ పరిశ్రమించి చేకూర్చిన విరాళములతో నీ గ్రంథమును నేనే యిప్పు డిట్లు చేతనైనంతవరకుఁ బరిష్కరించి ప్రకటించితిని. అనుభవసారమునకు దీనికింగూడ పరిశుద్ధమైన వ్రాతప్రతు లెవరియొద్దనైన నున్నచో దయతో వానిని పంపిన యెడల వానిని గూడ పరిశోధించి భావి ముద్రణమున నింతకంటె పరిశుద్ధముగ వెలువరింప నగునని మనవి చేయుచున్నాను."

పైని యుదాహరించిన వాక్యముల ననుసరించి చతుర్వేదసార సుసంస్కృత ముద్రణకు దోహదముగ నుండునట్లుగా, నీ గ్రంథమును సమీక్షించు చున్నాను.

## వ్రాత ప్రతులు

చతుర్వేదసారమునకు, శ్రీ తిమ్మయ్యగారు పీఠికలో దెల్పినట్లుగా తాళపత్ర ప్రతులు ప్రాచ్య లిఖిత పుస్తక భాండా

(చతుర్వేదసారము. శ్రీ పాలకురికి సోమనాథ మహాకవి ప్రణీతము. విమర్శ కాగ్రేసర, ఐతిహాసికసామ్రాట్, శైవ సాహితీ సార్వభౌమ, శివశరణ శ్రీ బండారు తమ్మయ్యగారిచే బరిష్కృతము. వెల : 2—00.)

1. బసవపురాణము ద్వితీయ ముద్రణ భాగ్యము గాంచినది. ఇక పండితారాధ్య చరిత్రము నిప్పుడు లభించుట లేదని వినుచున్నాను. ఆ మహాగ్రంథము గూడ త్వరలో ద్వితీయ ముద్రణ భాగ్యము నందుగాక.

ఆంధ్ర గ్రంథమాల యందు ప్రకటితములైన 'శతక మంజరి' కూడ పునర్ముద్రితము నందవలెను.

# పాల్కురికి సోమనాథుని చతుర్వేదసారము

గారమున తక్కువగ నున్నవి. అయిదు వ్రాత ప్రతులలో రెండు మాత్రమే సమగ్రములు. తక్కినవి యసమగ్రములు.

1. సంఖ్య 1545—ఇందు 352 పద్యములు గలవు. వ్రాత కన్నడ మోడి నున్నది. కాగితపు ప్రతి—దీనియందలి పేరు చతుర్వేదసారమనియే యున్నది.

2. సంఖ్య డి. 2087. ఇందు 357 పద్యము లున్నవి. దీనికి "బసవలింగ శతకము" అని నామాంతరము. ఇది శతక వివరణములను దెలుపు కేటలాగులోనున్నది.

3. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో తప్ప నే నెఱిగినంతవరకు తక్కిన ప్రాచ్య లిఖిత పుస్తక భాండారములలో దీనికి ప్రతులు లేవు.—అయిన నీ సందర్భమున నొక తాళపత్ర ప్రతిని గూర్చి చెప్పవలసియున్నది.

క్రీ. శ. 1922 లో శివతత్త్వసార పీఠికలో కీర్తిశేషులు కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారిట్లు వ్రాసియున్నారు. "నాకీ గ్రంథము ప్రతి యొక్కటియే దొరకినది. అది నరసాపురము నందలి శ్రీయుత చదువుల రామలింగయ్యగా రను జంగమదేవర సంగ్రహములోనిది. ఇది తాటాకు గ్రంథము. ఈ సంపుటములో "నాలుగు గ్రంథములు గలవు. సంపుటమునందు మొత్తముమీఁద 174 కమ్మలున్నవి.

1—2 కమ్మలలో జిల్లర పద్యములు.

3—29 కమ్మలు లేవు.2

30—28 వరకును శివతత్త్వసారము.

68—130 వఱకు బాలకురికి సోమనాథ కృతమగు చతుర్వేదసార మనబడు బసవలింగ శతకమును.

131—134—భూమికొల్త శ్లోకములును

135—155—లింగకవి ద్విపద సానంద చరిత్ర

156—174 జగ్గుభట్ట రచిత సురాభాండేశ్వర యక్షగానము గలవు."

దీనినిబట్టి శివతత్త్వసార మున్న తాటిదళ సంపుటమున చతుర్వేద సారము కలదు.

ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారీ తాళపత్ర సంపుటములో "శివతత్త్వసార" మొక్కదానికే ప్రతి వ్రాయించిరి కాని తక్కిన గ్రంథముల ప్రతులు వ్రాయించలేదు. శ్రీ లక్ష్మణరావుగారు తాము నలువదేండ్ల క్రితము శివతత్త్వసారము పరిష్కరించునపుడీ తాళపత్ర గ్రంథమును నరసాపురము నుండి తెప్పించియుండిరి. అది వారికడనే యుండవలయును. లేక మరి యెవరి యొద్దనైననున్నదో తెలియుట లేదు.3

## గ్రంథ పద్య సంఖ్య

చతుర్వేద సారమున నాలుగు వందల సీసపద్యము లున్నట్లుగా కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ ప్రథమ ముద్రణ పీఠికలో వ్రాసి యున్నారు. కాని ముద్రిత ప్రతియందు 300 పద్యము లున్నవి. పైని చూపిన తాళపత్ర ప్రతులలో 352, 357 పద్యము లుండుటచేత, నిందు నాలుగు వందల పద్యము లున్నట్లు నిశ్చయింపవలెను. కొమర్రాజు వారు చూచిన ప్రతియం దెన్ని యున్నవో తెలియుటలేదు.

## గ్రంథ స్వరూపము

ఇందన్నియు సీసపద్యములు—'బసవలింగ' అను మకుటము గలవి. ఇందు సీసపద్యములకు, నాటవెలదులు హెచ్చుగను, తేటగీతులు తక్కువగను ననుసరింపఁబడినవి. ఈ గ్రంథమున మకుట మున్నను సోమనాథుడు దీనిని కావ్యముగానే పరిగణించి యున్నాడు.

## సారత్రయము

ఆంధ్రభాషలో శైవ గ్రంథములలో

1. పండితారాధ్యుల శివతత్త్వసారము.
2. పాల్కురికి సోమనాథుని అనుభవసారము.
3. ,, చతుర్వేదసారము.

అను నీ మూడింటికి "సారత్రయము" అను సంప్రదాయ సంజ్ఞ యున్నట్లు, శివతత్త్వసార తాళప్రతి విలేఖరి—అద్దాల వీరన్న యిట్లు వ్రాసియున్నారు.

"పింగళినామ సంవత్సర కార్తిక బ॥ 13 గురు॥ సర్కి ప్రతి నున్నక్రమానను, అద్దాల వీరన్న అనుభవ సారాయమున్ను, శివసారాయమున్నూ, చతుర్వేద సారాయమున్నూ, సారత్రయమున్ను ..... వీరన్న స్వహస్తలిఖితం."

"పండితత్రయము" వలె "సారత్రయము" సంజ్ఞ సమంజసముగ సహేతుకముగ నున్నది.

సవైదిక వీరశైవ భక్తిమత సిద్ధాంతములను సప్రమాణముగా నిరూపించు గ్రంథము లీ మూడే!

పై తాళపత్ర ప్రతులలో నున్న కొన్ని పద్యములు పాల్కురికి సోమనాథుని చరిత్ర కుపయుక్తములైనవి. 2087 సంఖ్య వ్రాతప్రతియందీ క్రింది పద్యము ప్రస్తుత ముద్రణమున లేదు.

బసవన్న శ్రీపాద పద్మ పుష్పంధయ
స్థేముండు పాల్కుర్కిసోముఁడసఁగ

2. లేఖకుడు గ్రంథము చివర వ్రాసిన వ్రాతవలన పాల్కురికి సోమనాథుని 'అనుభవసారము' కూడ నిందుండి యుండవలెను.

3. ఈ తాళప్రతి యున్న మహనీయులు 'భారతి' పత్రిక ద్వారా, తెలిపినయెడ శైవ సాహిత్యోపాసకులు వారికి కడుంగడు కృతజ్ఞులుగా నుందురు. చతుర్వేదసార గ్రంథ పరిష్కరణమున కది యత్యంతావశ్యకమై యున్నది.

బసవపుర ప్రాప్య పర్వతోత్తరముఖ
సీముండు పాల్కురికి సోముఁ డనఁగ
బసవపురాణ ప్రబంధ సంఘటనాభి
రాముండు పాల్కురికిసోముఁ డనఁగ
బసవ శతక గద్య పద్యాది సంస్కృతి
ధాముండు పాల్కురికిసోముఁ డనఁగ
వరగ ప్రస్తుతించి భావించి భజియించి
బసవ విభుని కరుణ యొనఁగఁబడసి
నిర్వికల్పరతి చతుర్వేద సారమున్
పద్యముల్ రచింతు బసవలింగ 4

పాల్కురికి సోమనాథుడు 'బసవపురము' అను నొక గానిని శ్రీశైల పర్వతోత్తరసీమయందు నిర్మించినాడని పై పద్యము వలన తెలియుచున్నది. సోమనాథునికి "చతుర్ముఖ బసవేశ్వరుడు" అను కుమారుడు గలఁడు.

బిడ్డలఁ జీ కెడు ప్రియమెంత యనుచు నీ
పేరు నా లింగంబు బెట్టినాడ"
—చతుర్వేదసారము. 191 పద్యము.

చతుర్ముఖ బసవేశ్వరుడను తనయుని పేరనే సోమనాథుడు 'చతుర్ముఖ బసవేశ్వరము" అను పురము నిర్మించి అందు చతుర్ముఖ బసవేశ్వరుని ప్రతిష్ఠించినాడు.5 పండితారాధ్య చరిత్రలో పర్వత ప్రకరణమున

ఉరుతర శ్రీ పర్వతోత్తర ద్వార
వర మహత్త్వంబు"

అని మొదలిడి అందరి యేకాదశ భవ్యతీర్థములను చెప్పి వెంటనే

"మొదలను శ్రీ చతుర్ముఖ బసవేశ
పద పద్మములు భక్తి భజియించి మఱియు"

అని దీనిని పేర్కొనినాడు.

వ్రాత ప్రతులలో నున్నవియు, ముద్రితమున లేనివియు నగు పద్యములు పెక్కు లున్నవి. మూడు పద్యములను మాత్ర మిం దుదాహరించుచున్నాను.

బసవలింగంబు నాపాలి దైవంబని
బసరింతు బసవానుబంధకృతుల
బసవేశ్వరుండు నా ప్రాణేశ్వరుండని
ప్రచురింతు బసవ విస్ఫార మహిమ
బసవగురుండు నా పరమ గురుండని
భావింతు బసవేశు భవ్యమూర్తి
బసవాధిపతి నన్ను భావించు పతియని
భజియింతు బసవన్న పాదయుగము
ప్రస్తుతించి పొగడి భావించి ప్రణుతించి
బసవవిభుని కరుణ యొనఁగఁబడసి
నిర్వికల్పరతి చతుర్వేద సారమున్
పద్యముల్ రచింతు బసవలింగ !

సీ. మహిలోక యహిలోక విహితాధినాథుండు
ఘనలోక మునిలోక వినమితుండు
మనులోక జనలోక మాననీయుఁడు పూర్వ
సురలోక సురలోక శోభితుండు
రసలోక దివిలోక రాజత్త్వైశ్వర్యుండు
విధిలోక విధులోక విశ్రుతుండు
హరిలోక హరలోక చరిత పుణ్యుఁడు రుద్ర
గణలోక గణలోక గణితకీర్తి
యా వృషాధీశుఁ డతఁడు దానైన బసవఁ
డాది మానవలోక హితార్థబుద్ధి
నీ చతుర్వేద సార మహిమ్న నాకు
లెసఁగ రచియింతు నీ కృతి బసవలింగ !

పరమ స్వతంత్ర భాస్వర నిత్య సర్వజ్ఞ
మంగళ శ్రీ మహాలింగమూర్తి
నిఖిల మూలస్తంభ నిర్మలజ్యోతిమ
యాంగ ప్రయుక్తోరు లింగమూర్తి
సకల నిష్కళ యుతైశ్వర్య శాశ్వత సము
త్తుంగ సదాశివ లింగమూర్తి
అతనుత బ్రహ్మాచ్యుతాగోచరాచ్యుత
భంగుర దివ్యాంగ లింగమూర్తి
భక్తహృత్పూర్తి భావ వశ్యుండగు
కల్మి మెఱసి బందికాంద్రఁ జేసి
వంగకాయ లట్ల లింగము ల్గాఁజూచు
ప్రతిభ మీకె యొప్పు బసవలింగ !

## స్వ సం వా ద ము లు

1. ఈ గ్రంథమునందలి (ముద్రిత గ్రంథము) 16 వ పద్యమును సోమనాథుడు పండితారాధ్య చరిత్రమునవే ద్విపద లలో పొదిగించియున్నాడు.

పరవాది మదగజ ప్రబల పంచాస్యంబు
పరవాది భూధర వజ్రధార
పరవాది మేఘ నిర్ఘర పవమానంబు

---

4. ఈ పద్యమును బసవపురాణ ద్వితీయ ముద్రణమున పీఠికలో నే నిచ్చియున్నాను.

5. దీనిని గూర్చి "వీర శైవాంధ్ర వాఙ్మయ సర్వస్వము" అను నా గ్రంథమున వివరముగ జరిగించియున్నాను—

# పాల్కురికి సోమనాథుని చతుర్వేదసారము

పరవాది భూరుహ ప్రకటితపరశుఁ
పరవాది తస్కర పటుతర శూలంబు
పరవాది జలనిధి బాడబాగ్ని
పరవాది పరలతా భాస్వల్లవిత్రంబు
పరవాది శేకి భీకరముఖాహి
దండనాయకుఁ బసవఁ డుద్దండశౌర్యుఁ
డతఁడు పరవాది నిర్ధారణార్థబుద్ధి
మతము లాకించెఁ జర్చించు మహితసూక్తు
లెసఁగ రచియింతు వసుమతి బసవలింగ 16 ప.

పండితారాధ్య చరిత్ర వాద ప్రకరణమున—పండితుడు బౌద్ధునితో వాదము చేయుటకు వెడలు సందర్భమున పై పంక్తులే ద్విపద రూపమును దాల్చినవి.

పరవాది ఘోర సాగర బాడబాగ్ని
పరవాది మత్తేభ పంచాననంబు
పరవాది మేఘ దుస్తర మారుతంబు
పరవాది ఘన నవస్ఫురిత దావాగ్ని
పరవాది విషభూజ తరు కుఠారంబు
పరవాది దుష్ట దుర్భర ధూమకేతుఁ
బరవాది భూరి భూధర కులిశంబు
పరవాది వల్మీక వరఖనిత్రంబుఁ
బరవాది శేక భీకర భుజంగంబు. పుట. 519.

## చతుర్వేదసారము :

భవికృత కూప ప్రవాహ తటాకాది
భస్త్రి కమండలు భాండవారి
భవి జనారంభ సంభవ ధ్యాన నికర త
దారామకుల్యా లతాంతపాళి
భవిజన స్పర్శన పల్లవ కంద ము
ఖౌషధ ప్రముఖ పదార్థ సమితి
భవిదృష్టి పతనాన్న పానాది బహుపాక
తైల ప్రభృతి రసద్రవ్యచయము
భవికృతాంబరాదులు మఱి భాండభాజ
నాదులు నిషిద్ధ వస్తుచయము లభవ స
మర్పణానర్హములు తదీయ ప్రసాది
కెనగునె ప్రసాద సౌఖ్యంబు బసవలింగ 368 ప.

## పండితారాధ్య చరిత్ర-అవతారిక

భవికృతారంభ సంభవ ధాన్యనిచయ
భవి నిరీకణ రసపాకవితాన
భవి హస్తగతఫలపత్ర శాకాది
భవిగృహక్షేత్రాంఘ్రి పతన వర్జితుఁడు
భవిజన దర్శన స్పర్శనాలాప
వివిధ దానాదాన విషయదూరగుడ
శుద్ధ భక్తిస్థల స్తుతి మతాచార
సిద్ధ వీరేశ్వర శీలాన్వితుండ
నలి బాల్కురికి సోమనాథు డనంగ
వెలయు వాడను జతుర్వేద పారగుడ 15 పుట.

ఇంకను మత విషయములను నిరూపించునప్పుడును నీ గ్రంథ సంవాదము ఎక్కువగా కన్పించును. ఈ పద్ధతి సరియైనదే. ఏల ననగా నది ప్రామాణికమై చిరకాలానుగతముగా ప్రఖ్యాతి నందినది.

2. బసవ పురాణమున ద్విపదలో తొలుత జెప్పిన పంక్తులనే ఈ గ్రంథమున సీసములలో పొదిగించినాడు.

క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస
గోరునే పడియల నీరు ద్రావంగఁ?
జూత ఫలంబుల జుంబించు చిలుక
ప్రాతి బూరుగ ప్రానిపండ్ల గన్గొనునె?
రాకామల జ్యోత్స్న ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీకటి ద్రావ?
విరిదమ్మి వాసన విహరించు తేటి
పరిగొని విరియునే ప్రచ్చిలి విరుల ?
3—ఆ. 82 పుట.

## చతుర్వేదసారము

రాకామలజ్యోత్స్నఁ ద్రావ నిచ్చలుగన్న
నా చకోరంబుల కరుచియగునె ?
సహకార పల్లవ చయములు దొరికిన
జాతి కోయిలలకుఁ జప్పనగునె?
క్షీరాబ్ధిలోపలఁ గ్రీడింపఁ గల్గిన
భువి రాజహంసకుఁ బుల్లనగునె?
విరిదమ్మి వాసన వెల్లి మునిచినఁ గ్రోలు
షట్పదముల కనాస్వాద్యమగునె?
బహుళతర దయార్ద్రభావ ప్రభావన
మహిమఁ దనరు జంగమునంబు రాఁగ
నతుల భక్తిపరుల కాహ్లాదకరమగుఁ
బరిహృతాభిషంగ! బసవలింగ! 155 ప.

చతుర్వేద సారమున స్వసంవాదములేకావు. శ్రీనాథ పోతన మహాకవులును నిందలి పద్యముల ననుకరించియున్నారు.

---

6. ప్రథమావిభక్తి ప్రత్యయ లోపము—పరశువు—పరశు.

## చతుర్వేదసారము-16 పద్యము

పరవాది మదగజ ప్రబల పంచాస్యంబు
పరవాది భూధర వజ్రధార
పరవాది మేఘ నిర్భర పవమానంబు
పరవాది భూరుహ ప్రథిత పరశు
పరవాది తస్కర పటుతర శూలంబు
పరవాది జలనిధి బాడబాగ్ని
పరవాది పరలతా భాస్వల్లవిత్రంబు
పరవాది భేకి భీకరముఖాహి

దండనాయక బసవ డుద్దండ శౌర్యు
డతడు పరవాది నిర్వారణార్థబుద్ధి
మతము లాలించి జర్చించు మహిత సూక్తు
లెసగ రచియించు నీ కృతి బసవలింగ!

## శ్రీనాథ మహాకవి శివరాత్రిమాహాత్మ్యము

పరవాది మత్తేభ పంచాననాఖ్యుండు
పరవాది మండూక పన్నగుండు
పరవాది నవమేఘ పవమాన ధీరుండు
పరవాది సాగర బాడబుండు
పరవాది కుత్కీల భాసుర దంభోళి
పరవాది కేంధన పావకుండు
పరవాది చయ తమః పటలోగ్ర భానుండు
పరవాది భోగి సుపర్ణుఁ డనగఁ
జటుల జైన కోలాహల సమర బిరుద
ఘనుఁడు సంగ్రామ పార్థుండు వినుత యశుఁడు
శుభుఁడు ముమ్మడి దేవయ్య సుతుఁడనంగ
వెలసె శాంతయ్య విక్రమ వీరవరుఁడు

## చతుర్వేదసారము-37 పద్యము

హరి వీరశైవుఁ డన్నందుకు మఱియు గ
ర్భాదానఖండమే ప్రథమసాక్షి
హరి వీరశైవుఁ డన్నందుకుఁ దన నేత్ర
కమల మొసంగిన క్రమము సాక్షి
హరి వీరశైవుఁ డన్నందుకు శంకరు
చేతఁ బొందిన శివగీత సాక్షి
హరి వీరశైవుఁ డన్నందుకు శ్రీ సాంబుఁ
డనెడి పుత్రుని బడసినది సాక్షి
యిన్ని సాక్షులు గాకయు విన్నగాను
ధ్యేయుఁడని శంభుఁ బూజించు తెలివి సాక్షి

కాని సద్ధర్మములను నిక్కంబటంచుఁ
బలుక నోల్లరు కూళలో బసవలింగ!

## శివరాత్రి మాహాత్మ్యము

కలహంస సంపద కలకల క్రేంకార
కలకలంబైన యీ కొలను సాక్షి
ప్రసవ సౌరభ నట ద్భృంభరంబైన యీ
వలని లతా మండపంబు సాక్షి
ప్రచ్ఛాయ శీతలోపరిభాగమైన యీ
శశికాంతమణిశిలాస్థలము సాక్షి
తరు లతా గుల్మ సంతత పిధానాతప
వ్యాపారమైన యీ వనము సాక్షి
మకరకేతను పాదపద్మములు సాక్షి
రతి మహాదేవి జఘన భారంబు సాక్షి
సత్య మెన్నఁడు నినుఁబాయ సమ్మతించి
కౌగలింపగ నీగదే కమలవదన.

3 ఆ. 81 పద్యము.

## చతుర్వేదసారము-92 పద్యము

ఒండేమి విష్ణుని కుత్పత్తి గల్గుట
కును జయ దష్టమీ దినము సాక్షి.

అనునది 87 పద్యము వంటిదే.

చతుర్వేదసారమున ముం దుదాహరించిన

సీ. రాకామల జ్యోత్స్నఁ ద్రావ నిచ్చలుగన్న
నా చకోరంబుల కరుచి యగునె

అను పద్యము ననుసరించి పోతన్నగారు భాగవతమున నాబాల గోపాల మెఱిగిన యీ సీసము రచించినారు.

మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీహారములకు
అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్త మేరీతి యితరుల జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల.

(భాగవతము 7 స్కంధము.)

# పాల్కురికి సోమనాథుని చతుర్వేదసారము

## మూలము

సోమనాథుడీ గ్రంథమున హరదత్తాచార్యుని చతుర్వేద తాత్పర్య నిర్ణయమే కాక, తాను రచించిన సోమనాథ భాష్యము నుండి పెక్కు విషయము లనువదించినాడు. "వీర మాహేశ్వరాచార సారోద్ధారము" అను నామాంతరము గల సోమనాథ భాష్యమే దీనికి మూలమని చెప్పుట యతిశయోక్తి కాదు. ఈ క్రింది సీసపద్యమునకు మూలము పై గ్రంథమునందు లేదు.

మఱి "కులిశః కుసుమతి" యను వచన మే
ణాధి నాథుండు ప్రఖ్యాతిచేసె
నలి "దహన స్తుహినతి" యను వచనంబు
పిళ్ల నైనారు దాఁ బెంపుజేసె
తెల్లంబు "వారాన్నిధి స్థల" త్యను మాట
వాగీశ నైనారు వరలజేసె
తివిరి "శత్రుర్మిత్రతి" యనెడు వాక్యంబు
సింధు భల్లాణుండు చెలఁగజేసె
రమణ ముసిఁడి చౌడరాయండు "విషమప్య
మృత" తనియెడు మాట మెఱయఁజేసె
నిట్టి మహిమ గలుగునే యన్యులకు భక్తి
భావకులకు గాక బసవలింగ ! (185 పద్యము).

ఈ పద్యమునకు మూలము శివపంచస్తవములలోనొకటియగుఁ మలయరాజస్తవము నందలి యీ క్రింది శ్లోకము.

"కులిశం కుసుమతి దహన
స్తుహినతి వారాన్నిధిర్ధ్రువం స్థలతి
శత్రుర్మిత్రతి విషమ
ప్యమృతతి శివేతి ప్రలపతోభక్త్యా
(59 శ్లోకము.)

ఇంకను పరిశీలింపగా మఱికొన్ని లభించునని నా యభిప్రాయము.

ఈ శ్లోకమును పాల్కురికి సోమనాథకవి తరువాత ధూర్జటి తన శ్రీ కాళహస్తీశ్వర శతకమున ననువదించియున్నాడు.

మ. పవి పుష్పంబగు, నగ్ని మంచగు, నకూపారంబు భూమీ స్థలం
బవు, శత్రుం డతిమిత్రుఁడౌ, విషము దివ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలి లోపలన్ శివశివేత్యా భాషణోల్లాసికిన్
శివ నీ నామమె సర్వవశ్యకరమౌ శ్రీ కాళహస్తీశ్వరా. 7

## శాబ్దిక విషయములు

చతుర్వేదసారమున శైవమత విషయములే కాక శాబ్దిక విషయములు చర్చింపబడినవి. అందు ప్రధాన మైనది 'బసవ' నామ వ్యుత్పత్తి. బసవ శబ్దము సంస్కృత వృషభ శబ్ద భవమని సోమనాథుడిట్లు నిరూపించినాడు.

పశుపతి వృషభంబు పశుపతి పరముండు
యనగను జెల్లు శుభాక్షరములు
బసవ వాక్యంబు ప వర్గ తృతీయాక్ష
రము బ కారము పకారంబు వలనఁ
జరఁగఁ గుద్దాల తామరస కుఠారముల్
వరుసఁగుద్దలియుఁ దామరయు గొడలి
యను క్రియ 'శ షోస్స" యను వ్యాకరణసూత్ర
మున జొప్పడు సకారమును శకార
మున నహోవాయు తత్సూత్రమున చకార
మును పకారంబునను దోచుఁ బొలుపుమీఱు
బసవనామం బిదియు లింగభావ్య మగుట
బసవలింగాహ్వయం బొప్పు బసవలింగ. (8 పద్యము.)

దీనికి మూలము సోమనాథ భాష్యమునం దిట్లు గలదు.

"కో బసవ ఇతి ఇదానీం కలియుగే శివభక్తి ముద్ధర్తుం బసవాభిధేయేన వృషభ ఏవ జాతః వృషభస్య బసవ నామకత్వం కస్మాత్కారణాదాసీత్ వృకారస్య బకారాదేశో భవతి—వభయో ర భేద" ఇతి. "శషోస్స" ఇతి సూత్రాత్ షకారస్య సకారాదేశో భవతి. ఏతద్వృషభాక్షర తద్భవాత్ బసవ ఇతి నామ వక్ష్యతే. పశూన్‌పాతితి పశుపః వృషభః తత్పశుపత్యక్షరత్రయంచ సంభవతి. కుఠార కుద్దాల తామరసాది పదేషు తత్తదాద్యక్షరాణాం తత్తద్వర్ణ తృతీయాక్షరాదేశో భవతి. యథాకుఠారస్యాంధ్రభాషయాం గకారాదిర్భవతి. తామరస్యాంధ్ర భాషాయాం దకారాదిర్భవతి. తథైవ పశుపతి నామాద్యక్షర పకారస్య బకారాదేశో భవతి. 'శషోస్స' ఇతి సూత్రాత్ శ కారస్య సకారాదేశోభవతి. వః పవర్గస్య ఇతి వరరుచి సూత్రాత్ పకారస్య బకారాదేశోభవతి. అత యేవ పశుపేక్షరత్రయస్య బసవేత్యక్షరత్రయ సిద్ధిర్భవతి." 8

---

7. ప్రస్తుత గ్రంథ పరిష్కర్తలగు శ్రీ తమ్మయ్య గారు, తా మాంధ్రీకరించిన మలయరాజస్తవమున, తాము స్వంతముగ పద్యము రచింపకుండ చివర సంబోధనము మాత్రము 'నిత్యంబు భక్తాళికిన్' అని కూర్చి "తస్మై మ్రే దేయం తస్మాద్గ్రాహ్యం" అని శివభక్త్యాచార నిరతి పాటించిరి. శైవ సాహిత్యుల కిది కర ముపాదేయము.

8. ఈ సోమనాథభాష్య గ్రంథము తెలుగు లిపిలో శ్రీ గంగపట్టణము సుబ్రహ్మణ్య దేవరగారే ముద్రించిరి. (క్రీ. శ. 1914). కాని యది సుపరిష్కృత ముద్రణము కాదు. నేను పై నుదాహరించిన పంక్తు లందలివే—కావున యథామాతృకముగ నుద్ధరించినవాని యందలి దోషములు పాటింపకుందురు గాత. దీనికిని సుపరిష్కృత ముద్రణ మత్యావశ్యకమై యున్నది. సంస్కృతభాషలో నున్న యీ గ్రంథమునకు "మనోహరుడు" అను నొక శివభక్తుడు తెలుగులో టీక వ్రాసి యున్నాడు. అది కొంతవరకు లభ్యము.

పై యుద్ధృతాంశమువలన మన ప్రాచీన కవులు శబ్ద వ్యుత్పత్తి విచారణ పట్ల ప్రాకృత భాషను, ప్రాకృతమున గల వరరుచి వ్యాకరణమును గ్రహించినట్లు తెలియగలదు. బసవ శబ్దము వాడుకలోను ప్రాచీన శిలా శాసనముల యందును—'బసువ' అను ఉ న్మధ్య రూపముతో నున్నది. కీర్తిశేషులగు గిడుగు రామమూర్తి పంతులుగా రీ రూపము 'బసువ' యనియే యుండదగు ననిరి. కాని సోమనాథుడే పండితారాధ్య చరిత్రలో బసవ శబ్దములో సకారము యతి స్థానమున నిట్లు నిబంధించినాడు.

"అరుదగు దానయ్య యరవత్తు మువురు
చరితంబులును శ్రీ బసవ పురాణంబు.
(పర్వత ప్రకరణము 433 పుట)

కావున బసవ శబ్దము సాధువే యని నిర్ణయింపనగును.

చతుర్వేదసారమును వ్యాకరణ ఛ్ఛందో నియమానుసారముగ రచింతునని పాల్కురికి సోమనాథుడే యిట్లు స్పష్టముగా చెప్పియున్నాడు.

పద్య గణాక్షర పరిమి తోదాత్తాను
దాత్త స్వరాదులు దప్పకుండ
ధాతు శబ్దాళి సూక్తములతోఁ జేరిన
వాక్యముల్ సంపూర్తి వచ్చియుండ
స్వరవర్ణ పద బంధ సంధి న్యాసాలి రి
క్త ప్రయోగంబులు గలుగకుండ
నిజపద వాక్యార్థ నిర్ణయోక్తులతోడఁ
బై యర్థములు తప్పు పడకయుండ
నలరు నుపనుషద్వేద సూక్తులకు భాష్య
మునకు నైఘంటికంబుల కనుగుణంబు
లగు పురాణ స్మృతీతిహాసాగమోక్తు
లెసగ రచియింతు నీ కృతి బసవలింగ. (20 పద్యము.)

8 నుండి 13 వ పద్యము వరకు బసవనామ నిర్వచనమే గలదు.

చతుర్వేదసారమునుండి తెలియదగిన వ్యాకరణ ఛ్ఛందో విశేషము లెన్నియో గలవు. వానిని వివరించుట కిది యదను గాదు. నన్నయభట్టారకుడు భారతములో

ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్షణ సంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యం బనియును గొనియాడుచుండ
వివిధవేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు (ఆది 1.—31)

అని గ్రంథప్రాశస్త్యము నుగ్గడించునట్లుగా సోమనాథుడును చతుర్వేదసారమున

వైదికు లిది శుద్ధ వైదికంబని యెన్న
శాస్త్రజ్ఞు లిది ధర్మశాస్త్ర మనఁగ
తార్కికు లిది మహా తర్కం బనంగ పౌ
రాణికు లిదియ పురాణ మనఁగ
నాగమ విదులు దివ్యాగమం బిదియనఁ
దంత్రజ్ఞు లిది వీరతంత్ర మనఁగ
భక్తవారం బిది భక్తిమార్గం బన
ముక్త్యర్థు లిది మహాముక్తిద మన
కవులు భువిని నిదియె కావ్యం బనంగ స
జ్జనులకెల్ల మిగుల సంతసమున
నిర్వికల్పరతి చతుర్వేదసార మన
పద్యముల్ రచింతు బసవలింగ.

అని యీ గ్రంథ ప్రశస్తిని యుట్టంకించి యున్నాడు.

ఉపలబ్ధములైన, తాళపత్ర ప్రతులందలి పద్యములతో, సవ్యాకృతిశీలితముగ, సమగ్ర వ్యాఖ్యా, పీఠికా విశేషములతో, చతుర్వేదసారము వెలువడెనేని, అది ఆంధ్ర వీరశైవ వాఙ్మయమునకొక యలంకార మగుటయే గాక, ఆంధ్ర సాహిత్య చరిత్రమునకు నెంతో యుపకారి కాగలదు. అది యెన్నటికి ప్రాప్తమో?

ఇంతవరకు ప్రచారములో లేని యీ గ్రంథము కేవలము శైవవాఙ్మయసేవా దీక్షయే భాండారముగా గల బండారు తమ్మయ్యగారు, ససిగా ముద్రించి, ఆంధ్ర సాహిత్యాభిమానుల కందజేసి యున్నారు. దాని కాంధ్ర విద్వల్లోక మెంతయు వారియెడ గృతజ్ఞత చూపవలసి యున్నది. ఆంధ్ర సాహితీ విమర్శకు లీ గ్రంథము పఠించి, పాల్కురికి పద్యరచనను చవిచూచెదరుగాత !

# సృష్టిలో తియ్యనిది

శ్రీ వాకాటి పాండురంగరావ్

## 1

అలవాటు చొప్పున సాయిబాబు ఆ సాయంకాలం తన పెట్టె తెరిచాడు. బట్టలన్నిటినీ పక్కకు తొలగించి ఒక ఫోటోను తీసి చేతిలో ఉంచుకున్నాడు; ఓ నిముషం చూశాడు. 'చూసి రెండు నెలలయింది ....' అనుకున్నాడు. ఆ ఫోటోను పెట్టేసి బట్టలు సర్ది పెట్టెను మూసేశాడు.

మూస్తుండగా ఏదో అలికిడయినట్లనిపిస్తే తిరిగి చూశాడు. మహాలక్ష్మమ్మ నిలబడిఉంది .... పాతికేళ్ళు దాటని మహాలక్ష్మమ్మ. పగలు ఏడింటినుండి రాత్రి పదింటిదాక తన నూనె కొట్టులోనే తేలిమునిగే నరసయ్య అర్ధాంగిని మహాలక్ష్మమ్మ.

ఆమె తన గదిలోకి అంత చొరవగా రావడం సాయికి ఆశ్చర్యం కలిగించింది. ఇందాకట్నుంచీ ఆమె ఇక్కడే నిల్చుందేమో .... సాయికి కొద్దిగా కోపం కూడా వచ్చింది.

"ఏం కావాలండీ ?"—కాస్త కటువుగానే అడిగాడు.

మహాలక్ష్మమ్మ నవ్వింది.... "అబ్బే—ఏమీ వద్దండీ .... ! ఆ ఫోటో మీ ఆవిడదా .... ?"

"ఆ !"

"మీకు పెళ్ళి కాలేదన్నారు ?"

"అవును, కాలేదు .... "

మళ్ళా నవ్వింది మహాలక్ష్మమ్మ—"భలేవారే ! .... పెళ్ళి కాలేదంటారు. పెళ్ళాం ఫోటో ఉందంటారు ...." అంటూ వచ్చి మూల ఉన్న పేము కుర్చీలో కూర్చుంది. సాయికి మహా చిరాకుగా ఉంది. మరొకరయితే తక్షణమే గది బయటికి వెళ్ళి పొమ్మనవచ్చు .... ఈవిడ ఎవరో కాదే .... సాక్షాత్తూ ఇల్లుగలావిడ .... తాను ఈ క్రొత్త వూళ్ళో, ఉద్యోగానికి వచ్చి, హొటలులో దిగి, ఒక గదికోసం వెతుకుతున్నప్పుడు, చాలా మంది యజమానులు బ్రహ్మచారికి గది అద్దె కివ్వడానికి నిరాకరించినప్పుడు, ఈ యింటి నరసయ్య కూడా కాస్త తటపటాయించినప్పుడు, భర్తకు నచ్చజెప్పి తనకీమాత్రం వసతి నిప్పించినావిడ .... ఈవిడని వెళ్ళిపొమ్మని ఎలా చెప్పడం ?

"ఏదో ఆలోచిస్తున్నట్లున్నారు ? .... నే వెళ్ళిపోతా లెండి .... " అని లేవబోయింది....

"అబ్బే .... ఆలోచన ఏమీలేదు లెండి—" అన్నాడు సాయిబాబు.

మహాలక్ష్మమ్మ మళ్ళా కూచుంది.

కూచుని చెప్పింది : " నేనా ఫోటోను గురించి అడగడం తప్పేమో ? ఏమీ అనుకోకండి. పనిమనిషి వెంకటమ్మ ఒకటి రెండుసార్లు చూచినట్టుంది. నాతో చెబుతే, ఏదో కుతూహలంకొద్దీ .... "

సాయి ఆశ్చర్యం పెద్దదయింది.

పనిమనిషి చూసి ఈవిడతో చెప్పిందా ? కొన్ని కొన్ని విషయాలు ఎలా రెక్కలమీద పరుగెడతాయో !! ఇంకా నయం. .... ఆ ఫోటో తాను ఉంచుకున్న సానిదానిదనీ, దానికోసం తన జీతమంతా తగలేస్తున్నాననీ పాకి పోలేదు .... అలాగనక ప్రచారమయిందా, తానిహ కాదనలేడు. అప్పుడు తాను రోడ్డంబట వెళ్తుంటే కొన్ని వింత దృష్టులు తనమీద ప్రసరించేవి కాబోలు ! 'నిప్పు లేనిదే పొగ రాదులెండి'—అని కొందరు ఆర్యులు భాష్యం చేసేవాళ్ళు కాబోలు !

—అనుకుంటూ పెట్టె తెరిచి ఆ ఫోటోని తీశాడు సాయి.

ఆ ఫోటో మూలలలో ఒకటి నలిగినట్లుంటే దానిని కొన గోటితో అతి జాగ్రత్తగా సరిచేసి, అరచేత నుంచుకొని ఓసారి చూశాడు .... హఠాత్తుగా మహాలక్ష్మమ్మకి ఆ ఫోటోను అందిచ్చాడు.

అతడి చేయి ఆమె చేతికి తగిలింది. కాని అది తెలుసుకుని ఝల్లుమన్నది ఒక్క మనసే. ఆ జల్లు ఆగిన మరుక్షణం ఆమె పడ్డ ఆశ్చర్యానికి అంతులేదు. మళ్ళీ మళ్ళీ చూసింది ఆ ఫోటోను !

అక్కడ—సాయిబాబు వయసువాడే—ఒక యువకుడి మొహం ఉంది. అతడి కళ్ళలో ప్రశాంతమయిన ఆకర్షణ, అయస్కాంతంలా వెలుగుతూంది.

సాయిబాబు మహాలక్ష్మి మొహాన్ని గమనిస్తున్నాడు.

"ఇతడు మీ అన్నయ్యా ? తమ్ముడా ?" అని ప్రశ్నించింది ఆమె.

"అతడు నా మిత్రుడు—" అన్నాడు సాయి .... ఆ మాటలు చెప్పలేని భావముద్రాన్ని వాటిలోకి వృథాగా పొందుపరుస్తూ—

"మీ రివాళ రాత్రి మా ఇంటో భోంచేయకూడదూ ?"

"అబ్బే ఎందుకులెండి—"

"మావారు ప్రక్క వూళ్లో పెళ్లికి వెళ్లారు. రాత్రికి నే నొక్కర్తినే భోంచేయాలి—"

"ఇంకెపుడయినా ..... "

"మీ కులంవాళ్లం కాదనా .... ?"

"అది కానే కాదండి—"

"మీ యిష్టం ...." అని లేచి గుమ్మందాకా నడిచి, తిరిగిచూసి, నవ్వి— "వస్తా—" అని వెళ్లింది మహాలక్ష్మి.

సాయిబాబులో ఒకటి రెండు ప్రశ్నలు మిగిలాయి. వాటికి జవాబులు వెదకడానికి అతడికి యిష్టం లేకపోయింది.

ఫోటోను భద్రంగా దాచాడు. బట్టలు మార్చుకుని హోటలుకు వెళ్లాడు. భోజనం ముగించుకుని వచ్చి మేడ మెట్లు ఎక్కుతుంటే—'మంచి దినము నేడే—మహరాజుగా రమ్మనావే—' వినబడింది .... మహాలక్ష్మి కాబోలు .... దాబా మీద పడుకున్నాడు. కమ్మని సంగీతంలా గాలి వీస్తూంది. ఆవలించిన ఆకాశంమీద ఎవరో మణులను పారేసుకున్నారు. ఆ మణుల మధ్య చందమామ దొర్లుతున్నాడు.

సాయిబాబు మనస్సు మేఘమై మదరాసు పరుగెత్తింది ......

సముద్రతీరం చేరింది.

అక్కడ, తనూ, రాజూ ఎన్నివందల సాయంకాలాలు గడిపారు ! ఆ రోజుల్లో తనకేదీ ఉద్యోగం లేదు. రాజు దిన పత్రికలో ఉంటుండేవాడు; ఇప్పుడూ ఉన్నాడు. తను నాలుగింటి కెల్లా సముద్రతీరం చేరుకునేవాడు. అక్కడో చిన్న గుడి, దానిముందో మంచినీళ్ల బావి ఉండేవి .... దానికి తిన్నగా నీటి ఒడ్డున కూచునేవాడు. అయిదున్నరకెల్లా రాజు వచ్చేవాడు.

ఎన్ని కబుర్లు ! ఎన్ని అభిప్రాయాలు ! ఎన్ని విమర్శలు .... చుట్టుపక్కల జనాన్నే మరిచిపోయేవారు .... ఒక్కోసారి రాత్రి పదీ పదకొండూ అయ్యేది .... హోటలువాడు భోజనాల కైము అయిపోయిం దనేవాడు.

ఒక్కో సాయంకాలం రాజు—"సాయీ ! .... 'మనసున మల్లెల మాల లూగెనే—' పాడవూ ?" అనేవాడు. అది కాక పోతే 'ఓహో ! విభావరీ .... ' అడిగేవాడు. తనకేమంత గొప్పగా పాడ్డానికి రాదు .... అయినా, ఆకాశం ఒడిలో, అలల సన్నిధిలో, వెన్నెల తియ్యదనంలో, మిత్రుడి సన్నిధిలో— మనసు భాషకందని భావాలను విరజిమ్ముతుంటే—హృదయం అవ్యక్తమయిన ఆనంద భారంతో క్రుంగిపోతుంటే—అలా అలా నెమ్మదిగా పాడుకోవడంకన్న జీవితంలో ఇంకేమీ వద్దని పించేది. ఎప్పుడయినా తను పాడడానికి జంకితే రాజు అనే వాడు .... "సాయీ ! సృష్టిలో మనిషికి మాట అంటూ వచ్చిన తర్వాత ఉత్తమ పరిణామం, పద్యమూ పాటా. పాడుకో గల్గిన స్వరం ప్రతివాడికీ అంతో యింతో ఉంటుంది. ఆ ఉద్వేగమూ, ఆ ఆనందమూ తెలిసి పాడుకోవడం .... ఎంతో మధురమయిన అనుభూతి—"

"మరి నువ్వు పాడరాదూ—?" అని తనడిగితే రాజు నవ్వేసేవాడు .... రాజు ఎంత చక్కగా నవ్వుతాడనీ .... తన కొక్కటే కోపం. లక్షసార్లు చెప్పినా రాజు సిగరెట్లు మానడు కదా. రోజుకో పెట్టె తగలెడతాడు. గట్టిగా తిడితే ఓ నవ్వు పారేస్తాడు. ఏం చెయ్యడమో—?

ఒకసారి .... చంద్రగ్రహణం తెల్లవారుఝామున ఉందనగా ముందర రాత్రే తా మిద్దరూ ఓ జంపఖానా, ఫ్లాస్కునిండా టీ, పేక ముక్కలూ, పట్టుకుని సముద్ర తీరం చేరుకున్నారు. దొంగతనంగా రాజు రెండు సిగరెట్టు పెట్టెల్ని పంట్లాం జేబుల్లోకి తోసెయ్యడం తనకు తెలియ దనుకున్నాడు .... బీచి ఒడ్డున కాసేపు యిటూ అటూ తిరిగారు. పది దాటింది ... వ్యాహ్యాళి కొచ్చిన జనం అంతా వెళ్లిపోయారు. ఇహ ఉండలేకపోయిన రాజు సిగరెట్టు వెల్గించాడు. తనేమీ పలక్కుండానే .... రాజు "ఏం చెయ్యను సాయీ ! ఎంత ప్రయత్నించినా మానలేకపోతున్నాను. అయినా మునుపు ఇరవై కాల్చేవాడిని. ఇప్పుడు పదహారే—తెలుసా ?" అన్నాడు.

ఒక దీపంకింద జంపకానా పరుచుకుని పేకాట మొదలు పెట్టారు. మధ్యలో ఒక రిక్షావాలా వచ్చాడు. "రిక్షా కావాలా సామీ ?" అన్నాడు. ఎవరూ జవాబివ్వలేదు. ఈ సారి రిక్షా వాడు—"రిక్షా ఎక్కండి స్వామీ ! పొణ్ణు శౌవా బాగుండును ... ఇదు రూపాయలు దా—" అన్నాడు. అంతే ! హఠాత్తుగా లేచి వాడి చెంపమీద ఒక్క టేచ్చుకున్నాడు రాజా. ఆ రిక్షావాడు హడలి పరుగెత్తాడు .... "వెధవలు—మనం ఎవ రనుకుంటు న్నాడో—" అంటూ వచ్చి కూచున్నాడు రాజా. ఇంకో అర

గంటలో ఓ పోలీసు జవానొచ్చాడు. తా మిద్దరమూ డబ్బు పెట్టి పేకాడుతున్నామని మందలించడానికి వచ్చినవాడిని ఆటలో మూడోవాడి కింద కూచోబెట్టాడు రాజు.

రిక్షావాడిని కొట్టిన కోపమూ రాజే; పోలీసువాడిని పేకాటలోకి చేర్చిన సౌమ్యమూ రాజే.

అలాటివాడు తన మిత్రుడు .... తమ అనుబంధం మహాలక్ష్మిలాటి మామూలు మనుషుల కెలా తెలుస్తుంది ?

తమాషా ! రాజు ఫోటోని చూసి "మీ అన్నయ్యా, తమ్ముడా ?" అని అడిగిం దావిడ. ఇదివర కిద్దరు ముగ్గురు అలాగే అడిగారు. తమ ఇద్దరిమధ్యా అంత పోలిక లున్నట్లు తనకు తెలియదు. పైపెచ్చు తను రాజుకన్న నాలు గంగుళాల పొడుగు. తన మొహం కోలగా ఉంటుంది. రాజు నవ్వితే అతడి గుండ్రటి బుగ్గలమీద సొట్టలు పడతాయి. ఇటీవలే తన నొక్కుల జుత్తు నెరవడం ప్రారంభించింది. తలంటి పోసుకున్న రోజున రాజు తల నల్లటి పట్టు తివాసీలా ఉంటుంది.... అలాంటప్పుడు మహాలక్ష్మి కాని, మరొక్కరు కాని ఆ ప్రశ్న ఎలా వేస్తారో ? .... రేపు ఉత్తరం రాసేటప్పుడు రాజుకు మహాలక్ష్మి గదిలోకి వచ్చిన సంగతి రాయాలి ......

మదరాసువెళ్లిన సాయిమనసు మత్తులో కలిసిపోయింది.

## 2

—తెల్లవారింది.

సాయిలేచి మొహం అదీ కడుక్కుని ఎలక్ట్రిక్ స్టవ్ మీద పాలు కాచుకుని తాగాడు. పేపరు చదివిన పిమ్మట స్నానం. తర్వాత డైరీ రాసుకోవటం—ఒక పుట్టినరోజు సందర్భాన రాజు డైరీ కానివ్వడంతో ఎనిమిదేళ్ల క్రింద మొదలయింది ఈ అలవాటు—డైరీ అయిం తర్వాత నెమ్మదిగా బయలుదేరి దారిలో హోటలులో భోజనంచేసి ఆఫీసు చేరడం —ఇదీ మామూలు.....

ఆరోజూ సాయి అలాగే ఆఫీసు చేరాడు.

చేరగానే హెడ్క్లర్కు సతాయింపు మొదలవుతుంది. ఓ పది రోజుల క్రిందట ఆయన సాయిని కేకేసి, ఫలానా బడికి వెళ్లి వాళ్ల మూడో అబ్బాయి జీతం కట్టి రమ్మన్నారు. సాయి ఆపని చెయ్యనన్నాడు. అక్కడినుండి ఆ హెడ్ కర్కు ఎప్పుడు తప్పులు వెదకెడు వప్పురుషుడ్లై కూరుచున్నాడు. ఆయన బారినుండి తప్పించుకోవడానికని సాయి, ఆఫీసు పదింటికే అయినా, తొమ్మిది మ్ముప్పావుకే చేరేవాడు రోజూ.

ఇవాళ—

"మిస్టర్ సాయిబాబా !" హెడ్క్లర్క్ పిలుపు విని లేచివెళ్లి ఆయన టేబిల్ దగ్గర నిల్చున్నాడు సాయి.

"ఏమిటీ డ్రాఫ్ట్ ! కింది వాళ్లకు రాసే ఉత్తరాల కాపీలు పై అధికారులకు పంపరాదని చెప్పలే ? .... పైపెచ్చు ఎందుకీ చాంతాడు వాక్యాలు ?? .... నీ బియ్యే జ్ఞానమంతా ఇక్కడేమీ ఒంపక్కర్లేదు—" అని ఎడాపెడా అరిచి ఆ ఫైలుని కింద పారేశాడు.

సాయి మాట్లాడకుండా వెళ్లి తన కుర్చీలో కూర్చున్నాడు. ఫ్యూన్ను పిలిచి క్రింద పడివున్న ఫైలును తియ్యమన్నాడు. హెడ్క్లర్క్ కోపానికి ధూపం వేసినట్లయింది. అయినా ఆయన ఏమీ మాట్లాడలేదు.

మధ్యాహ్నం లంచ్ ఇంటర్వెల్ తర్వాత ఓ గంట గడిచింది.

రవూఫ్ అన్న అక్కౌంట్సు గుమాస్తా సాయి దగ్గరకు వచ్చాడు. అవీ ఇవీ ఏవో మాట్లాడి సాయిని పక్కకు రమ్మన్నాడు. అతి రహస్యంగా పది రూపాయలు అప్పిమ్మని కోరాడు. సాయి దగ్గర అంత లేదు. పోనీ, అయిదు చూడమన్నాడు రవూఫ్. తన దగ్గర ఉన్నది రెండే రూపాయలనీ, దానితో యింకా మూడు రోజులు గడవాలనీ చెప్పాడు సాయి. అయితే రూపాయిస్తే సద్దుకుంటా నన్నాడు రవూఫ్. జీతం రాగానే ఇచ్చేస్తా నన్నాడు. ఇచ్చి వెళ్లి కూచుని తన పని చూసుకోసాగాడు సాయి.

హెడ్క్లర్క్ అతడి దగ్గరకు వచ్చాడు. ఆయన చేతిలో ఒక పొడుగాటి పట్టీ ఉంది.... "చూడు సాయిబాబూ ! ఎల్లుండి ఆదివారంనాడు మన ఆఫీసరువారి ఇంట్లో ఉపనయనం ఉంది. ఆ సందర్భంలో అబ్బాయికి ఆఫీసువాళ్లు ఒక ఉంగరం యివ్వాలని నిశ్చయించాం ! అందుకని నువ్వో రెండు రూపాయలయినా ఇవ్వాలి !" అని తేనె లొలుకుతూ పలికాడు ఆయన.

ఆ ఉపనయనం ఆహ్వానము ఏదీ తన పేరిటికి రాలేదనీ, అంచేత తను రెండు రూపాయలు ఎందు కివ్వాలో తెలియదనీ, అయినా తన దగ్గర ఒక్క రూపాయే ఉందనీ, గనక ఏమీ ఇవ్వలేననీ చెప్పాడు సాయిబాబు.

"ఇందాకా రవూఫ్కు అయిదు రూపాయ లిచ్చావే ...." అని ఎదురుక్కున్నాడు హెడ్క్లర్కు.

సాయి చెప్పిన నిజం ఆయనకు నచ్చి అబద్ధమయింది.

సాయిబాబు మనసు వికలమయింది.

మనిషి మనిషినిలా ఎందుకు ఈసడించాలి ? ఎందుకిలా వేటాడాలి ? రోగం, దారిద్ర్యం, భూకంపం, మరణం —ఇలాటి చీకట్లు ఎన్నో ఉండగా—అవన్నీ చాలవన్నట్లు మనిషి మనిషి నెందుకు అసహ్యించుకోవాలి ..... ? తోటివారి నెందుకు ద్వేషించాలి ? హాయిగా మనసూ మనసూ విప్పి మాట్లాడుకో రెందుకు ? తన సుఖం ఇంకొకరిదిగా, ప్రక్కవాడి కష్టం తనదిగా జీవించ రెందుకు ?? అలా అందంగా ఆనందంగా జీవించడానికి కావలసింది స్నేహభావం. ఆ భావమే దైవం. అది అమృతం. అది అద్వితీయమయిన బంధం. దాని పవిత్రత, దాని నైర్మల్యం తెలుసుకుంటే, ప్రతిఒక్క వ్యక్తికీ నిజమైన మైత్రి ప్రతి ఒక్కరితో ఉంటే, ప్రపంచంలో అసలు బాధలే ఉండవేమో .... ఆ విషయంలో తనెంత అదృష్టవంతుడు—

అన్న తలపుతో ఆఫీసులోని సంఘర్షణలకు సమాధానం చెప్పు కుంటూ నడుస్తున్నాడు సాయిబాబు. అది సాయంకాలం ఆరు గ్గంటలవేళ. అలా పార్కువైపు నడిచాడు. ఈ గుంటూరులో అదేం ఖర్మో కూచుందామంటే పార్కులో ఒక్క చదరపడుగు పచ్చిగడ్డి కనబడదు.....

—అలా బజారు వెంబడి నడుస్తున్నాడు సాయిబాబు.

ఒకచోట జనం గుమికూడి ఉన్నారు. ఎవడో అబ్బాయి డప్పు వాయిస్తున్నాడు. వాడి ప్రక్కనే యింకొకడు పేక ముక్కలతో గారడీ చేస్తున్నాడు. సాయి అక్కడ నిలుచున్నాడు. తర్వాత ఆ గారడీవాడు పాముకూ, ముంగిసకూ పోట్లాట పెట్టాడు. పాపం, ముంగిసకు ఆవేళ బొత్తిగా పని చేయాలని లేదల్లే ఉంది. కాని చేయక తప్పిందికాదు. వాటికో ట్రేడ్ యూనియనా, ఏమన్నానా ...... ? అది అయింతర్వాత ఆ గారడీవాడు తన గురుప్రసాదమయిన మంత్రం గల తాయెత్తు లను కేవలం ప్రజలమీది ప్రేమకొద్దీ అమ్ముతున్నా నన్నాడు. ఆ తాయెత్తు దగ్గర ఉంటే పాము కాని, తేలు కాని, మరొకటిగానీ కరవదనీ, కరిచినా విషం ఎక్కదనీ, ఎక్కినా చావరనీ చెప్పి ఒక ఇంగువడబ్బా తెరిచాడు. దాన్నిండా లుకలుకలాడుతూ నానారకాల తేళ్లు తిరుగుతున్నాయి .... ఒక ఎర్రటి తేలుని చేత్తో తీసుకుని వాడు తాయెత్తుల అమ్మకానికి జనం చుట్టూ తిరగ నారంభించాడు. ఎవరయినా సరే ఒక తాయెత్తుని చేతిలో ఉంచుకుని ఈ తేలుతో కుట్టించు కోవచ్చుననీ ఏమీ కాదనీ హామీ ఇవ్వసాగాడు వాడు. అయినా ఎవ్వరూ ముందుకు రాలేదు. పాపం, వాడి మొహం వెలవెల బోతూంది. ఇంత కంఠశోష వృథాయేనా .... అన్పించినట్లుంది. ఆఖరికి వాడి కళ్ళు ఆ గుంపులో ఉన్న సాయిబాబు మీద పడ్డాయి. అతడిని తేలుని పట్టుకోమని ఆహ్వానించాడు గారడీవాడు. కొంతమందికి సాధారణంగా తేలు కుడితే విషం ఎక్కదు. అలాటి వాళ్లలో సాయి ఒక్కడు. అతడికి ఆ విషయం తెలుసు. అయినా ముందుకొచ్చి ఆ తేలునీ తాయెత్తునీ తీసుకున్నాడు. జనం అంతా ఆశ్చర్యంగా అతడి వైపు చూశారు. తేలు కొండెం సాయి చేత్తో ఒకటి రెండు సార్లు ఆడుకుంది. సూది గ్రుచ్చినట్లుంది సాయికి. అతడేమీ ఉలకలేదు, పలకలేదు. "చూశారా ! నా తాయెత్తు మహిమ—" అని సగర్వంగా అరిచాడు గారడీవాడు. సాయి ఏమీ పలకలేదు. చాలా తాయెత్తులు అమ్ముడుపోయాయి. గారడీవాడు ఉచితంగా ఒక తాయెత్తు నివ్వబోతే వద్దని, హోటలుకు నడిచాడు సాయి. ఆపాటికి చీకటపుతూంది. భోజనం ముగించాడు. దారిలో ఒక సినిమా థియేటరు కన్పించింది. ఆ సినిమా బాగుందని ఎవరో అన్నారు కానీ తాను లేక రాజూ, రాజూ లేక తానూ సినిమాలకు వెళ్లరే .....

## 3

ఇల్లు చేరాడు సాయి. దాదాపు ఎనిమిది గంట లయి ఉంటుంది. తన గది తాళం తీయబోతుండగా మహాలక్ష్మి వచ్చింది. ఆమె చేతిలో ఓ కవరుంది.

"ఇది సాయంకాలం వచ్చింది..... " అని అతడి చేతికి అందిచ్చింది చిరునవ్వుతో.

ఆ ఏటవాలు అక్షరాలు ఎవరివో చూడకుండానే చెప్ప గలడు సాయి. అతడి గుండె ఆనంద తాండవం చేసింది .... ఇవాళ తాను రాజుకు రాద్దామనుకుని, ఆఫీసు గొడవలలో పడి రాయలేదు..... కాని తనకు రాజే రాశాడు ! అదేమిటోగాని తమ ఇద్దరిలో ఒకరు ఏదయినా అనుకున్న రోజున దూరంగా ఉన్న అవతలివారికీ అదే ఆలోచన వస్తుంది.... ఇలా ఇంతకుముందు చాలసార్లు జరిగాయి—ఇదంతా తమ ఇద్దరి మధ్య మాత్రమే జరుగుతుందన్న నమ్మకం కేవలం భ్రమేనా—లేక దీని వెనక ఏదయినా ఒక శక్తి అంటూ ఉన్నదా అనిపించింది సాయికి.

ఆపాటికి గదిలో అడుగుపెట్టి లైట్ వేశాడు. కవరు చింపబోతూ పక్కకు తిర్గి చూస్తే మహాలక్ష్మి ఇంకా నిలబడి ఉంది. ఒక్క క్షణం ఆవిడను చూశాడు. ఆమె ముక్కు పుడకలోని వజ్రం మెరిసింది. ఆమె చూపు మెరిసింది. మాట్లాడకుండా వెళ్లిపోయింది ఆమె.

కవరులో ఇరవయి రూపాయలకు బ్యాంక్ డ్రాఫ్టు ఉంది ! ఆశ్చర్యపడ్డాడు సాయి. అదే పడవద్దని రాశాడు రాజు.

తన ఉత్తరంలో. తనకు పత్రికలోవాళ్ళు ఇంక్రిమెంటు బాపతు బకాయి యాభై రూపాయలు ఇచ్చారనీ, సాయి పరాయి ఊళ్ళో ఎనభై రూపాయల జీతంతో ఇబ్బంది పడుతూంటే ఈ ఇరవయ్యా కాస్త సాయంగా ఉండగలవనుకుంటున్నాననీ కూడా రాజు రాశాడు.

తన చేతిలో ఉన్నది ఒక్క రూపాయి. ఇంకా గడవ్వలసినవి మూడు రోజులు. హొటలు టిక్కెట్లు రెండే ఉన్నాయి. ఎలాగా అని ఆలోచిస్తున్న తన ప్రశ్నకు మూడు వందల మైళ్ళ దూరాన ఉన్న రాజు సమాధానం ఇచ్చాడు! సాయి గుండెలో వెచ్చగా ఏదో వెలిగింది.

అంతసేపూ తాను కూర్చున్న పెట్టె ఇటూ అటూ వాలడం గుర్తించి లేచాడు సాయి. కదిలించి చూస్తే పెట్టె కింద ఏదో ఉన్నట్టు తోచింది. పెట్టె జరిపి చూశాడు .... చవకబారు శృంగార గ్రంథం ఒకటి నిద్రపోతూంది!

ఇందుకనే నన్నమాట పెళ్ళికాని అబ్బాయిలకు గదులు దొరకడం కష్టం.

సాయికి నరసయ్యమీద జాలివేసింది. రేపు ప్రొద్దున్నే ఇంకో గది వెతుక్కోవలసి వచ్చినందుకు సాయిమీద కూడా జాలి వేసింది.

## 4

అస్తమిస్తున్న సూర్యుడి ఆఖరి కిరణాలు రంగు రంగుల చేతులై వ్యాపించిన ఆకాశం కింద, అలల చేతులతో అందరినీ అందుకోవాలనీ ముందుకొస్తున్న సాగరుడి చేరువగా, తమ మామూలుచోట కూర్చుని ఉత్తరాలు చదువుకుంటున్నాడు రాజశేఖరం. ప్రక్కగా సిగరెట్లు పెట్టే, దాని మిత్రుడు అగ్గిపెట్టే కూర్చున్నారు.

అతనికో పది అడుగుల దూరంలో ముగ్గు రమ్మాయిలు కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు.

వెళ్ళిన నాలుగు నెలలలోనూ సాయి దాదాపు ముప్పై ఉత్తరాలు రాశాడు. వాటిలో రెండో మూడో ఘనత వహించిన తపాలాశాఖవాళ్ళు మింగారు. రాసిన ఉత్తరాలు అందలేదని తెలిసినప్పుడు ఏమిటో బాధగా వుంటుంది. సాయి ఎంత చక్కటి ఉత్తరాలు రాస్తాడనీ—అవి చదువుతుంటే అతడు ప్రక్కనే ఉండి పలకరిస్తున్నట్లుంటాయి—అనుకుంటూ రాజు ఆ కట్టలోనుండి, తాను రెండు నెలల క్రిందట పంపిన ఇరవై రూపాయల డ్రాఫ్టు అందగానే సాయి రాసిన పదహారు పేజీల ఉత్తరం తీసుకుని ఇంకోసారి చదివాడు. అదంతా ఏదో సినిమాలా ఉంది..... ఆ గారడీవా డెవడో తాయెత్తు అమ్మితే వాడితో కలిసి తను ప్రజలను మోసం చేశాడట. అందుకని శిక్షగా ఒకపూట భోజనం చెయ్యడం మానాడట. ఆ ఉత్తరం రాగానే చదివేసరికి, రాజుకి భలే కోపం వచ్చింది. దగ్గరుండి చీవాట్లు వేసేవాళ్ళు లేకపోతేసరి! అసలే హొటలు భోజనం; అదికూడా సరిగ్గా లేకపోతే ఆరోగ్యం ఏమవుతుందనీ? తను ఆ ఉత్తరానికి ఘాటుగా జవాబు రాశాడు. అది పనిచేసిందల్లే ఉంది. ఆతర్వాత తాను హొటలు మానేసి, ఒక ముసలావిడ ఇంటో భోంచేస్తున్నానని రాశాడు. అది రాస్తూ రాస్తూ, 'నువ్వు రోజుకు ఎన్ని సిగరెట్లు కాలుస్తున్నావూ, ఇంకా పన్నెండేనా—' అని అడిగాడు సాయి. ఏం చెయ్యడం .... కబుర్లు చెప్పడానికి తాను కూడా ప్రక్కన లేకపోయెకదా—ఇంక సిగరెట్లు తాగక ఏంచేస్తానని తన ఉద్దేశం? పాపం సాయి ఉంటే కనీసం వారానికి ఏడు సార్లయినా, 'సిగరెట్లూ—లంగ్ కేన్సరూ' అన్న విషయంమీద కూలంకషమయిన లెక్చ రిచ్చేవాడు. ఎక్కడెక్కడికో వెళ్ళి ప్రసిద్ధ వైద్యుల అభిప్రాయాలూ, కేన్సరుమీద పరిశోధనల ఫలితాలూ ఉన్న వార్తాపత్రికల కట్టింగులూ అవీ తెచ్చి ఎదుటపెట్టి మరీ అడిగేవాడు. కాని ఏమిటో తన బలహీనత—సిగరెట్లు బొత్తిగా లేకపోతే పిచ్చాసుపత్రి చేరవలసిందే—మరీ సాయి వెళ్ళింతర్వాత ......

''ఏయ్ బఠాణీలూ !'' అన్న గొంతుక తనవైపు హఠాత్తుగా వస్తే ఉలిక్కిపడి చూశాడు రాజు. ఆ ముగ్గురమ్మాయిలలో చెవుల రింగులమ్మాయి ఏదో కొంప అంటుకుపోయినట్లు అరుస్తూంది. ఆడదంటే ఎంత లాలిత్యముండాలి! మరీ వీళ్ళిలా అయిపోతున్నారే అనిపించింది రాజుకు.

మొన్న పత్రికలో ప్రకటన ఇవ్వడానికి వచ్చిన వి. ఎస్. రావ్ నడిగితే సాయికి తప్పకుండా ఉద్యోగం యిస్తానన్నాడు. వి. ఎస్. రావ్ కంపెనీ అంటే ఎంత మంచిదనీ—! పోయిన సంవత్సరం మూడు నెలల జీతం బోనసుగా యిచ్చారట. సాయిగ్గనక అది దొరికితే—ఇద్దరూ కలిసి మళ్ళీ ఈ ఇసకలో జీవితాన్ని నిండుగా జీవించవచ్చు ..... ఆ చంద్రగ్రహణం రాత్రి తలుచుకుంటే ఇప్పటికీ నవ్వొస్తుంది......

ఒకసారి ఏమయిందంటే—

మౌంట్‌రోడ్‌లో పెద్ద ఇరానీ హొటలొక్కటి కొత్తగా తెరిచారు..... ఆ తెరిచిన మరురోజు సాయంకాలం అక్కడికి వెళ్ళారు. తమ ఇద్దరి జీవితాలలోనూ అల్లాటి హొటల్లోకి వెళ్ళడం అదే మొదటిసారి. తెల్లటి యూనిఫారంలో అప్పుడే ఓడ దిగినవాడిలా వచ్చాడు సర్వర్. ఏం కావాలని ఇంగ్లీషులో అడిగాడు. ''కేక్స్'' అని తానంటే

"బిస్కెట్స్ ఆల్సో!" అన్నాడు సాయి. పరే రెండు నిమిషాల్లో వాడొక పళ్లెంలో ఒక దొంతర కేకులూ, ఓ అర వీశెడు బిస్కెట్లూ ఇంకో పళ్లెంలోనూ తెచ్చి ఉంచాడు. "కేక్స్" అని డంబంగా ఆర్డరిచ్చినప్పుడు ఇన్ని కావాలని చెప్పకపోతిమే—ఇప్పుడు వాడేమో మన వేషాల్ని చూసి ఇన్ని తెచ్చిపెట్టాడు, వీటిని వెనక్కు తీసుకు పొమ్మనడం ఎంత చులకన—అని మధనపడ్డారు తామిద్దరూ .... ఎలాగయితేనేం అరగంట కుస్తీపట్టి—ఆ రెండు ప్లేట్లూ ఖాళీ చేసేసరికి గుడ్లల్లోకి కేకు లొచ్చాయి! బిల్లు అయిదుంబావలా మాత్రమే అయింది. ఆ తర్వాత తెలిసింది. అన్ని కేకులూ తినివుండ నక్కర్లేదని ..... ఆ సర్వర్ మేము అంతకు ముందువారం నుండి తిండిలేక మాడివుంటా రనుకున్నాడేమో—

మరోసారి—

ప్రధాన మంత్రిగారొస్తే ఆయన్ను చూడాలని కార్పరేషన్ భవనం ఎదుట నిలబడ్డా రిద్దరూ .... జనం కిటకిటలాడి పోతున్నారు—తీరాచేసి ఆయన కారులో వచ్చేసరికి—అంతవరకూ తాము గమనించలేదు తమ చుట్టూ ఉన్న ఓ పాతికమంది నల్ల జెండాలు చూపించి ఏదో అరిచారు—అంతే! టపటప పోలీసులు చుట్టు ముట్టేసి ఆ గుంపు గుంపునంతా 'వేన్' లోకి ఎక్కించేశారు—ఆ గుంపు నట్టనడుమ తాముండిపోయారు—! మాకేమో తెలీదు మొర్రో అంటే ఆ సబ్‌ఇన్స్‌పెక్టర్ వింటేనా— ఆ వేన్‌లో తీసుకెళ్లి తాంబరానికి ఆరుమైళ్ల తర్వాత—రోడ్డంటూ లేని ప్రదేశాన వదిలేశారు. తనకు విపరీతమయిన కోపం వచ్చింది. సాయి కిదొక పెద్ద జోకు అన్పించింది. విరగబడి నవ్వాడు .... నెమ్మదిగా ఆ ఆరుమైళ్ళూ నడిచి వచ్చి ఎలక్ట్రిక్ ట్రెయినెక్కి రాత్రి ఎప్పుడో గది చేరారు .... ఇదంతా పత్రిక కెక్కించి పోలీసువాళ్లని దుయ్యబడతానంటే— వద్దంటే వద్దని అడ్డం పడ్డాడు సాయి—

తమ తొమ్మిదేళ్ల పరిచయంలో అలాటి ఇంద్రధనుస్సులెన్నో ....! 1952 లో ఒక సాయంకాలం తాను చచ్చీ చెడీ రాజమండ్రిలో ఆ మెయి లెక్కకపోతే సాయి తనవాడయ్యేవాడేనా—

ఆరోజు—రాజమండ్రిలో—బండి కదలిపోతుంటే కనవడ్డ పెట్టెలోకి సూట్‌కేసుతో ఎక్కేశాడు తాను— గుమ్మం దగ్గరే నిలబడ్డాడు. ఈలోపుగా, నోటినిండా తాంబూలంతో ఒక అడ్డపంచాయన వచ్చాడు. వచ్చీరాని తెలుగుతో—"ఇది రిజర్వుడు పెట్టె. దిగి పొమ్మ" న్నాడు. తనెంతో శాంతంగా జవాబిచ్చాడు. తనకు సీటు అక్కర్లేదనీ, తను అక్కడే నిల్చుంటాననీ విజయవాడలో దిగిపోతాననీ ఎంత చెప్పినా ఆ లుంగీవాడు వినడే! పైపెచ్చు వాడి బలగం నలుగు రైదుగు రొచ్చి తన్నొక పల్లెటూరి బైతులా బెదిరించసాగారు. ఈ లోపుగా గోదావరి స్టేషను వచ్చింది. వాళ్లు తన్ను దిగిపొమ్మని బలవంతం చేస్తున్నారు. ఈలోపుగా హోల్డాలుతో ఎక్కాడు ధోవతి కట్టుకున్న యువకుడు. ఎక్కి చెమట తుడుచు కుంటున్నాడు. అతడిమీదా పడ్డారు సహృదయులు. ఏమీ మాట్లాడకుండా ఒక్క క్షణం వాళ్లను చూసి తన్ను చూశాడు. తనేమీ చెప్పకుండానే పరిస్థితిని గ్రహించాడు. "మీరేం దిగనక్కర్లేదు ..... ఏమిటో వీళ్ల అజమాయిషీ నే చూస్తా—" అని హోల్డాల్‌మీద తీరికగా కూర్చున్నాడు. వాళ్లేదో బెదిరించబోయేసరికి—"ఇంకో వంద మందిని పిలిపిస్తా ఈ పెట్టెలోకి .... ఇందులో అన్ని సీట్లూ రిజర్వు కాలేదు ..... ఏమిటి మీ అక్రమం—" అన్నాడు. అంతే వాళ్లు కిక్కురు మనలేదు .... అంత ఠీవితోనూ ప్రవర్తించిన ఆ వ్యక్తి విజయవాడ వచ్చేసరికి తనకు వంద జన్మల నుండి తెలిసినవా డయాడు—

—"అదేవిటే .... చేతిలో ఉత్తరం ఎగిరిపోతుంటే అలా కళ్లు తెరుచుకునే కూచుంటాడేం—" అంది రింగులమ్మాయి.

"కవికుమారుడు కాబోలే లీలా!" అని ఘొల్లుమంది మూరెడు జడావిడ.

ఎగిరిపోతున్న ఆ ఉత్తరాన్ని నల్లచీర అమ్మాయి అందుకున్న క్షణాన్నే తన చేతిలో ఉత్తరం లేకపోవడం గమనించిన రాజు ఇటు చూసి, లేచివచ్చి ఆ అమ్మాయి చేతినుండి సాయి ఉత్తరాన్ని అందుకొని కృతజ్ఞత తెలిపి వెళ్లిపోయాడు.

ఆ అమ్మాయిలు ముగ్గురూ తమ సంభాషణ కొనిచ్చారు.

## 5

"అదికాదు జయా! నువ్వు ఆ యిల్లు విడిచి వచ్చేయరాదూ—" అంది లీల—నల్లచీరమ్మాయిని చూసి.

"ఎలాగే లీలా—నా తర్వాత చెల్లె లొకతె ఉంది కదా—నేను వచ్చేస్తే అదేమవుతుంది? అదీకాక నేను ఎక్కడకు వెళ్లడం ?" అని అడిగింది జయంతి—"ఎంత తాగుబోతయినా ఆయన మా నాన్న .... అది మా యిల్లు—"

"నిజమే—చేతికందిన కొడుకు పోవడం ఎవరినయినా కదిలించివేస్తుంది—" అంది మూరెడు జడమ్మాయి.

# సృష్టిలో తియ్యనిది

''అమ్మ పోయిన ఆరు నెలలకు అన్నయ్య పోవడం నా దురదృష్టం వసంతా!'' అంది జయంతి.

లీల మళ్ళీ అంది. ''అవన్నీ సరే నమ్మాయ్, ఇప్పుడు ఉద్యోగంచేసి ఆ ఇల్లు నిలబెట్టుతున్నది నువ్వు .... అట్లాంటప్పుడు ఎంత తండ్రి అయినా రోజూ తిట్లూ కొట్లూ భరిస్తూ ఎంతకాలం ఈఉండడం—అని ?''

''రాజకుమారుడు కీలుగుర్రంమీద వచ్చేదాకా—'' నవ్వుతూ అంది వసంత.

''ఏమోనమ్మా — తీరాచేసి రాజకుమారుడొచ్చి—ఊ, గుర్రంమీద కూచో, అనేసరికి మా చెల్లాయీ, మా నాన్నా అంటూ బయలుదేరదూ ఈవిడగారు—''—ఇది లీల.

''రాజకుమారుడు మంచివాడయితే వాళ్ళిద్దరికీ వేరే గుర్రం ఏర్పాటు చేస్తాడులే ...... ''

ఇందాక ఉత్తరాన్ని గాలికి విడిచినాయన వెళ్ళిపోయారు కాబోలు అంది జయంతి మనస్సు.

## 6

—నెమ్మదిగా నడుస్తున్నాడు రాజశేఖర్. పైక్రాఫ్ట్స్ రోడ్‌మీద ఎన్ని పాత పుస్తకాలషాపు లుంటాయనీ—అక్కడో దానిలో ఇరవై నిమిషాలు గడిచింది. 'చర్చిల్ యుద్ధ ప్రసంగాలు' కాపీ ఒకటి ఆరణాలకు కొన్నాడు. అది కొత్తదయితే నాలుగు రూపాయలు !

మద్రాసులో ఇదొక సౌకర్యం. మంచి పాత పుస్తకాలు చాలా చౌకగా దొరుకుతాయి. బేరమాడ్డం తెలియాలి—అంతే ....

''ఏమండోయ్ రాజశేఖరంగారూ !''

మాలతి. తన ఆఫీసులో టైపిస్టు. ఆమెను గురించి ఏదేదో అంటారు. కాని మంచిమనిషి. పక్కన ఆమె భర్త కాబోలు. ''వీరు మా శ్రీవారు. పేరు శ్రీనివాస్. ఆవులకూ మేకలకూ ఇంజక్షన్లిస్తుంటారు. ఈయన రాజశేఖరంగారని మా ఆఫీసులో 'సబ్' .... మీ ఇద్దరిదీ సిగరెట్ల గోత్రం'' అంది మాలతి. ఆ అమ్మాయి ఎప్పుడూ అంతే. చలాకీగా ఉంటుంది.

''ఈ ఆడవాళ్లు ఇంతేనండీ .... వేరే పనేమీ ఉండదు వీళ్లకు. వీళ్లేమో పిచ్చిపిచ్చిగా ఆ ఊలుమీదా, ఈ పూసల మీదా డబ్బు తగలెయ్యొచ్చు—మన సిగరెట్ల దగ్గర కొచ్చేసరికి యుద్ధాని కొస్తారు—'' అన్నాడు శ్రీనివాస్.

రాజు నవ్వాడు. ఒక్క నిముషం అదీ ఇదీ మాట్లాడిం తర్వాత ఆ దంపతులు రాజుని ఆదివారం తమ యింటికి భోజనానికి రమ్మన్నారు. వెళ్లిపోయారు.

## 7

హోటల్‌లో భోజనం ముగించాడు రాజు. బయటికి వచ్చి సిగరెట్ వెల్గించబోయేసరికి ఇందాక మాలతీ శ్రీనివాసుల మాటలు గుర్తుకొచ్చాయి .... సాయికీ తనకూ కూడా ఈ సిగరెట్ల విషయంలోనేగా పేచీ—సాయిని విడిచి నాలుగు నెలలయింది...... ఆ వి. ఎస్. రావుతో ఇంకోసారి ఖచ్చితంగా మాట్లాడేసి—సాయిని రాజీనామా ఇచ్చి వచ్చేయమని రాసేయాలి.

గది చేరాడు రాజు.

నాన్న రాసిన ఉత్తరం మళ్లీ చదివాడు. చెల్లెలు ఇందిర పెళ్లి విషయమే ఆరు పేజీలు రాశారు నాన్న. ఆయన అనేదేవిటంటే—'...... అతడి శాఖ వేరే అయినప్పటికీ అది మంచి సంబంధం. తెలిసినవాడు గనక కట్నం ఇవ్వక్కర్లేదు. ఈ సంబంధం గనక జారిపోతే ఇందిరకు ఇప్పట్లో పెళ్లి కాదు. కనక సాయిబాబుతో మాట్లాడి నాకు వీలయినంత త్వరగా సమాధానం రాయి—'

''ఉహూ!'' అనుకున్నాడు రాజు. తాను చెబితే సాయి కాదనడు. అదీకాక ఇందిర బంగారు బొమ్మలా ఉంటుంది.

తమ మైత్రి ఆధారంగా సాయిచేత — బహుశా అతని కిష్టంలేని పని చేయించడం దారుణం ..... సాయంతట సాయే, పెళ్లి చేసుకోవాలనుకుని, ఇందిర ఎవరో తెలియకుండా చూసి ఇష్టపడితే సరేకాని—తానుగా వెళ్లి సాయిని అడగడం జరగదు. ఇది అభిమానమా అని ప్రశ్నించుకున్నాడు రాజు. కాదు. సాయీ తనూ ఒక్కరే. తమ యిద్దరి మనసూ ఒక్కటే. తమ యిద్దరి మధ్య అభిమానం లేదు. రహస్యం లేదు. అందుకనే తను చూస్తూ చూస్తూ నాన్న రాసినట్టు చెయ్యలేడు. ఆ కడపలో గనక నాన్నా, అమ్మా, ఇందిరా తాను పంపించే వందతో నెట్టుకొస్తున్నారు. రిటైరయిన పంతులకు పెద్ద ఆదాయం ఏం వస్తుంది గనక—నాన్న కట్నం ఇవ్వడం కష్టం. మరయితే ఇందిరకు పెళ్లి కాదేమో .... ఏదో ఆదర్శం పేరిట తను స్వార్థమే ఆలోచించి చెల్లెలికి సాయం చెయ్యవలసిన అవకాశం వచ్చినప్పుడు తన కర్తవ్య నిర్వహణకు వెనుదీస్తున్నాడా ?—ఆదర్శం చాలా పెద్ద పదం .... అదేమిటో మరి, తనంతట తానుగా ఈ విషయంలో సాయిని ఏవిధంగానూ ప్రోత్సహించలేదు. అలా గనక చేస్తే—

ఎక్కడో ఏదో లోపం జరిగినట్లుంటుంది. ఏదో ద్రోహం చేసినట్లనిపిస్తుంది. సాయికి తనకూ మధ్య ఉన్న కనపడని విలువలలో ఒకదానిని నేలమీద పడేసి దానిమీద నడిచిపోయినట్లుంటుంది .... ఇదంతా నాన్నకు ఎలా రాయడం—

చాలాసేపు వరకు రాజుకు నిద్ర రాలేదు.

ఆ రాత్రే గుంటూరులో సాయి హెడ్‌క్లర్క్ కలలో ఒక రాజీనామా పత్రం రెపరెపలాడింది. దానికింద సంతకం ఎవరిదో సరిగా తెలియక ఆయన మథనపడ్డాడు.

# 8

రెండు రోజుల తర్వాత రవూఫ్ రూపాయి యివ్వకుండానే సాయి మదరాసు చేరాడు. అంతకుముందోవారంనాడే మహాలక్ష్మి గుంటూరు విడిచిన విషయం సాయికి తెలిస్తే ఆశ్చర్యపడేవాడు కాడేమో ....

పొద్దున ఎనిమిదింటికి రైలు దిగిన దాదిగా ఒక్కక్షణం విడిపోకుండా గడిపారు రాజూ సాయీ.

ఆ సాయంత్రం సముద్రం హోరుమని పొంగింది. పొంగి వాళ్లిద్దరినీ పలకరించి వెళ్లింది.

ఇలా బీచిరోడ్ వెంబడి కూడా పెద్ద పెద్ద భవనాలు కట్టేసి, నాగరికతను ఇక్కడికూ్కడా లాక్కురావడం ఏమంత బాగాలేదని చెప్పాడు సాయి. ఈలోపుగా రాజు సిగరెట్టు వెలిగించాడు. కేన్సర్ వైరస్‌మీద తానీటీవల చదివిన వ్యాసం గురించి సాయి చెబుతుండగా ఎవరో ఒకావిడ రెండేళ్ల పాపాయిని నడిపించుకుంటూ అటుప్రక్కగా వెళ్లింది. హఠాత్తుగా ఆమె నల్లచీర చూసి రాజు గుండె లిప్తమాత్రం ఆగింది.

అబ్బే, ఆమె కాదు—

మూడు రోజుల క్రింద తను సాయి ఉత్తరాలన్నీ తెచ్చుకుని ఇక్కడ కూచుని చదువుకున్నానన్నాడు రాజు. "చదువుకుంటూ మధ్య ఉలిక్కిపడ్డాను. లక్ష్మణుడు ముక్కు కోయగానే శూర్పణఖ అరిచిన అరుపు వినబడింది. తీరా చూస్తే ఎవరో అమ్మాయి, చాల మామూలుగా ఉంది .... ఆవిడగారు బఠాణీల కోసం అంత లలితంగా కేకేశారన్నమాట..."

రాజుతోబాటు నవ్వి సాయి చెప్పాడు .... "ఇంకా నయం .... ఏ రేసుకోర్సుకో, క్రికెట్ మేచీకో వెళ్లి చూడు .... అంతవరకూ చాలా నార్మల్‌గా ఉన్న అమ్మాయిలు ..... బాట్స్‌మెన్ బౌండరీ కొట్టేసరికి ఆరడుగుల ఎత్తు ఎగిరి, కెవ్వుమని గీ పెడతారు..... "

"కానీ దేవుడి దయవల్ల అందరు ఆడవాళ్లు అట్లా అయిపోలేదు—" అని రాజు ఆరోజు తన చేతిలో ఉత్తరం ఎగిరిపోతే ఒక నల్లచీరమ్మాయి ఎలా అందిచ్చిందీ చెప్పాడు.

"అలా పోతాయనే నీ ఉత్తరాలన్నిటినీ ఒక ఫైల్లో గుచ్చుతున్నాను" అన్నాడు సాయి.

రాజుకు నాన్న ఉత్తరం గుర్తుకొచ్చింది. ఒక్కమాటంటే చాలు......'వీల్లేదు' అనుకున్నాడు.

రాత్రి తొమ్మిదింటికి, వెన్నెల వారి దారిన చల్లిన మల్లెల మీదుగా నడిచి గది చేరారు. రాజు ఆపూట హోటలు వద్దన్నాడు. బ్రెడ్ కొనుక్కొచ్చుకున్నారు. స్టవ్‌మీద బ్రెడ్ ముక్కలు రోస్ట్ చేసుకున్నారు. అవి తిని, పాలుతాగి మళ్ళీ కబుర్లలో పడ్డారు. రాజు రిపోర్టరుగా మొన్న తానో ప్లానింగ్ కమిటీవద్దకు వెళ్ళినప్పుడు, ఒక ఆఫీసరువారు తన పరిపాలనక్రింద వెయ్యిన్నాట పదహారు హెక్టేకర్ల మేరకు జపాను వరిసాగు చేయిస్తున్నామని చెప్పగా, తను లేచి హెక్టేకర్-అంటే ఏమిటని అడిగినప్పుడు ఆ కమిటీలోవున్న ఇరవైమందీ ఎలా మౌనవ్రతం అవలంబించిందీ వివరించాడు. గుంటూరు రైల్వేస్టేషన్ సమీపంలోని ఓవర్‌బ్రిడ్జిమీద ఇనపవూచలకు పాపాయిల బొమ్మలకు వేసినట్లు నానా రంగులూవేసి, అదో అలంకారమని అనుకున్నవారి కథ చెప్పాడు సాయి.

కథలూ, నవ్వులూ, విమర్శలూ అవుతుండగానే కోడి కూసింది. తెలతెలవారుతుండగా సముద్రాన్ని చూడాలని మిత్రులిద్దరూ లేచారు.

# 9

వి. ఎన్. రావుగారు ఆయన ఆఫీసు గదిలో కూచుని ఓ ఫైలు చూస్తున్నారు.

అందులోవున్న ఉత్తరం ఒక ప్రకటన విషయమై ప్రభుత్వంవారికి ఆయన ఆఫీసు రాసింది. సంతకానికి ఆయన వద్దకు వచ్చింది. ఆ ఉత్తరంలోని చేతివ్రాత అంత పరిచయమయినదిగాలేదు ఆయనకు. ఒక్కక్షణం ఆలోచించారు రావు......ఓహో—ఆ రాజశేఖరం సిఫారసు చేసిన కుర్రాడు రాసినట్లుంది. ఇతడి ఇంగ్లీషు బాగుంది—అనుకున్నా రాయన.

ఆ ఇంగ్లీషు బాగున్న అబ్బాయి రావుగారి ఆఫీసులో మొదటిజీతం పుచ్చుకుని రెండు రోజులయింది. ఆనెల రోజుల లోనే ఇతడు మిగతా పద్దెనిమిదిమంది గుమాస్తాల్లాటివాడు కాడని పసికట్టింది జయంతి.

# 10

ఇంకో రెండు వారాలతర్వాత ఒకరోజు మధ్యాహ్నం టిఫిన్ వేళఅయింది. కొందరు హోటళ్ళకువెళ్ళగా కొందరక్కడేవుండి,

తెచ్చుకున్న పొట్లాలు విప్పసాగారు. టిఫిన్‌రూము వెనకవైపు వరండాలో కుడి చివరనుంది. దాని కెదురుగా అవతలికొనను క్లబ్ రూమువుంది. సాయి బయటికివెళ్ళి, టిఫిన్ ముగించు కునివచ్చాడు. క్లబ్ రూములో అయిదారుగురు గుమాస్తాలు కూచుని కబుర్లాడుతున్నారు. సాయి లోపలికివెళ్ళాడు. ఉన్న నాలుగు పత్రికలూ, నలుగురు చేతులలో ఉన్నాయి. వాళ్లేమో చేతులలో వాటి నుంచుకుని, మాట్లాడుకుంటున్నారు. సాయి ఐదు నిముషాలు చూశాడు. పరిస్థితిలో మార్పేమీ రాలేదు. ఈ లోపుగా జయంతివచ్చి ఆ గది గుమ్మం ముందర నిల్చుంది. ఆమెను గమనించి కూడా గమనించనట్లు ఊరుకున్నారు ఆ పురుష పుంగవులు.

"మిష్టర్! ఆ పత్రిక నిలా ఇస్తారా?"

ఆ మిస్టర్ సాయివైపు చూశాడు.

"మేం చదువుతున్నాం. కనపడ్డంలేదూ ?"

"మీరు చదవడంలేదు. మాట్లాడుకుంటున్నారు. కనకనే పత్రిక ఇమ్మని అడుగుతున్నాం—" అన్నాడు సాయి.

"ఏం, మేము మాట్లాడుకోవడానికి తమ పర్మిషన్ కావాలా?"

"ఇవతల ఇద్దరు పత్రికలు చూద్దామని నిల్చునివుంటే మీరు వాటినలా పట్టుకుని కూర్చోవడం—"

"ఓహోహోహో—మీ విషయం మీరు మాట్లాడండి చాలు. అవతలివాళ్ళకు కావంసివస్తే, వాళ్లే అడుగుతారు—" అన్నాడు రెండో మిస్టరు. గొల్లుమన్నారు బృందం.

జయంతి అక్కడ నిలవలేదని చూడకనే తెలిసింది సాయికి.

"కలిసి ఉండవలసినవాళ్ళం మనం ఇలా పాదులాడ్డం ఏమీ బాగుండలేదు—" అన్నాడు సాయి.

"అహా! ఏమిమాట, ఏమిమాట!!"

"చేరి నెలకాలేదు, చిన్నయసూరిలా నీతులు చెబు తున్నాడు—"

"ఈయనగా రింకోరికి గార్డియన్ కూడానూ—"

సాయికి ఒళ్ళు మండింది. తమాయించుకుని అక్కడనుండి గబగబా నడిచి తన సీటుకొచ్చాడు. వస్తూ, వస్తూ అటు చూస్తే ఆమె తన వైపు చూసినట్లనిపిస్తే అటు చూడకుండా వచ్చాడు. అరఘంటదాకా సాయి ఏమీ పని చెయ్యలేకపోయాడు. ఛీ, ఈ మనుష్యులు ఎక్కడికి వెళ్ళినా ఇంతేనా......అనిపించింది. కాదు— అని అతడి మనసు ఎదుట నిలిచింది మాటలు తప్పని కృతజ్ఞత. తలెత్తి చూశాడు. ఆమె తలవంచుకుని పని చేస్తోంది.

## 11

ఈమధ్య రాజశేఖరం రిపోర్టరుగానే పని చేస్తున్నాడు. రెండింటికి అసెంబ్లీ రిపోర్టిచ్చేసి, సాయి ఆఫీసు కొచ్చేవాడు. ఇద్దరూ కలిసివెళ్ళి, కాఫీ తాగి వచ్చేవాళ్ళు. వర్షాకాలం అవడం మూలాన్ని టీచి వూనేసి తమ గదిలోనే సాయంకాలాలు గడుపు తుండేవారు.

ఒక మధ్యాహ్నం సాయి పని చేసుకుంటుండగా రాజా వచ్చాడని బంట్రోతు చెప్పాడు. మామూలుగా సాయే వెళ్ళి విజిటర్స్ గదిలోవున్న రాజుని కలుసుకునేవాడు. అవాళ చేతిలో పని అవసరమయింది గనక, రాజునే రమ్మనమని తన ప్రక్కన కుర్చీ వేయించాడు.

ఈలోపుగా సాయి టేబిల్‌మీది ఫైళ్ళలో ఒకటి కావాలని అటొచ్చింది జయంతి.

నల్లటిచీర. నక్షత్రాల్లాంటి కళ్ళు. రాజుని రెండు నెలలు వెనక్కు లాక్కెళ్ళాయి.

ఉత్తరం పారేసుకున్న పెద్ద మనిషి కాటోలు—జయంతి పెదవులమీదకు రాలేదు చిరునవ్వు. వచ్చినపని మరచి వెనక్కెళ్ళి పోయింది ఆవిడ.

తదేక దీక్షతో—వి. ఎన్. రావుగారు మెచ్చుకునే ఉత్తరం మరొక్కటి రాసి పారేసి తలెత్తాడు సాయి.

## 12

ఇంకో రోజు—

కొన్ని అతి ముఖ్యమయిన ఉత్తరాలకు జవాబులు రాయా లని సాయి చాల త్వరగా ఆఫీసు కొచ్చాడు. గంట తొమ్మి దయిఉంటుందేమో! ఇంకా ఎవ్వరూ రాలేదు. వాచ్‌మన్‌ని కేకేసి టేబిల్ తుడిపించి, పనిలో కూచున్నాడు సాయి. ఒక ఉత్తరం ముగించాడో, లేదో జయంతి రిక్షా దిగి, లోపలికి వచ్చింది. ఆమె మొహం చూస్తే స్నానం చేసినట్లు కనపడలేదు. ఆమె తిన్నగా అతడి దగ్గరకు వచ్చింది. ఆమె పెదవులు వణకుతున్నాయి. ఆమె అంది—

"మా నాన్నకు పొద్దుట్నేనుంచీ చాలా సీరియస్‌గావుంది. డాక్టర్‌కోసంవెళ్తుంటే దారిలో ఆఫీసులో ఎవరన్నావుంటే సెలవు పెడుతున్నానని చెబుదామని వచ్చాను."

"ఇంట్లో నాన్నగారిదగ్గర ఎవరున్నారు?" అని అడి గాడు సాయి.

"చెల్లాయి రాణివుంది. అది ఒకటే ఏడుపు—"

"మీ ఇంటి అడ్రసు నా కివ్వండి......మీరు తిన్నగా ఇంటికి వెళ్ళి నాన్నగారిని చూచుకోండి......పది నిముషాలలో నేను డాక్టరు గారితో వస్తాను" అని సాయి, అడ్రసు తీసుకుని, టాక్సీమీద.

అరమైలు దూరానవున్న తమ గదికి డబ్బుకోసం వెళ్ళాడు. అవూట 'అఫ్' అవడం మూలాన్న తిరిగ్గా కూర్చుని సిగరెట్లు కాల్చు కుంటున్నాడు రాజు. సంగతివిని గాభరాగా బట్టలు తొడుక్కుని ఇద్దరూ కలిసి, వెళ్ళి డాక్టర్ మూర్తిని తీసుకుని జయంతి వాళ్ళ ఇల్లు చేరారు.

తండ్రిని డాక్టర్ పరీక్ష చేసినంతసేపూ జయంతి చావు బతుకులమధ్య ఊగిసలాడింది. ఛ.......తానే గనక డాక్టరయి వుంటే ఏమయినాచేసి, ఆ అమ్మాయి తండ్రిని కాపాడుదునే అనుకున్నాడు రాజు. సాయి మూర్తి ప్రతికదలికనూ వెయ్యికళ్ళతో చూశాడు.

డాక్టర్ చెప్పాడు. "త్రాగుడు ఎక్కువయి, అది విషంగా పరిణమించింది. గుండె పూర్తిగా దెబ్బతింది. ఇప్పుడో ఇంజక్ష నిస్తాను. ఇంకోటి సాయంకాలం. అలాగే రేపు రెండు. ఎల్లుండి క్కాని ఏమీ చెప్పలేను."

జయంతి లోపలి గదిలోకి పోయింది. డాక్టరుకు డబ్బు ల్చిచ్చి టాక్సీలో పంపాడు రాజు. రాణిని దగ్గరకు తీసుకుని ఓదా ర్చాడు సాయి.

అరఘంటతర్వాత హొటలునుండి కేరియర్‌తో అన్నం తెప్పించాడు రాజు. జయంతి వద్దంటే కోప్పడ్డాడు. రాణికి దగ్గరుండి అన్నం పెట్టాడు సాయి.

సాయంకాలం డాక్టర్ మూర్తివచ్చి రెండో ఇంజక్ష నిచ్చాడు. రోగి పరిస్థితి పొద్దుటికన్న మెరుగేకాని, ఇంకా సందేహమే నన్నాడు.

## 13

ఇది జరిగిన పదిరోజుల తర్వాత—

ఒక మధ్యాహ్నం ఆఫీసులో కూచుని పని చేసుకుంటూ౦ డగా సాయికో కవరొచ్చింది. చింపిచూశాడు. అతడి గుండె భగ్గుమన్నది.

సాయి జయంతుల ప్రణయకలాపమంతా తనకు తెలుసునని, ఒకరోజు పొద్దున్నే ఆఫీసు దగ్గరకొచ్చి, కలిసి, సెలవు పెట్టి మహాబలిపురం వెళ్ళినకథ చాల రమణీయమైనదనీ రాసిన ఆ లేఖకుడు, పిల్లి కళ్ళు మూసుకుని పాలుతాగిన కథతో ముగిం చాడు.

సాయిబాబులోని ప్రతీ అణువూ వళ్ళు కొరికింది. అత డిలో పదివేల పిడుగులు పడ్డంత చప్పుడయింది. వెలుతురు, చీకటినమ్మెటిలై పొడిచింది. తలెత్తిచూచాడు. పంకాలు ప్రశాం తంగా తిరుగుతున్నాయి. వాటిక్రింద గుమాస్తాలు— కాదు రాక్షసులు ఏవో ఉత్తరాలు రాసుకుంటున్నారు. ఇంకా ఎందరి గుండెల చిచ్చుట పెట్టడానికో—సాయి అక్కడ కూర్చోలేక పోయాడు. తిన్నగా లేచి నడుచుకుంటూ సముద్రతీరం చేరు కున్నాడు. దాదాపు నాలుగు మైళ్ళు నడిచినట్లు అతడికి తెలియదు. అలల హొరు అతడిని కొంత శాంతపరిచింది. కుర్రవాళ్లెవరో బట్టలతోనే స్నానాలు చేస్తున్నారు. నీళ్ళు చల్లుకుంటూ కేరిం తలు కొడుతున్నారు. సాయి వాళ్ళను చూస్తూ నిల్చున్నాడు. దూరాన, ఆకాశమూ అర్ణవమూ చేతులు కలిపిన నీలిరంగు అంచుమీద, వికారంగా నల్లగీత కనబడితే, ఉలిక్కిపడి చూశాడు. పెద్ద పొగ ఓడ ఒకటి హార్బర్‌లోకి వస్తూంది.

అప్పుడింకా మూడవలేదు.

ఉన్నట్లుండి ఆకాశం మబ్బుల దుప్పటి కప్పుకుంది. భోరుమని వర్షం మొదలయింది. బరువుగా నెత్తిమీద వర్షం పడుతుంటే జోలపాటలావుంది అతడి మెదడుకు. కొంతదూరం అలాగే నడవగా, ఒక రిక్షావాడు ఎదురయి, రిక్షా కావాలా అని అడిగితే అడ్రసు చెప్పి ఎక్కి కూర్చున్నాడు. గది చేరుకున్నాడు. బట్టలు మార్చుకున్నాడు. వి. ఎన్. రావుగారి పేరిట, ఆయన ఆర్టో మెచ్చుకోని ఉత్తరం ఒకటి రాశాడు.

అయిదింటికి రాజు వచ్చాడు. ఒక మూల పడేసివున్న తడిబట్టల్ని చూశాడు. సాయిని చూశాడు. అతడితల తడిగా ఉండడం గమనించాడు. తువ్వాలు తెచ్చి అతడి తల తుడిచాడు.

రాజు ఏమీ అడగలేదు. సాయే అన్నాడు: "ఆఫీసు నుండి వచ్చేశాను. దారిలో తడిశాను—". అని పడుకున్నాడు. రాజు ఒక ముఖ్యమయిన మీటింగ్‌వుంటే రిపోర్టింగ్‌కని వెళ్ళిపోయాడు.

దారిలో భోజనం ముగించుకుని, రాత్రి తొమ్మిదింటికి గదికి వచ్చాడు. సాయి అలాగే పడుకునివుంటే లేపి బలవంతాన లాక్కువెళ్ళి ఇంత అన్నం తిన్పించాడు.

మరునటిరోజు పొద్దున కాఫీ తాగుతుండగా సాయి నవ్వాడు. "రాజూ! నిన్నటి విషయమంతా నీకు తర్వాత చెబుతా నులే"—అన్నాడు.

రాజు నవ్వాడు. నవ్వి, అవీ, ఇవీ మాట్లాడి, "జయంతి వాళ్ళనాన్నకు పూర్తిగా నయమయినట్లేనోయ్.....నిన్న మధ్యాహ్నం వాళ్ళింటికి వెళ్ళివచ్చాను. ఇకమీదట ఆయన ఏమీ త్రాగనని డాక్టర్ మూర్తికి వాగ్దానం ఇచ్చాడు......బిల్లును నాకు పంపమని మూర్తితో చెప్పివచ్చాను—"

కాఫీ తాగుతున్నవాడల్లా ఆగి, రాజు మొహం చూశాడు సాయి.

రాజులో నిండు సముద్రంలా ఏదో ఉత్సాహం తొణికిస లాడుతూంది.

''అవును సాయీ.... బిల్లునాకే పంపమన్నాను''. అని సాయికళ్లలోకిచూస్తూ— ''సాయీ! నేను జయంతిని భార్యగా స్వీకరించనిశ్చయించాను..... నీ సాయంకావాలి'' అన్నాడు రాజా.

అరగ్లాసుకాఫీనీ ఒక్కసారిగాతాగి గ్లాసుని క్రింద పెట్టాడు సాయి. ''రాజా! నువ్వొక్క ఇంటివాడి వవుతావంటే నే నేమయినా చెయ్యగలను.... చెప్పు—''

సాయిచేతులను తనచేతుల్లోకి తీసుకున్నరాజా కనుల కొనల నీరునిండింది.

## 14

ఆఫీసులో వి. ఎన్. రావుగారు యథాప్రకారం తమ గదిలోకూచుని పనిచూచుకుంటున్నారు. తమసంతకానికని వుంచిన ఒకఇంగ్లీషుఉత్తరం చదివారు. దానిలోఒకేవాక్యంలో 'చిల్డ్రన్స్' అనీ, 'కేచ్‌డ్' అనీవున్నాయి. ఆయనకు విపరీత మయిన చిరాకొచ్చింది.

''ఛీ! ఛీ! ఛీ! ఇలాటి యంత్రబ్రహ్మలందరూ తిష్ట వేసుక్కూచుంటారు. చక్కగా ఇంగ్లీషురాసే సాయిబాబులాటి వాళ్లేమో రాజీనామాపారేసి పోతారు. ఆ అమ్మాయికూడా బాగానేరాసేది. వాళ్ళనాన్నకు జబ్బని నెలరోజులు సెలవు పెట్టింది.... ఇంకనాకు మిగిలింది ఈ పుంభావ సరస్వతులు..... ఏం ఖర్మరా దేవుడా!'' అనుకుని ఆ లేఖారాజాన్ని రాసిన సరస్వతిని కేకేశారు రావుగారు.

## 15

''నాలుగురోజులలో రాజా గృహస్థు అవుతున్నాడు. ఎంతో సంతోషకరమయిన వార్త. ఈ సందర్భంలో నేనువెళ్ళి జయంతి నాన్నతోమాట్లాడి ఆయన్ను ఈపెళ్ళికి ఒప్పించగలిగాను. కులంకాని కులమని ఆయనఎంత పట్టుపట్టాడనీ! .... నారాజా.. హు! ఇకనుండి అతడిని అలా పిలవగల్గిన హక్కుఅతడిజీవిత భాగస్వామినిది అవుతుంది. ఆమాటఅనుకుంటే ఎందుకోఏడుపు వస్తూంది.... కాని ఒకయువకుడు పెళ్ళిచేసుకోవడంఅన్నది చాలాసాధారణమయిన విషయం. మామూలుగా అతడిమిత్రు లందరూ సంతసించవలసిన విషయం. మరి నే నెందుకిలా క్రుంగి పోతున్నాను? రాజు మారిపోతాడనా? మారడు.... అతడు అప రంజి. ఆమె అమృతమూర్తి. వాళ్ళిద్దరి జీవితాలూ పారిజాతమై పరిమళించాలి; వెన్నెటిజల్లై చల్లగా సాగాలి. ఇది కోరుతున్న నాహృదయంలో చీకటిరేఖలాటి అసూయఎవరిమీద.... నెల క్రింద అతడిజీవితంలోకి ప్రవేశించిన ఒకయువతి రాజుని చేసుకుంటూందనా? భగవాన్.... మమ్మల్నిద్దరినీ ఎందుకు కలిపావు.... అంతఎత్తులకు వెళ్ళిందల్లా ఇలా భూమ్మీదకు రాలడానికేనా— .... ఏవిటిది .... పిల్లవాడిలా''— అనిరాసు కున్నాడు డైరీలో

ఆదే డైరీలో ఇంకోఅయిదురోజుల తర్వాతపేజీ—

''నిన్న రాజా జయంతుల జీవితాలు ఒక్కటయ్యాయి. క్షణం తీరికలేదు. డైరీ కూడా రాయలేకపోయాను....మహూర్తం అయింతర్వాత రాజాని పక్కగా గదిలోకి పిలిచి, నా చిన్న బహూమతి టేబిల్ ఫాన్‌ని చూపించి స్వీకరించమన్నాను. అతడు నన్ను కౌగ లించుకున్నాడు......నా కళ్ళు తుడిచాడు. రాజా ఎప్పటి రాజే! మారిపోడు......రాత్రి భోజనాలవద్ద నేను వడ్డన తీసుకున్నాను. రాజా కొక్కటీ, జయంతి కొక్కటీ లడ్డూలు వేశాను. ''అన్న య్యా! ఇదేం అన్యాయం! ఆయనకు ఇంకో నాలుగు వేయం చు—'' అంది జయంతి. ఆమె అనురాగం హిమాలయంలా వుంది.

ఇంకొక్క రెండు నెలల తర్వాత

—''కొత్త ఉద్యోగం బాగానే ఉంటూంది. రాజా వేరే కాపురం పెట్టిం దగ్గర్నుండీ గది బావురుమంటూంది.....వేరే గదిలోకి మారిపోతే—?రాజువచ్చి వాళ్ళింటో ఉండమంటాడు. ఎలా ఉండను?......కొన్నాళ్ళు ఎటయినా తిరిగివస్తే బాగుం డును—''

—అటుపిమ్మట నలభై రెండవ పేజీ.

''డైరీరాసి పదిరోజులయింది. ఎందుకో అర్థంకాని బద్ధకం వచ్చేస్తూంది......ఈ సోమరితనం మనసుదా, శరీరందా? ఏమో మరి—''డాక్టరు దగ్గరకు వెళదాం రమ్మంటాడు'' రాజా. ''మా ఇంట్లో ఉండండి అన్నయ్యా'' అంటుంది జయంతి. ఎంత మంచితనం......! అయినా నిన్న రాజా అలా ఎందుకు చేశాడు? సాయంకాలం ఆరింటికి హైకోర్టుదగ్గర కలుసు కుందామన్నాడు రాజా. అయిదూ నలభైకి నేను అక్కడ ఉన్నాను. తానూ ఆరూ పది కొచ్చాడు. చాలారోజులతర్వాత ఇద్దరమూ కలిసి బీచికి వెళ్దామని మనసెంతో ఆహ్లాదంగావుంది. ఇద్దరం 'అన్నపూర్ణ' లోకి వెళ్ళాం. టీ తాగుతుంటే రాజా చెప్పాడు. జయంతి చక్కటి టీ తయారు చేస్తుందట. బయటికివచ్చి, బీచివైపు తిరిగిన నన్ను చెయ్యి పట్టి ఆపాడు రాజా. ''సాయీ! నన్ను క్షమించు— ఆఫీసుకు జయంతి ఫోన్ చేసింది. తిన్నగా ఇంటికి రమ్మంది. నీతో చెప్పానుకదా అని ఇలా వచ్చాను. మనం బీచికి ఇంకోరోజు వెళదాం. అర్థం చేసుకుంటావుకదూ—'' అన్నాడు.

''అలాగేనోయ్—'' అని నేనన్న అయిదో నిముషానికి రాజాని తీసుకుని వెళ్ళిపోయిం దొక రిక్షా......రాత్రెల్లా నిద్రలేదు...... రాజా! ఎలాచెప్పను........ఏమని చెప్పను......''

—మళ్ళీ ఎనిమిదిరోజుల్ల తర్వాత ఆదివారంనాడు డైరీ తీసుకున్నాడు సాయి.

''పొద్దున్న రాజా వాళ్ళింటికి భోజనానికి వెళ్ళాను. వా ళ్ళాఫీసు టైపిస్టు మాలతిట. ఆమే, ఆమె భర్త శ్రీనివాసూ వచ్చారు. అందరం కలిసి భోజనం చేశాం. అదేదో పాలపిండి మిరియంట. జయంతి చేసింది. చాలా రుచిగావుంది. సరదా గానే గడిచింది. అయినా, వాళ్ళు నలుగురిలోకి ఒక్కోసారి కలిసి పోలేక పోయానేమో అన్పించింది. తీరా భోజనా లయాక శ్రీనివాస్ సిగరెట్టు వెల్గిస్తూ, రాజా చేతికి పేకెట్ నిచ్చాడు. ''వద్దండీ, నేను కాల్చడం మానేసి రెండు వారాలయింది'' అన్నాడు

రాజు ఎంతో తాపీగా. నేను ఓడినచోట—నాలుగు నెలల్లో—విజయం సాధించిందన్నమాట జయంతి! ఎలాగయితేనేం రాజుని సిగరెట్ల పీడ వదిలింది—అదే పదివేలు".

మళ్ళీ సోమవారం రోజు—

"......ఈ తలనొప్పి ఉండుండి వచ్చేస్తూంది. కొన్ని గంటలసేపు ప్రాణాలు తోడేస్తూంది. డాక్టర్ ఎక్స్‌రే కూడా తీసిచూశాడు......ఏమీ లేదంటాడు......అమ్మకు నన్ను చూడా లని ఉందిట......పాపం అమ్మ......ఏదో నెల కింత పంపడం మినహా ఆమెకు నేనేం చేశాను......"ఎన్నో నాళ్ళుండను......ఇక్కడికి రా" అని రాసింది అమ్మ—నెల్లూరు వెళ్ళాలి".

## 16

"జయా! సాయి వాళ్ళమ్మ మొన్న గురువారంనాడు పోయిందట. సాయి రాశాడు. తాను వెళ్ళేసరికే చాలా నీరసంగా ఉందట. ఒక్కరోజు జ్వరం వచ్చిందిట. మర్రోజు పొద్దున లేచి అదీ, ఇదీ మాట్లాడి పడుకుందిట. మళ్ళీ లేవలేదట."

"ఎంత కష్టమండీ అన్నయ్యకూ......అసలే ఈమధ్య ఏవిటోగా అయిపోయాడూ......"

"నిజం జయా! సాయి మనుషటిలా లేడు. ఈసారి సాయి వస్తే, బలవంతానైనా మనింటో ఉంచుకోవాలి......"

"నిజమేనండీ—ఆయన ఆరోగ్యం బాగుపడగానే చక్కటి అమ్మాయిని చూసి పెళ్ళిచేయాలి—"

"తమ రా పెళ్ళిలో పెత్తందార్లై వెలిగిపోతారన్న మాట—".

జయంతి నవ్వింది.

"మరి జయా! ఈ లోపుగా మన అమ్మడు కూడా వచ్చేస్తే, అమ్మా, కూతురూ కలిసి బోలెడు సందడి చేస్తారన్నమాట"—

—వారం గడిచింది. పదివారాలు గడిచాయి. సాయి రాలేదు. అతడినుండి ఉత్తరమూ రాలేదు.

ఏవిటి......ఏమి జరిగింది......వారానికి రెం డుత్తరాలు రాసేవా డివే ఎందుకు రాయలేదు.....ఆరోగ్యం బాగుండలేదా.....రాజు ఉండలేకపోయాడు.

ఒకవారం సెలవుపెట్టి నెల్లూరువెళ్ళి వాకబు చేశాడు. వాళ్ళమ్మ పోయినతర్వాత మూడు వారాలు నెల్లూర్లోవున్నాడట సాయి—తర్వాత, ఉన్న చిన్న ఇంటిని అమ్మేసి వెళ్ళాట్ట......రాజు కంతా అయోమయంగావుంది. అక్కడనుండి గుంటూరు వెళ్ళాడు. మదరాను వెళ్ళింతర్వాత ఆయన్ను చూడలేదని చెప్పాడు ఒకతను. అతనిపేరు రవూఫ్‌ట. సాయి ఎక్కడికి వెళ్ళాడు. ఏం చేస్తున్నాడు—రాజు గుంటూరునుండి విజయవాడకు వెళ్ళాడు.

అక్కడ వి. ఎన్. రావు కంపెనీ ఏజెంటు సుంద్రరావని ఒకాయన కన్పించాడు. "......సాయిబాబంటే—సన్నగా పొడుగ్గా కాస్త నెరిసిన జుత్తుతో ఉండేవాడు. ఆయనేనా—మా కంపెనీలో కొంతకాలం పనిచేశాడు కదండీ......అయితే చూశాను—"

"ఎక్కడ? ఎక్కడ?"

"హిహి......నే నీ మధ్య కొన్ని పెళ్ళి పరీక్షలకు వెళ్ళి వస్తున్నానులెండి—పోయిన్నెల గుంటూరు వెళ్ళాను. తిరిగి వస్తుంటే మంగళగిరి స్టేషనులో సాయిబాబులాటి ఆయన బండిదిగి పోతున్నాడు. ఎక్కడో చూచినట్లుందే అని గుర్తుకు తెచ్చుకుని, పిలవబోయేసరికి బండీ కదిలింది. అయినా వెళ్ళిపోయాడు."

"ఓ" రాజు మనసులోని ఆశ మునిగింది.

"అన్నట్టు మీరు మంగళగిరి వెడతారేమోకదూ—నేనూ మీతో బాటే వస్తా. నేను కడప దాకా వెళ్తున్నా......కడపలో చంద్రశేఖరంగారని ఒక రిటైర్డ్ టీచరున్నారు. వాళ్ళ అమ్మాయిని చూడ్డానికి—"

"చంద్రశేఖరమా? మీరు చూడబోయే అమ్మాయి పేరు ఇందిరేనా?"

"ఆ! మీకు తెలుసేవిటి వాళ్ళు—"

"అవును"......ఇతడు జీవితంలో భాగస్వామినిని వెదుక్కుంటూ తన చెల్లెల్ని చూడడానికి వెళ్తున్నాడు. తనేమో తన ప్రాణాన్ని వెతుక్కుంటూ తిరుగుతున్నాడు. జీవితం ఏదో పెద్ద దాగుడుమూతలాటలా అన్పించింది రాజుకు. మంగళగిరి కూడా నెల్లూరులాగే, గుంటూరులాగే జవాబు చెప్పింది. పిచ్చెత్తినట్లయింది.

సాయీ—ఎందుకు నాకీ శిక్ష—ఎప్పుడొస్తావు నా దగ్గరకు......ఎక్కడున్నావు......పొద్దు పొడిస్తే ఒకరి నొకరు చూడకుండా ఉండలేమే—ఇన్ని నెలలు ఎలా ఉండగలిగావు? ఆఖరికి ఉత్తరమన్నా లేదే. ఎందుకు? ఎందుకు?

చిక్కి సగమై ఇల్లు చేరాడు రాజు. రోజొక్కయుగంగా మూడు నెలలు గడిచాయి......జయంతిని చూచుకుని ఎంతో సంబాళించుకుని ఉండ ప్రయత్నించాడు రాజు. అయినా అతడిలోని నీడ ఆమెకు తెలియకపోలేదు.

సాయి గదికి అద్దె కడుతూన్నాడు రాజు.

## 17

రాజు ఆఫీసుకు వెళ్తూ వస్తూ ఉన్నాడు. ఒక సాయంకాలం అతడింటికి వచ్చేసరికి జయంతి వంటగదిలోవుంది. ఏదో పాడుకుంటూఉంది......పడక కుర్చీలో కూలబడ్డాడు రాజు. అప్రయత్నంగా అతడి కళ్ళు కేలెండరుమీద పడ్డాయి. ఇవాళ్టికి ఆరునెల లయి తొమ్మిది రోజులయింది. ఇంకా ఎన్ని రోజులు సాయి తనకు దూరంగా ఉంటాడు??

'గడియ యేనియు ఇక విడిచిపోకుమా—

ఎగసిన హృదయము పగుల నీకుమా—' జయంతి సన్నగా పాడుకూంటూంది. రాజు కళ్ళు మూసుకున్నాడు. సాయి, 'తను అడగ్గా, ఆ సముద్రతీరాన ఎన్ని వందల

సార్లు పాడాడా గొప్పపాటను—ఆ పాట చివర 'ఎన్నినాళ్ళకీ బ్రతుకు పండెను—ఎంత హాయి ఈ రేయి నిండెనో—' అన్న పంక్తులు పాడేటప్పుడు సాయి కళ్ళు మూసుకునేవాడు!

అటొచ్చిన జయంతి రాజుని చూసి—ఆశ్చర్యపోయింది. అలికిడివిని కండ్లు తెరిచాడు రాజు......మాట్లాడకుండా ఆమె ఒక ఉత్తరంతెచ్చి ఇచ్చింది.......అది వి. ఎన్. రావుగారు రాసిన ఉత్తరం. తను ఆఫీసులో కొన్ని ఖాళీలు ఏర్పడ్డాయనీ, సాయి బాబు ఇష్టపడితే అతడిని వాటిలో ఒకదానికి తీసుకోటం వీలనీ రాశారు ఆయన.

నిట్టూర్చాడు రాజు. జయంతి ఇచ్చిన కాఫీ తాగాడు. ''అన్నయ్య వస్తారండీ'' అంది ఆమె......రాజు నవ్వాడు. జయంతి రాజు సంతోషానికోసం తాను చేయగలిగిందల్లా చేస్తూంది. అయినా, అతడి ఆవేదన తీర్చడం తన చెయ్యిలేని పని అని ఆమెకు తెలియక కాదు. తా నొక తల్లియైననాడు రాజు పాపనుచూసి కొంత బాధ మరిచి పోగలడని ఆశించింది ఆమె. ఏనాటికయినా నా అన్నయ్య వెనక్కొస్తాడని......అన్నయ్య, ఆయన పాపాయీ ఆడుకుంటుంటే తను చూడగలనన్న నమ్మకాన్ని వెలిగించుకుంది జయంతి.

—ఆరోజు పొద్దున్నే రాజు లేచి ఇవాల్టికి ఆరున్నరనెలలు అయిపోతుంది అనుకున్నాడు.

## 18

ఆదేరోజు రాత్రి కడపలో ఇందిరఅన్న అమ్మాయి పడుకుని నిద్రరాక ఇటూ అటూ పొర్లుతూంది. అవతలిగదిలో వాళ్ళమ్మా, నాన్నా పెళ్ళి సంబంధాల గురించి మాట్లాడు కుంటున్నారు.

'ఏమిటో......అమ్మా నాన్నలకు బరువుగా ఎంతకాలం ఇలా ఉండడమో— ఎవరో ఒకాయన వారం ముందు విజయ వాడనుండి వచ్చి వెళ్ళారు. సుందర్రావుట.......అంతా అయి పోయిందనుకున్నారు......తీరా చూస్తే వాళ్ళ కుటుంబంలో చాలమందికి క్షయట......ఏదో ఒకటి చెప్పంటూ అయి, నేను వెళ్ళిపోతే అమ్మా, నాన్నా హాయిగా రాజన్నయ్య దగ్గరవుండి పోతారు. అసలు అందరినీ వచ్చెయ్యమని జయంతి వదిన చాలసార్లు రాసింది. నేనైనా ఓసారి మద్రాసు వెళ్ళాలి...... ఒదినకు బలే వంటలొచ్చుట.......అన్నీ నేర్చేసుకోవాలి......'' అనుకుంటున్న ఇందిర ఆలోచనల కడ్డంగా వాళ్ళ నాన్న స్వరం వినపడింది.

''ఇదిగో......నిన్న ఆ మదనపల్లివాళ్ళకు అమ్మాయి జాతకం పంపానా—వాళ్ళు గనక సరిపోయిందని వ్రాస్తే నేనే మదనపల్లివెళ్ళి, అన్ని వివరాలూ కనుక్కొనివస్తా—ఆ తర్వాత అమ్మాయిని చూడ్డానికి రమ్మంటా......'' అన్నారాయన.

''ఇంకా ఎన్నాళ్ళో ఈ పరీక్షలు''—అంది ఇందిర తల్లి.

''ఏం చేస్తాం......నీ కొడుకు ప్రబుద్ధుడు.......ఆ చక్కటి సంబంధంవుంటే చేతులారా విడిచిపెట్టాడు. పై పెచ్చు ఏదో అర్థంకాని చెత్తంతా రాస్తాడు—''

రాజఅన్నయ్య ఎంతో మంచివాడు—అనుకుంది ఇందిర.

## 19

ఆమె అలా అనుకున్న తర్వాత పదోరోజున రాజు ముందు గదిలో పేపరు చదువుకుంటుండగా, జయంతి పిలిచింది. పరుగెత్తి వెళ్ళాడు. ఆమె రొప్పుతూ, కళ్ళు మూసుకుంటూ, పళ్ళు కొరుకుతూవుంది.

రాజుకేమీ తోచలేదు.....మంచినీళ్ళిమ్మంది జయంతి. ఇచ్చాడు రాజు. లేడీ డాక్టరును పిలుచుకురమ్మంది. ఆపని చేశాడు.

లేడీ డాక్టర్ జయంతిని చూచింది. సాయంకాలం ఆరింటికి రాజు తండ్రి కాగల సూచన లున్నాయనీ, జయంతి ఆరోగ్యం దివ్యంగా ఉందనీ, ఏమీ గాభరా పడనక్కరలేదనీ హామీ ఇచ్చి వెళ్ళింది.

జయంతి పడకమీదే వుంది. హోటలు కేరియర్ తెప్పించాడు రాజు. భోజనం అయింతర్వాత కుర్చీలో కూర్చున్నాడు. పూర్వం అయితే భోజనంకాగానే సిగరెట్టు కావలసివచ్చేది...... ఇప్పుడా బాధలేదు.....హఠాత్తుగా గుండె కెలికినట్లయింది. సాయి ఎన్నిసార్లు చెప్పాడు సిగరెట్లు మానమని.....తను మాన లేదు. కాని, కాని........సాయీ.........

## 20

''పోస్ట్!''

అదిరిపడి వెళ్ళి అందుకున్నాడు రాజు. నాన్న రాశారు. మదనపల్లినుండి వారంకింద కడప వచ్చారట—ఆ సంబంధం కుదరడం ఖాయమట—ఇంకో రెండు నెలలలో ఇందిర పెళ్ళిట.

హమ్మయ్య అనుకున్నాడు రాజు.

కాని, ఆఖరి పేరాకు వచ్చేసరికి అతడి కళ్ళు చెదిరి పోయాయి—ఏమిటది?

మదనపల్లిలో నాన్నవెళ్ళిన ఆ వరుడి ఇంటో— ఏదో మద్రాసు ఊసు వచ్చేసరికి, వాళ్ళన్నారట. మొన్న మొన్నటి దాక వాళ్లెదురింటో లక్ష్మమ్మ అని ఒకావిడ ఉండేదని, వాళ్ళతోబాటు సాయిబాబు అనే అతడుండేవాడని, రెండువారాల క్రిందే లక్ష్మమ్మ చిత్తూరు దగ్గర పల్లెపట్టు అనే గ్రామానికి వెళ్ళిందనీ—అక్కడివాళ్ళు చెప్పినట్టు నాన్న రాశారు!

ఏమిటె ఈ ఘోరం! వాన్న ఇలా వెమ్మదిగా ఉత్తరం రాయడమేమిటి—సాయిపేరు వినగానే తన కాయన ఒక టెలిగ్రాం ఇచ్చివుంటే తానుపోయి తన సాయిదగ్గర మరుక్షణం వాలునే—హాఁ......నాన్న నని ఏం లాభం ...... సాయి ఎక్కడికో వెళ్ళిపోయినట్లు నాన్నకు తాను రాయలేదు. రాసినా వాళ్ళకు అర్థం కాదు.......

ఎలాగయితేనేం సాయి దొరికాడు.....ఇంకొక్షణం వృథా చెయ్యడానికి వీలులేదు.....కావి, కాని, జయంతిని విడిచి ఎలా వెళ్ళడం.........జయంతి నాన్నా, చెల్లెలూ కూడా సమయానికి తగ్గట్టు ఊళ్ళోలేరే—జయంతి తొలి ప్రసవం.....క్షణం ఆల సించకుండా సాయిని కలుసుకోవాలి.....

రాజు నాన్న ఉత్తరాన్ని తీసుకువెళ్ళి జయంతి చేతి కిచ్చాడు. ఆమె చదివింది.

"తక్షణం బయలుదేరి వెళ్ళండి......వెళ్ళి అన్నయ్యను ఇక్కడికి తీసుకొచ్చేయండి......"

"మరి నువ్వో—"

"నాకేమీ ఫరవాలేదని డాక్టర్ చెప్పిందిగా......మన పాపాయీ, అన్నయ్యా ఒక్కసారే వస్తారు కాబోలు. వెళ్ళండి..... ఆయన్ను తీసుకురండి—"

రాజు మాలతిని ఫోన్‌మీద పిలిచాడు. ఆమెనూ, ఆమె భర్తనూ తమ ఇంటికివచ్చి రెండురోజులుండమని పరిస్థితి వివరించాడు.

వెటర్నరీ డైరెక్టరు కార్యాలయం ఫోన్ అరఘంటదాకా ఆ నగరంలో ఇంకెవరికీ లభించలేదు. అంతసేపూ మాలతి ఆమె భర్తతో మాట్లాడిందన్నమాట.

## 21

మూడు గంటలకు ఇల్లు విడిచాడు రాజు. నగరి వెళ్తున్న బస్సెక్కాడు. ముప్పైమైళ్ళువెళ్ళి, ఆ బస్సు ఆగిపోయింది. ఇంజన్ పాడయిందని గంటసేపు రిపేరు చేశాడు డ్రైవరు. 'దేవుడా! మనుషులకు రెక్కలివ్వకపోతివే—' అని తపించింది రాజు హృదయం. ఎట్టకేలకు కండక్టరు ప్రక్కవూరికి నడిచి, అక్కడినుండి ఫోన్‌చెయ్యగా మద్రాసునుండి ఇంకో బస్సు వచ్చింది. సాయంకాలం ఆరింటికి రాజు నగరి చేరాడు. ఆ పూటకు అక్కడి నుండి పల్లెపట్టువెళ్ళే ఆఖరి బస్సు వెళ్ళిపోయిందన్నారు. భూమి కుంగిపోయినట్లయింది రాజుకు. పరిస్థితి వివరించగా ఒక్కో సారి పల్లెపట్టువైపు ఏవయినా లారీలు వెళ్తుంటాయని చెప్పారు ఎవరో. అదృష్టవశాత్తు అలాటి లారీ ఒకటి దొరికింది. దాన్నెక్కాడు రాజు. రాత్రి తొమ్మిది గంటలకు పల్లెపట్టులో అడుగు పెట్టాడు రాజు.

కొత్తచోటు. తన అన్వేషణ ఎక్కడనుండి ప్రారంభించాలో కూడా తెలియలేదు రాజుకు. అలా అలా వాకబు చేసుకుంటూ వచ్చాడు. లక్ష్మమ్మ పేరువిని కొందరు అతడి వైపు ఎగా దిగా చూశారు.

రాత్రి పదిన్నరకు మిషన్ స్కూలు కాంపౌండ్ పక్కన వున్న చిన్న పెంకుటింటి ముందర నిలిచాడు రాజు.

దేవుడా, ఇది సరయినఇల్లు కావాలి అనుకుంటూ తలుపు తట్టాడు.

ఒక నల్లటి స్త్రీ—ముప్పైయేళ్ళుంటాయేమో—తలుపు తీసింది. ఆమె చేతిలోని లాంతరు వెలుతురులో తళుక్కుమంది ఆమె ముక్కుపుడకలోని వజ్రం.

"మీరేనా లక్ష్మమ్మగారూ ?" అని అడిగాడు రాజు—గుండె క్షణానికి లక్షసార్లు కొట్టుకుంటూండగా—

"అవును లోపలికి రండి—" అందావిడ.

ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాడు రాజు.... కళ్ళు తెరిచి గడప దాటాడు.

"కూచోండి ....". రెండేళ్ల కింద చూచిన ఒక ఫోటో గుర్తుకు వస్తూంది ఆమెకు.

"సాయిబాబుని మీ రెరుగుదురా ?"

ఆమె నవ్వింది. "ఎరగకేం .... బాగా ఎరుగుదును .... మహర్షిలాటి మనిషి .... గుంటూరులో ఆయన మా యింటో ఉండేవారు—"

గుంటూరులో ఉండగా ఒక ఉత్తరంలో సాయి పేర్కొన్న మహాలక్ష్మి ఈవిడేనా అనిపించింది రాజుకి.

అడిగితే అవునన్నది ఆవిడ.

"సాయిబాబు ఏడీ—" ఆ ఒక్కొక్క అక్షరంలోనూ అతడి జీవితంలోని ఆశలన్నీ ఘనీభవించినాయి.

హఠాత్తుగా మహాలక్ష్మి మొహం మారింది. ఆమె కిటికీగుండా దూరంగా చూసింది. ద్వాదశి వెన్నెల నిశ్శబ్దంగా కురుస్తూంది. పొలాలు నిండి ఆకుపచ్చదనం అల్లనల్ల నాట్యుతూంది .... ఆమె పెదవులు కదలినట్లున్నాయి.

సాయి మరి లేడు!

రాజు పెద్దగా అరిచాడు.

అవును .... ఆయన లేరు—మెదడులో ఏదో జ్వరంట—అదుగో—ఆ పొలా లవతల మట్టిలో ఆయనను కలిపింది తనే—అంది మహాలక్ష్మి.

కాదు .... ఇదంతా అబద్ధం .... ఎక్కడో పొరబాటు జరిగింది..... సాయి తన్ను విడిచిపోడు .....

మొగుడుని విడిచి వచ్చేసింది తను. మదనపల్లిలో ఉంటూ ఒకసారి తిరుపతి వెళ్లింది. అక్కడ ఒక సత్రపు అరుగుమీద ఆయన కన్పించారు. చాలా జబ్బుగా ఉన్నారు. తనతోబాటు వస్తేకాని కదలనని కూచుంటే వచ్చారు. ఆయనరాక తన బ్రతుకును మార్చివేసింది. అది రెండు నెలల క్రిందట.... డాక్టర్లు ఇంకేమీ లాభం లేదనేసరికి ఏదయినా పల్లెటూరిలోకి—ప్రశాంతతలోకి వెళ్లిపోదా మన్నారు. సరే నన్నది తను. ఇక్కడి కొచ్చిన మూడోరోజు సాయంకాలం ఆ కిటికీ ప్రక్కన కుర్చీలో కూర్చుని ఆ పొలాలను చూస్తూనే ఆ ప్రశాంతతలోకి కలిసిపోయారు. ఆయన ఎందుకలా అయారో తనకు తెలీదు. తా నడగలేదు. ఆయన మాట్లాడేవారుకారు.

నెమ్మదిగా—చాల నెమ్మదిగా రాజాకు తా నింతసేపటి నుంచీ వింటున్న మాటల అర్థం తెలియసాగింది.

అయితే—

అయితే తన సాయిబాబు తనకు కనపడడన్నమాట!

తానేమవాలి ?

భోరుమని పాపాయిలా ఏడిచాడు రాజా.

అతడి కళ్లనీళ్లు తుడిచింది మహాలక్ష్మి.

—తెల్లవారుఝామున, సాయి వదలిపెట్టిన కొన్ని ఉత్తరాలను, ఒకటి రెండు పుస్తకాలనూ తీసుకుని జీవచ్ఛవంలా వెనక్కు బయలుదేరాడు రాజశేఖరం.

మధ్యాహ్నం ఒంటిగంటకు ఇల్లు చేరాడు.

గుమ్మంలో ఎదురయింది మాలతి. కడపకు టెలిగ్రాం ఇప్పించా నన్నది.

జయంతి ఉన్న గదిలోకి వెళ్లాడు. ఆమె ఒళ్లంతా కళ్లుగా చూసింది— "నేను వెళ్లేదాకా సాయి ఉండలేదు జయా—" మళ్లీ దుఃఖం పొంగింది.....కట్టలు తెంచుకుని తాండవించింది.

జయ నెమ్మదిగా తన ప్రక్కన ఉన్న ఉయ్యాలలోని బుల్లిబుల్లి చేతులనూ కాళ్లనూ చూపించింది— "అడిగో నండి సాయిబాబా!" అంది.

రాజు నవ్వాడు.

## 22

అయిదు రోజులదాకా రాజు ఉలుకు లేదు. పలుకు లేదు. యంత్రంలా తిన్నాడు. నిద్రపోయాడు. లేచాడు. మాలతి కిదేమి అర్థంకాలేదు. ఆ రోజు సాయంకాలం రాజు వెళ్లి సాయి గదిని ఖాళీచేశాడు. అక్కడి కాగితాలూ, డైరీలూ అన్నీ తెచ్చాడు. వా టన్నిటినీ తగలబెట్టడానికి ఆ రాత్రి కూర్చున్నాడు.

ఒక్కొక్క డైరీయే మండిపోతూంటే ఒక్కొక్క రెక్క రాలిపోతున్న పక్షిలా కొట్టుకుంది అతడి హృదయం. ఎన్ని ఉత్తరాలు—అందులో చాలా వరకు తాను రాసినవి—ఎన్ని జ్ఞాపకాలు—అన్నీ కరిగిపోతున్నాయి ..... అయిపోయింది.... ఇంకొక కట్ట మాత్రమే ఉంది. అది తీశాడు రాజా.

ఒక కార్డు ఉంది .... దానిమీద అక్షరాలు పెద్దగా, మకరగా, ఎక్కువ చదువుకోనివాళ్లు రాసినట్లున్నాయి.

ఆ ఉత్తరం రాసిన సాయి తల్లి ఎక్కువగా ఏం చదువుకుంది గనుక—

కొత్తగా ఉన్న ఆ చేతి రాతను కాస్త గమనించి చూశాడు రాజా. అక్కడ కొన్ని అక్షరాలు అగ్నిశిఖలై నిలిచాయి.

'.... నువ్వు పెళ్లి చేసుకోదలచిన తర్వాత నీ మిత్రుడి కోసం ఆగడం అనవసరం. నువ్వు నీకు నచ్చిన ఆ జయంతిని చేసుకో ...... ఆశీస్సులు—అమ్మ'

—బెడ్‌రూములో కాబోలు టేబిల్‌ఫోన్ హోరారుమంటూ తిరుగుతూంది.

# గూర్జర సోమేశ్వరుని ఉల్లాసరాఘవనాటకం

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

నవ పరిణీతా దుహితా
గచ్ఛంతీ పతిగృహాయ బంధూనావ్
పరమార్థ వేదినా మపి
వైక్లవ్యం విరచయత్యేవ॥

సూత్రధారుని మాట ఇది.

పాత్రను ప్రవేశపెట్టులా, కథను సూచిస్తున్నాడు నటీ సూత్రధారుల నిర్గమనానంతరం జనక కులపురోహితుడు శతానందుడు ప్రవేశించి,

'సాధు భో భరతావతంస! సాధూక్తం భవతా!' అని పై శ్లోకాన్ని తాను పదివి, కళ్యాణానంతరం నవోఢ జనక దుహిత అత్తవారింటికి బయలుదేరుతూంటే యోగీంద్ర శిష్యుడు రాజర్షి మిథిలేంద్రునంతవాడు సీతావియోగ సంభూతమైన మనో వైక్లవ్యం పొందాడని ఒక శ్లోకంలో వివరిస్తాడు సూత్రధారుని సూక్తిని.

'అగ్నికి ప్రదక్షిణించి కులగురువైన శతానందులవారికి నమస్కరించు బిడ్డా!' అని జనకుడు చెప్పగా, సీత అలాగే చేస్తుంది. తత్క్షణం కులాచార్యుడు శతానందుడు దీవిస్తాడు.

'వత్సే! భవ శ్వసురయోః ప్రమదప్రదా త్వం
తాతాన్వయస్య యశసే భవ నిర్మలస్య
ప్రాణప్రియా చ భవ భర్తురనన్యజాతేః
పుత్రప్రసూర్భవ, భవ ప్రథమా సతీషు''

అని దీవించి,

జానకీ! స్వభావతః నువ్వు శీలవతివి కనక నీకు చెప్పనక్కర లేదుగాని, గురువులము కనక చెప్పుతున్నాము.

'శుశ్రూషా శ్వసురే, ననాంద్రుషు నతిః
శ్వశ్రూషు సేవాంజలిః,
పత్యౌ తత్పరతా, సనర్మచ వచ స్తన్మిత్ర
వర్గే శుచే
సాంగత్యం కులబాలికాసు, వినయః పూజ్యే
తనౌ సంవృతిః
మార్గోయం మునిపుంగవై ర్మృగదృశాం
శ్రేయః శ్రియే దర్శితః''

అని గురుకంఠంతో అంటాడు. జానకిని దగ్గరగా తీసుకుని చిబుకం మెల్లగా పైకెత్తి జనకుడు,

''బిడ్డా! పతివ్రతలు తెలుసుకోవలసే జీవిత రహస్యం ఇది' అని ఇలా ఉపదేశిస్తాడు :

'సంపత్తౌ వా విపత్తౌ వా
వనే వా భవనేపి వా
భర్తార మనువర్తంతే
నిర్వికల్పాః కులస్త్రియః'

*   *   *   *

ఈ మహానుభావు డెవరోగాని 'శకుంతల' నాటకాన్ని చక్కగా అనుకరించాడని ఈమాత్రం ఉదాహృత పద్యాలవల్ల ఇప్పటికే తెలుసుకునిఉంటారు. అనుకరించినా తడికె కట్టినట్టు కాకుండా గోడ పెట్టినట్టు ఉన్నాదనే నేను అనుకున్నాను. పైగా ఎంతో చక్కని సక్తత, స్పష్టత, సమర్థత కనిపిస్తాయి ఈ అనుకరణంలో. కాళిదాస మహాకవిని ఇంత గంభీరంగా, సహజాక్షర రమ్యంగా అనుకరించి తత్పదచ్ఛాయల్లో గడుసు పోకడగా పోయి, కృతార్థుడయాడనడం నిర్వివాదాంశం అవుతూంది.

కవిత కట్టడంలో కూడా పాదపూరణ ఫలకములైన అక్షరాలు కనిపించవు. ఎనిమి దంకాల మహా నాటకమూ ఈ బాటంగానే నడిచి మేటికైతగాడు అని అనిపించుకున్నాడు. అంతకంటె కవికి చరితార్థత ఇంకేమి ఉంటుంది.

ఉల్లాఘ రాఘవమ్ అనే ఈ పేరుగల సంస్కృత వాణీ విలాసశృంగాటకమైన ఈ నాటకాన్ని రచించిన మహాకవి గూర్జరేశ్వర పురోహితుడున్ను, ఆస్థానకవిన్నీ అయిన శ్రీ సోమేశ్వర దేవుడు. పదుమూడువ శతాబ్దంవాడు. వస్తుపాలుడికి స్నేహితుడు. ఈ వస్తుపాలుడు గూర్జరేశ్వరులైన చాళుక్యరాజుల సచివుడు. పేరుకే సచివుడు కాదు. తన స్నేహితుడైన ఈ వస్తుపాలుణ్ణి సోమేశ్వరకవి ఇలా వర్ణించాడు:

# గూర్జరసోమేశ్వరుని ఉల్లాసరాఘవ నాటకం

'విద్వత్తా ముచితజ్ఞతా ముపశమం
మూర్తి ప్రసత్తిం యశః
సంపత్తిం పరమోపకార పరతా
మౌదార్య మోజస్వితాం
నాహం వక్తుమలం తదేత దఖిలం
శ్రీ వస్తుపాలస్య తత్
దైవం స్మేమిత మేవ యేన ససృజే
సోయం గుణగ్రామణీః'—

(ప్రథమాంకం చివరి శ్లోకం)

ఉపధాశుద్ధుడైన ఈలాటి సచివోత్తముడు ఉండడం నిజంగా గూర్జరేశ్వరుని సుకృత పరిపాకమే అనాలి. వస్తుపాలుడు ఎంత గొప్ప గుణాలు కలవాడూ కాకపోతే ఈ నాటకంలో ప్రత్యేకము చివరా కవి స్తుతికి పాత్రమవుతాడా?

నీ బుద్ధిమత్తకు సురగురువు, అసురగురువూ కూడా సాటిరారని ఒక అంకం చివర కవి వస్తుపాలుణ్ణి స్తుతించాడు. అటు రాజుకీ, ఇటు కవికీ కూడా అంతస్సోత్రపాత్రుడైన ఆ మహామంత్రిని మనమూ ఒకసారి స్తుతించవలసిందే.

ఇక నాటకకవి సోమేశ్వరుడు సామాన్యుడైన కవికాడు. ఛందస్సుచదువుకుని గణాలుకుదుర్చుకుని కవనమల్లినవాడు కాడని ఈ దృశ్యం కావ్యంవల్ల తెలుసుకుంటాము. ప్రాచీన కవుల గ్రంథాలను క్షుణ్ణంగా పఠించి, వారి పోకడలను కవితా రీతులను కైవసం చేసుకున్న ఘటికుడు. పాండిత్యం విబుధ స్తుత్యం. కవితాధార అసాధారణ సుధాధార. చమత్కార విరాజమానమైన శయ్య. ఆలంకారిక శక్తి ఘంటాపథం. ఏతావతా కవియైనవాడు మాత్రమే కాక, నిత్యాగ్నిహోత్ర పూజాధురంధరుడు. తన శక్తియుక్తులను వస్తుపాలుడు ప్రశంసించినట్లుగా యిలా చెప్పుకున్నాడు.

'యస్యాస్తే ముఖపంకజే సుఖవృచాం
వేదః స్మృతీర్వేదయః
శ్రేతా పద్మనియస్య, యస్య రసనా
సూతేచ సూక్తామృతమ్
రాజానః శ్రియ మర్జయంతి మహతీం
యత్పూజయా గూర్జరాః
కర్తుం తస్య గుణస్తుతిం జగతి కః
సోమేశ్వరస్యేశ్వరః—

శ్రుతిస్మృతులు వర్ణించి తెలుసుకున్నవాడు. అగ్ని నారాధించేవాడు. సుమధురమైన వాక్కుగలవాడు. గూర్జరేశ్వరుని పూజ లందుకునేవాడు. అలాటి సోమేశ్వరుని గుణాలను స్తుతించే సమర్థు డెవడున్నాడు?

కవికి ఉండవలసే లక్షణాలు అన్నీ దిష్ట్యా సోమేశ్వరుని యందు వసతి కల్పించుకున్నాయి. కనుకనే చాళుక్య చక్రవర్తి వందిత చరణారవిందు డయాడు. ఆ రాజు కవిని కుల గురు పీఠాన ఉంచి శుభోదర్కంగా పూజించేవాడు. కులగురు వంటే పర్వదినాలలో పెద్దలను తలుచుకుని శౌకదానం ఇస్తే ఆ డబ్బుకి ఆసించి గృహస్థుని దీవించిపోయేవాడు కాడు. మన ఆదికవి నన్నయగారు భారత పీఠికలో

'తన కుల బ్రాహ్మణు'—అని చెప్పుకున్నారంటే వారు రాజనరేంద్రుడిచ్చే 'పొత్తర్లు' అందుకునేవారని కొందరు 'ప్రబుద్ధు'లు అంటూఉంటారు. అలా అనడం వారి వెకిలితనాన్ని, అనభిజ్ఞతనూ సూచిస్తుంది. సోమేశ్వరునికి ఉన్న గుణా లన్నీ నన్నయగారిదగ్గర కనిపిస్తాయి. కనకనే చాళుక్యరాజు నన్నయగారిని కులాచార్యుడుగా వరించాడు. సూర్యవంశానికి వసిష్ఠుడు, సీరధ్వజునకు శతానందుడు కుల గురువులు. ఈ కాలంలో రాజ కుల గురువులుగా అన్ని శుభ లక్షణాలుగల విబుధవతంసులు క్వచిత్తుగా ఉంటారు. వారిలో జమకట్టవలసే యోగ్య చరిత్రుడు సోమేశ్వరుడు.

సోమేశ్వరుడు వశిష్ఠసగోత్రుడవడం కూడా ఈ రామ నాటక రచనకి కొంత యుక్తిసహంగా ఉంది.

సోమేశ్వరుడు ఈ నాటకానికి పెట్టినపేరు "ఉల్లాస రాఘవమ్' అని. ఈ పేరు వినగానే మనకి అనర్ఘ రాఘవమ్ జ్ఞాపకానికి వస్తుంది. మురారి అనర్ఘ రాఘవం ఈ ఉల్లాసరాఘవం చెరొకచేతా పట్టుకుని చదవాలి అని అనిపించుతుంది. చదవగా తేలే సారాంశం: చాలావరకూ సోమేశ్వరుడు మురారిని అనుసరించాడని తేలుతుంది. ఈ సందర్భంలో ఒక చిన్న మాట. ఈ నాటకానికి ఉపోద్ఘాతం రాసిన భోగీలాల్ జయచంద్ భాయ్ సందేశములో ఇలా అన్నారు:

'రాఘవ' నామం చివర వచ్చేట్టుగా రామ నాటకాలు చాలా ఉన్నాయి. వాటిలో ఒకటి అనర్ఘరాఘవమ్. రెండవది ఉదాత్త రాఘవమ్ (మాయురాజకవి). కాని, దీనిని గురించి ఏమీ చెప్పలేకున్నాము. ఇది ఉపలబ్ధం కాలేదు. ఎంతవరకూ ఉదాత్తరాఘవమ్ అనర్ఘ రాఘవాన్ని అనుసరించిందో? మూడవది ప్రసన్న రాఘవమ్. జయదేవకవిది (12 వ శతాబ్దం). నాల్గవది ఈ ఉల్లాస రాఘవమ్—

ఈ క్రమాన్నిబట్టి చూడగా సోమేశ్వరుడు మిక్కిలిగా మురారిని అనుసరించాడని తేలుతూంది. కాని ప్రసన్న కవితా ప్రభావుడైన జయదేవుణ్ణి కూడా సుకుమార పద ప్రయోగ విధానంలో అనుసరించాడని అనుకోవలసిఉంది. ఉద్యానవనంలో రామభద్రుడు విహరిస్తూన్న సందర్భంలో

'చూతైః కందర్ప దూతైః సరస కిసలయా
హ్లాది లోకై రశోకైః
శాలైః ప్రాప్త ప్రవాళైః విహిత మధుకర
శ్రేణి సంగై ర్లవంగైః

గాఢైశ్చ శ్లాఘ్యమానైః పరభృత వయసా
మత్త కాంతే వనాంతే
వాయు స్తాపార్తిజాయుః శిశిరయతి
హృతస్వేదనీరం శరీరమ్'—

అని శ్రీరామునినోట పలికించిన పదాలు జయదేవుణ్ణి పలికిస్తున్నట్లున్నాయి. సుకుమారమైన పదబంధంఉన్న వారందరూ జయదేవుణ్ణి అనుకరించేవారేనా అని ఎవరేనా ప్రశ్నించవచ్చు. దానికి ఒకే వాక్యం సమాధానం. సుకుమారమైన పదబంధం కలవారెందరున్నారు? అని—

మురారి ప్రభావం ఈ నాటకంలో ఎక్కువగా కనిపిస్తుందన్నాను.

ఈ నాటకం నాలుగో అంకంలో కుముదాంగదుడు, కనకచూడుడు అనే గంధర్వులు ప్రవేశించి జరిపిన సంభాషణలు అనర్ఘరాఘవం ఆరో అంకంలో రత్నచూడుడు హేమాంగదుడు అనే గంధర్వుల గొంతుకలను పుణికి పుచ్చుకున్నట్లుంటాయి. రెండు నాటకాలలో ఆ గంధర్వుల సంభాషణలు ఒకే ప్రయోజనాన్ని సాధించాయి. అలాగే ఈ నాటకంలోనూ, అనర్ఘ రాఘవం లోనూ మాల్యవంతుడు, శుకసారణులు పలికే పలుకుల తీరు సరి స్సమానం.

ఎంత అనుకరించినా కవికి గల సహజశక్తి ఆ అనుకరణలో బంగారుపూత పూసినట్లు భాసిస్తూనే ఉంటుంది. మురారిని చదివి సోమేశ్వరుణ్ణి చదివితే మురారి కాఠిన్యం సోమేశ్వరుని లాలిత్యంవల్ల కొంత అపాస్తమవుతుందని తనివి చెందుతాము. ఇంకో విశేషం—మురారిలోఉన్న వక్రత్వం సోమేశ్వరునిలో అంతగా కనిపించదు.

ఈ నాటకం సీతా కళ్యాణం అయిన తరవాత ఆ నవవధువును పెండ్లికొడుకుతో అత్తవారింటికి పంపడంతో అరంభమై రావణ వధానంతరం రామపట్టాభిషేకంతో పూర్తి అవుతుంది. మొత్తం ఎనిమిదంకాల నాటకం. పరిమితాక్షరమైన ఈ వ్యాసంలో నాటకాన్ని అంతనూ విమర్శించి, పాఠకులకు ఇందలి కవితా రీతులను అందించడం అసాధ్యం కనక ఒకటి రెండు ఘట్టాలలో సూక్ష్మమార్గా న్నవలంబించి తెలుపుతున్నాను.

'సంపత్తౌవా విపత్తౌవా
వనేవా భవనేపివా
భర్తార మనువర్తంతే
నిర్వికల్పాః కులస్త్రియః'—

ప్రథమాంకంలో ఇరవైఆరవ సంఖ్యగల శ్లోకం ఇది. జనకుడు జానకికి పతివ్రతలకు ఉపదేశించవలసే రహస్య విషయంగా చెప్పాడు.

ఇది ఎవరో పెద్దలు చెప్పారని జనకుడు అనలేదు. అలా అననక్కరలేదు. ఆనాటి రాజులలో జనకుడు రాజర్షి. యోగీంద్రుడు. సూర్యునకు ప్రశిష్యుడు. కాగా జనకుడు తానే ఉపదేష్ట అవడంలో ఆశ్చర్యంలేదు. దీనిలో సీతమ్మ వనవాసం సూచన వుంది. ఇన్నాళ్లూ ఇక్కడ చీకూ, చింతా లేకుండా పువ్వులపాన్పులమీద పెరిగావు. అల్పకాలంలో భవనాలు విడిచి, వనాలలో సంచరించవలసివస్తుంది. కులస్త్రీలు జీవితం తార్మారయితే నిర్వికల్పలై పతిని అనుసరించాలి. అలా అనుసరించేవారే కులస్త్రీలు. ఇక బంగారు మేడలలో, శిలోద్యానాలలో, పువ్వులపాన్పులపై హాయిగా, రాజ్ఞిగా జీవించడం ఉండదు. నీ పతిని వనవాసంలో కూడా నిర్వికల్పవై అనుసరించు బిడ్డా! అని హెచ్చరిస్తున్నాడు.

ఈ ఉపదేశానికి కొంచెం ముందుగా జనకుడు జానకికి ఆదేశిస్తాడు.

'అమ్మా! అగ్నికి ప్రదక్షిణంచేసి, అనంతరం కులగురువులు శతానందులవారికి నమస్కరించు.'

జనకుడు నిత్యాగ్నిహోత్రి అని ఈ వాక్యం ఉద్బోధిస్తుంది. కాకపోతే జానకి వెళ్ళి ఏ అగ్నికి ప్రదక్షిణ నమస్కారం చెయ్యాలి. వంటింట అగ్నికా? కాదు. ఆనాటి రాజులు ద్విజులే కనక శ్రౌత విధానాన్ననుసరించి అగ్న్యారాధన చేసేవారు. ధనం, ధాన్యం, పశు, పుత్రలాభం, దేహిమే హవ్యవాహన! అని అగ్నిని ప్రార్థించి, శాంతిపాఠం చెప్పి లేచేవారు. అగ్న్యారాధనవల్ల గృహస్థు సలక్షణమైన సుఖ జీవితం వెళ్ళిస్తాడు. అత్తవారింట కూడా నిత్యాగ్నిహోత్రారాధన ఉంటుంది. అక్కడ కూడా నిత్యమూ అగ్నిని ఆరాధించాలని జనకుడు సూచిస్తూ, గృహస్థులకు అగ్ని ఎంత సన్నిహిత దైవమో తెలుపుతున్నాడు. కాలప్రభావంవల్ల రాను రాను అగ్నిపూజలు అడుగంటాయి. ఐశ్వర్యాలూ అరిపోయాయి.

అగ్ని తరువాత వందనీయుడు కులగురువు. అతడు పురోహితుడు. యజమానికి ముందు ముందు హితం కోరేవాడు. కనక కులగురువవుతున్నాడు. ఆ కారణంవల్ల కులగురువు ననుగ్రహం గృహస్థుకి కావాలి. కనుకనే కులగురువుకి నమస్కరించమన్నాడు. సీత నమస్కరించగా శతానందుడు దీవించాడు. ఆ దీవన ప్రత్యక్షర సత్యమై సీతా జీవితాన్ని శోభాయమానం చేసింది.

'భావ ప్రథమా సతీషు'— అనేది శతానందుని దీవనలలో ఒకటి. సీతమ్మ జీవితంఅంతా కష్టాల గచ్చపొద. అయినా ఆమె సహనశీలయై, తల్లినిపోలి, వాటి నన్నిటినీ దిగమ్రింగి నిత్యమంగళాంగియై చరిత్రలో పవిత్రమూర్తిగా విరాజిల్లుతూంది. శతానందుడు "దీవించకపోతే సీత పతివ్రతలలో ప్రథమకాదా? అని ప్రశ్నించుకోడం కద్దు. కాని ప్రశ్నలకూ, ఒక హద్దూ పద్దూ ఉండాలి. బ్రహ్మవాక్యం సఫలం అయిందని అనుకోవాలిగాని, తర్కవితర్కాలతో కాలక్షేపం చేయరాదు. తరువాత జనకుడు అగ్నికి అంజలిపట్టి, ఇలా ప్రార్థించాడు:

'స్వామిన్! ముఖం మఖభుజామసి, మానవానాం
అంతర్గతోసి, జగతోవ్యసి వృత్తవేదీ,
సేయం సుతామమ నమస్యతి తుభ్య మగ్నే!
పాతా పితాచ పవితా భవితా తదస్యాః''

అగ్నిదేవా! నువ్వు యజ్ఞభోజనులైన సురలకు ముఖం. మానవులకు అంతర్గతుడవు. (జఠరాగ్ని—జీవితాభ్యుదయానికి ఆధారభూతమైన తేజోమూర్తి). జగత్తుయొక్క ప్రవృత్తిని తెలుసుకునేవాడవు. (కర్మసాక్షి). ఇలాటి నిన్ను నా కూతురు నమస్కరిస్తూంది. కనక ఈమెకు ఇటుపై నువ్వే రక్షకుడవు. తండ్రివి. ఈమె జీవితాన్ని పవిత్రింపచేసేవాడవు కావలసింది—

యోగీంద్ర శిష్యుడైన జనకుడు మాటాడిన ప్రతి మాటా భావ్యర్థాన్ని సూచిస్తున్నట్టుగా కవి ఆ పాత్రను అంత సమర్థంగా తీర్చిదిద్దాడు.

సీతను పవిత్రీకరించవలసే సమయం వస్తుంది. అది అగ్నివల్లనే జరగాలి. రెండు వంశాల యజమానులూ నిత్యాగ్నిహోత్రులు. అవిచ్ఛిన్నంగా అగ్న్యారాధన చేయడంవల్ల అగ్ని ప్రసన్నుడై ఉంటాడు. అభీష్ట వరప్రదాత అవుతాడు. ఈ విషయాన్ని మన తెలుగు కవులు కూడా కొందరు చెప్పి ఉన్నారు. ప్రవరుడు వరూథిని కౌగిలినుంచి విడివడి వార్చి యింటికి పోవడానికి స్వాహావధూవల్లభుణ్ణి ప్రార్థించాడు.

'దాన జపాగ్ని హోత్ర పర
తంత్రు డనేని భవత్పదాంబుజ
ధ్యానరతుండనేని పర
దారధనాదుల గోరనేని స
న్మానముతోడ నన్ను సద
నంబున జేర్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోన గ్రుంకకయు
మున్న రయంబున హవ్యవాహనా!—

ఇది స్వారోచిషమను సంభవం లోనిది. పెద్దనగారి రచన. దీనిలో అగ్నిని ప్రార్థిస్తూ, ఒక షరతు కూడా విధించాడు ప్రవరుడు. సూర్యుడు పశ్చిమాంబుధిలో గ్రుంకకముందు తనని ఇంటికి చేర్చాలట. ఆరాధకునకు ఆరాధ్యమానదైవం మీద అంత స్వాతంత్ర్యం కూడా ఉంటుంది. అది ఊరికేరాదు. 'భవత్పాదాంబుజధ్యానరతుండనేని' 'అగ్నిహోత్ర పరతంత్రుడనేని'—అనే శపథవాక్యాలు ఆ ఆరాధకుని నిష్ఠను తెలుపుతున్నాయి. తద్వత్తుగానే ఇక్కడ జనకుడు అన్నమాటలు గ్రహించాలి. లంకలో సీత నివసించడం, రావణవధ జరిగాక లోకాపవాదాన్ని నివారించే ఉద్దేశంతో రాముడు సీతను పవిత్రురాలినిగా నిరూపించుకోవాలని అగ్నిప్రవేశం కావాలంటాడు. స్వభావపావనశీల అయినా లోకంకోసం ఆ ఇల్లాలు అగ్నిని ప్రవేశించవలసి వచ్చింది. ఆ సందర్భంలో అగ్నిసీతలుడై ఆమెను పూతచరిత్రను చేసి రామునకు అప్పగించాడు. ఇదంతా జనకుని అంతరాత్మ ఇలా సూచిస్తూంది.

కవి బహుముఖ పాండిత్యంకలవాడైనపుడు రచన స్వభావ రమణీయం అవుతుంది. పాఠకులను ముగ్ధులను చేస్తుంది. ముక్కువ్రేలితో తలలూపిస్తుంది.

సీతారాములు అయోధ్యకు వెళుతూండగా పరశురాముడు మధ్యమార్గంలో ఎదురై భయపెట్టడం, చివరకు రామునిచే విజితుడు కావడం ఇత్యాది కథ కంచుకివచ్చి చెప్పగా అంతా విని, జనకుడు శతానందుణ్ణిచూసి, సహర్షంగా

'భగవన్! శ్రుతం శ్రోతవ్యమ్! తదేతయా జామాతురభ్యుదయ వార్తయా సాంతఃపుర పౌరం ఆత్మపురం ప్రమోదయామః'—అని అంటాడు.

అంతవాడికి ఏతల మాసినవాడో, అల్లుడుగా దొరికితే ఇంత కథ జరుగుతుందా! శివ ధనుర్భంగంకాగానే జనకుడు జామాతశక్తి సామర్థ్యాలు తెలుసుకున్నవాడే. అయినా క్షత్రియ వంశకుఠారం అయిన కుఠారపాణితో వైరం అంటే ఎంతవాడికీ జడుపే. ఆపక్షంలో కుమార రామభద్రుడు పరశురాముని చేతినుంచి హరివిల్లును తీసుకొని

'నీచైశ్చకార చాపంచ

మదంచ తస్య'—అని అనగానే ఎక్కడలేని ఆనందం కలగడం ఆశ్చర్యంకాదు. కనుకనే అల్లుని విజయవార్తను ఆత్మపురానికంతకూ చెప్పి, ఆనందింపచేదామన్నాడు. రాచరికము, సద్గార్హస్థ్యము, విజ్ఞానమూర్తిత్వము మూర్తీభవించినవాడు జనకుడు అని ఈ సోమేశ్వరకవి అడుగడుగునా నిరూపించాడు.

రెండోఅంకంలో ఒక చిన్న విషయం. సూర్యోదయాన్ని వర్ణిస్తున్నాడు రాజపురుషుడు.

'సృష్టిసూత్రం మిదం స్రష్టః
విస్పష్టం వివృణోతి యః
తం మార్గ మపవర్గస్య
పూషణం ప్రణిదధ్మహే'— (శ్లో. 3)

తమస్సునుంచి మేల్కొని జ్ఞానశక్తినిపొంది, కర్మయోగాన్ని అవలంబించాలని భగవాముని ఆదేశం. గీతోపదేశం. అదే సృష్టిసూత్రం. భాస్కరుడు జీవులకు ఆ శక్తిని కలిగి

స్తున్నాడు. కర్మమార్గావలంబులు మోక్షం పొందగలరు అవ డానికి జనకుడే ప్రథమ సాక్షి.

'కర్మణైవహి సంసిద్ధిం
ఆస్థితాః జనకాదయః'—
అని భగవద్గీత—

నిష్కామకర్మ ఆచరించి అపవర్గాన్ని పొందవచ్చునని ఈ రాజు పురుషుని ముఖతః గీతా రహస్యాన్ని సోమేశ్వరుడు చెప్తున్నాడు.

సీతారాములు అయోధ్యలో లీలోద్యానంలో విహరిస్తున్న ఘట్టం. తోటమాలి ఒక కోతిని పెంచుకుంటూ ఉంటాడు. సీత చేటికతో కలిసి ఉద్యానవనంలో ప్రవేశిస్తుంది. కోతిని చూసి, భయపడి చేటిక పరుగెత్తుతుంది. తరువాత తోటమాలి ఆ కోతిని రామాజ్ఞవల్ల దూరంగా పొమ్మంటాడు. అది ఏమీ చెయ్యదు. భయపడనక్కరలేదనిచెప్పి ఆ కోతిచేత సీతకు ఒక పండు ఇప్పించుతాడు. అలాగే చేటికకు కూడా ఒక పండు ఇప్పించ బోగా ఆ చేటిక,

'మాలాధర! ప్రియసఖ్యై సీతాయై ఏవ ఏషవానరః ఫలప్రదోభవతు'—అంటుంది. ఈ వానర వృత్తాంతం ఎంత సముచితంగా భావి కథా సూచకంగా వుందో పాఠకులు గ్రహించ గలరు. సీతకు లంకలో రామ వృత్తాంతంచెప్పి, జీవితాశాఫల ప్రదాతయయిన వాడు వానరశిరోమణి. తోటమాలి కోతిని పెంచుకోడం మనం చూస్తూ వుంటాము. కనకనే ఇక్కడ లీలోద్యానపాలకునకు ఒక పెంపుడు కోతి వుండడం స్వభావరమ ణీయమైన సంఘటన.

తోటమాలి వెంటవున్న వానరాన్నిచూసి రాముడు కోతి చేష్టను వర్ణిస్తూ,

నిష్కారణ మధిరోహణ
మవరోహణ మంఘ్రిపేషు కుర్వాణః
నిజ చిత్తాదపి చపలః
ప్లవంగ మోయం సమభ్యేతి—

అంటాడు. అపుడు తోటమాలి 'చిరకాల పరిచయంవల్ల కలి గిన విశ్వాసంతో జంకూ గొంకూ లేకుండా నా దగ్గరకువస్తూ ఉంటుంది, అనగా రాముడు,

'అహో! మహదాశ్చర్యం
యన్నర వానరయోః పరస్పరం
విస్రంభః'—అని ఆశ్చర్యంగా అంటాడు. పాపం! తనకి చివరకు వానరులే మిత్రులు, సహోదారులు, వార్తాహరులు, సేనాపతులు, సైనికులు అయారు.

ఎనిమిదంకాల నాటకాన్ని పరిచయం చెయ్యడం అంటే సామాన్యంగా ఈలాటి వ్యాసాలతో అయేపనికాదు. దిఙ్మాత్రంగా ఈ ఒకటి రెండు సందర్భాలతో ఈ మహాదృశ్య కావ్యాన్ని పరి చయం చేయగలిగాను.

కవి సమర్థుడై నటుడు సమర్థుడైతే ఆ నాటకం ప్రద ర్శన యోగ్యమై రక్తికట్టి రాణకెక్కి వహవ్వా అనిపించు కుంటుంది.

ఒక్కరాత్రిలో రామాయణాన్ని సర్వులూ అంటే సామా న్యజనంకూడా గ్రహించి రసాస్వాదనతో సంతుష్టులు కావాలనే ఉద్దేశంతో సోమేశ్వరకవి పూర్వ కవుల రచనలను తన ప్రతిభా సంపత్తితో వెలిగించి ఇంత చక్కని నాటకం వ్రాశాడు.

శ్రీ కృష్ణాయ నమస్తస్మై
యం నత్వా నపునః పుమాన్
పంకసారేత్ర సంసార
కాసారే కాసరాయతే (నాంది)

# మాలపల్లి

## (మూడవ భాగం)

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

నాటకీకరణం : శ్రీ గోపీచంద్

[దూరంగా పనిచేసే కూలీల కోతల పాట వినిపిస్తూ ఉంటుంది.]

సంగదాసు :—కథ యెట్లా ఉన్నది ?

రామానాయుడు : క్రొత్త ప్రపంచంలో తెచ్చిపెట్టావు. ఈ లోకంలో మూడు గంటలకు యేమీ ఫలహారాలు లేవా ?

సంగ : మా లోకంలో అసలు ఫలహారాలే లేవు. అయితే నిజమైన ఫలహారాలను తెచ్చిపెట్టగలను. దోస ఫలాలు సయిస్తవా ?

రామా : పాతిక కాయలు తెచ్చి యిల్లా పడెయ్యి.

సంగ : పాతిక కాయలే.

రామా : పాతిక దోసచెట్లు కూడా సమూలంగా తింటా.

[సంగదాసు నాలుగు కాయలు తెచ్చి యిచ్చాడు ]

రామా : మా చేలోవేగా, యింకా తీసుకురా.

సంగ : అవి కానియ్యండి తెస్తా.

రామా : రెండు కాయలు తినేవరకు పండ్లు పులిసినవి. దాసూ, దోసకాయలు పండ్లు పులుస్తవా యేమి ? నాలిక నోరు పట్టదు. యెట్లా యీ ఆకలి ?

సంగ : ఇంటికి పోయి ఫలహారం చేస్తారా ?

రామా : అక్కడికి యీ శరీరాన్ని మోసుకపోయే దెట్లా ?

సంగ : ఫలహారం త్వరగా తెప్పించనా ?

రామా : అందాకా నిలిస్తే కద, ?

సంగ : వూచబియ్యం కొట్టిపెట్టనా ?

రామా : తినేవి యేమయినా సరే తీసుకురా. ధ్వంసంచేస్తాను.

[సంగదాసు లేతకంకె విరిచి వూచ బియ్యం కొట్టిబెట్టాడు.]

రామా : కొట్టవోయ్ యింకొక కంకి. పోయేటప్పుడు కట్టుక పోతావా ? పీనాసిలా గున్నావే ?

సంగ : అవి తినేవరకూ కొట్టలేనా ?

రామా : పండ్లు నొప్పేమి ?

సంగ : పులిసిన వంటెరిగదా ? తియ్యని వూచబియ్యం తింటే పులవడం పోతుంది.

రామా : యిప్పుడు బాగా నమిలుతున్నా కాని నాకు దవడలు నొప్పి పుట్టుతున్నవి. యెందుకీ పాడు శరీరాలు. వాండ్లు జూడు రాళ్లవలె పనిచేస్తున్నారు.

సంగ : దానికేమి ? యెవరు చేసే పని వాండ్లు చేస్తారు.

రామా : నీ వందరు పనులు చేస్తావే ? కాస్త స్థిమితపడ్డది గాని మంచినీళ్లు కాసిని తెచ్చిపెట్టు.

సంగ : మీరు పోయి తాగుదురూ, ఆ కూలివాళ్లు చూస్తే అల్లరి చేస్తారు. ?

రామా : యేమి చేస్తే ? ఇంట్లోనుంచి వెళ్లగొడతారు. దానికి సిద్ధమయ్యే కూర్చుంటిని. మీ యింటికి రానిస్తావా ?

సంగ : నేనొక సంగతి అడుగుతా చెప్పండి. ఆకలంటే యేమిటో తెలిసిందా ?

రామా : ఆకలంటె యెక్కడ ప్రారంభిస్తుందో, యెక్కడికి యెక్కుతుందో యెంతవరకు వ్యాపిస్తుందో, అప్పుడు శరీర మే స్థితిలో ఉంటుందో, నాలుగు పర్వాల కింద ఒక భారతం రాస్తా ?

సంగ : మీకింత ఆకలెందుకెక్కువయింది ?

రామా : పొద్దున పనిచేయబట్టి.

సంగ : పొద్దుగూకులూ పనిచేసేవాండ్లకు యెంత ఆకలి ఉంటుందో యోచించుకోండి. మడత కుడుములంటే కూడా యేమిటో తెలిసిందా ?

రామా : అవి అనుభవంలోనికి రాలేదే.

సంగ : మీరీపూట దోసకాయలూ, వూచబియ్యం తినకుండా యీ రాత్రి వూరికే పడుకుంటే అప్పుడు మీకు మడత కుడుములంటే యేమిటో బోధపడుతుంది.

రామా : కూలీలంతా మూడు గంటలకు దోసకాయలూ, వూచ బియ్యం ఫలహారము చెయ్యరా ?

సంగ : యజమానుడు చూస్తే ముల్లుగఱ్ఱలు విరుగుతవి.

రామా : కొట్టడం నేరం కాదా ?

సంగ : వీరవాండ్లను కొడితే కాదు.

రామా : దాసూ, నా కిదంతా కొత్త ప్రపంచంగా ఉంది. నీవు చెప్పే సంగతులన్నీ కొత్తవే. యిదివరకు నా జీవితమంతా వృథాగా గడిచిపోయింది. ప్రపంచపరిస్థితులు యథార్థంగా తెలియవు.

సంగ : మీ జీవితమంతా భగవత్సేవకు మీదు గట్టారు కదా. మానవసేవే భగవంతునిసేవ.

రామా : నిశ్చయం. మా నాయనగారు వచ్చిఉంటారేమో. ఈరోజు కూలి విషయం తగాదాలోకి వస్తుందా ?

సంగ : చూద్దాం.

## 2

### [చౌదరిగారి ఇల్లు]

చౌదరి : పిల్లవాడేడి ?

లక్ష్మమ్మ : మేడమీదికి యిప్పుడే పోయినాడు.

చౌదరి : మీ అబ్బనా డెన్నడైనా మీవాండ్లు కోతలు కోశారూ?

ల : బాగానే ఉంది సరాగం. ఎన్నడో పోయిన మా అబ్బ సంగతెందుకు ? యిప్పటి మీ సంగతి ఆలోచించుకోండి. మా అబ్బ గొంతులోని కెన్నడూ మీ గుటక జారలేదు. ఎప్పుడూ మీకంటే పైచెయ్యిగానే ఉన్నారుగాని మీకు లొజ్జుగా లేడు.

చౌదరి : పిల్లవాణ్ణి కోత కెందుకు పంపించావు ?

ల : నే పంపించానూ ? వాడేమి పాలు తాగేవాడా నే పంపడానికి?

చౌదరి : ఈ మాల సావాసాన చెడిపోతున్నాడు. మాలవాడు తేపి మేడమీది కెక్కడం యెందుకు ?

: తండ్రి మాలవాణ్ణి మిద్దెలో పెడితే కొడుకు మేడమీద పెట్టాడు. పదిమంది వచ్చే యింట్లో ముఖస్థలం మాలకూటంగా యెవరు చేశారు ? మొన్న మీ వియ్యంకుడు భోంచేసి యెరక్క వాడి గది తీసివుంటే దాంట్లో మంచంమీద పడుకున్నాడు. తరువాత తెలిసి నొచ్చుకుని స్నానం చేశాడు.

చౌదరి : (లక్ష్మమ్మ మాటలకు కొంత జంకి) వాణ్ణి ఉద్యోగానికి పొమ్మను.

: పోకుండా నే పట్టుకున్నానా ? మీకు దుబారా ఖర్చు లేకుండా నేను వాడి దగ్గరనే ఉంటా. మీరు పూటకూలి యింటికి పొండి. యేమీ నష్టముండదు.

చౌదరి : సగం వాడిని నీవే చెడగొట్టుతున్నావు. వాండ్లు నీవు నీవనే పిలుచుకోవడం యిప్పుడే విన్నా.

: నేను అట్లా పిలుచుకోమని చెప్పలేదు. నా కివన్నీ తెలియవు. నా రోజులు నేను వెళ్లబుచ్చుకుంటా. మీ తగాదాలన్నీ నాతో చెప్పవద్దు. యెవరి యిష్టం వచ్చినట్లు వారుండండి.

చౌదరి : అన్నం పోతాని కెందుకు పంపావు ?

ల : పంపమంటే పంపా ?

చౌదరి : కూలివాండ్లతో కోతకోసి వాండ్లతో కూర్చొని అన్నం తింటే గౌరవానికి భంగం రాదా ?

ల : ఆ సంగతి వాడికి తెలియదా ?

చౌదరి : తెలుసో తెలియదో మాలవాడు వీణ్ణి చెడగొడుతున్నాడు. వాడు మన కొంపకు ముసలమైనాడు. ఇప్పుడు కూలివాళ్లని రెచ్చగొడుతున్నాడని విన్నాను. ఇవ్వాళ ఐసా పైసా తేలుస్తాను.

## 3

### [ఆఫీసుగది]

సంగ : కూలివాండ్లు వచ్చే వేళవుతున్నది. రెండు బస్తాలు వాకిట్లో వేయించనా ?

చౌదరి : ఆ సంగతి మాట్లాడడానికే పిలిచాను కూర్చో.

సంగ : యిక్కడ నిలుచుంటాలే చెప్పండి.

చౌదరి : సావకాశంగా మాట్లాడి తరిచి నిగ్గుదీతాం.

సంగ : సంగతి విప్పన్నంగా ముందు జెప్పండి.

చౌదరి : కూలివాండ్లకు పూర్వం రోజుకు పావలా వంతున యిస్తూఉండేవారు. దరిమెలా ఆరణాల దాకా పెంచారు.

సంగ : పూర్వం రూపాయంటే బండి కల్లుగా ఉండేది. నాణెముల ప్రచారం తక్కువ గావడంచేత ధాన్యం యియ్యడమే నాణెంగా కనబడి వస్తువిచ్చి వస్తువే బదులు తీసుకుంటూ ఉండేవాళ్ళు. ధరలు ఏ ప్రకారంగా ఉన్నా వస్తువే చెలామణి అవుతూ ఉండేది. పత్తి విడతకూ, మిరపకాయల కోతకూ, కంకులు గిల్లడానికీ యెన్నడైనా మీ బుద్ధెరిగిన తర్వాత డబ్బు కూలి యిచ్చారా? ఏ పంట కైలుచేస్తే అదే కూలిగా యిస్తూ ఉండే వాండ్లు. ఆ పద్ధతి ఉభయులకూ వుసులుగానే ఉండేది.

చౌదరి : యిప్పుడు మనము డబ్బే యిస్తామంటే వచ్చిన చిక్కేమి ?

సంగ : అట్లా మార్చటానికి ఉద్దేశమేమి ?

చౌద : ఉద్దేశ మేదైతేనేమి ? లాయిలాసా ఒకటి కనపడేదేగా ?

సంగ : నేను తరిమి అడిగినానని కోపపడవద్దు. విషయం చర్చిస్తున్నాం గదా. లాయిలాసా లేకుండా చేసుకోవడమే మీ అభిప్రాయమా ?

చౌదరి : డబ్బు యివ్వడం మనకు లాభ మనుకో.

సంగ : ఎట్లా లాభం ?

చౌదరి : అడ్డెడు జొన్నల కూలి నాలుగు కట్టలకూ ఒక తవ్వెడు గింజలు కట్టుకోండి. రూపాయికి నాలుగు మానికెల వంతున అడ్డెడు దవ్వెడికీ పదణాలవుతుంది. చొప్ప ఖరీదు ఒక అణా యెక్కువ అనుకోండి. రోజు కూలి పదకొండణాలు మదింపు చేయవచ్చు.

సంగ : కొన్నాళ్లు మూడు మానికెలు కూడా అమ్మారు. ముందు అయిదు మానికెలు గావచ్చు. దేనినిబట్టి డబ్బు కూలి నిర్ధారణ చేస్తారు ?

చౌదరి : యీరోజు ధరలు మనసులో బెట్టుకొని ఆరణాలు నిర్ణయిస్తామన్నోయ్.

సంగ : ఈ ఆరణాల కింద యిప్పటి ధరలను బట్టి మూడు దవ్వల కూలి యేర్పరచడం మీ కిష్టమేనా ?

చౌదరి : నా అభ్యంతరం లేదు. అట్లా ఆసామి లందరిచేత ఒప్పిస్తా.

సంగ : రేపు రూపాయికి మూడు మానికె లయితే మీ కుమారుడు మానెడే చేస్తా నంటాడేమోనే ?

చౌదరి : యెందు కంటాడులే.

సంగ : వేస్తరు తీయవలెననే ఉద్దేశ్యం మనుష్యులకు యెప్పుడూ ఉండేదేగా ? కూలీలను పిలిపించండి. ముఖాముఖి మాట్లాడుదాం.

[కూలిజనం వీధిలో మూగి తోసుకు వస్తున్న ధ్వని.]

చౌదరి : జనమంతా తోసుకొని వస్తే యెట్లా ? కూలీలల్లో ముఖ్యమైనవాండ్లు ముందుకురాండి.

[శేషయ్యా, వీరదాసూ ముందుకు వచ్చారు]

వీరదాసు : అయ్యా . . . .

శేషయ్య : ఏమిటండీ . . . .

చౌదరి : యీ ముగ్గురి యిష్టప్రకారం మీరంతా బోతారా ?

కూలీలు : ఒప్పుకుంటాం. మేము కూడా యిక్కడ ఉండే వింటాం.

చౌదరి : వీరదాసూ, నీవు జొన్న కూలికి పోతున్నావా ?

వీర : మరేనండి. కోరీలలో నీళ్లు నిండినవి. రాతిపని జరగడం లేదు.

చౌదరి : యింతమంది జనం మీమాట ప్రకారం పోతామంటున్నారు. మీరు ముఠాలకు నాయకు లైనందుకు అందరినీ జాగ్రత్తగా సగరొప్పుకోని రావాలె.

వీర : మరే, నామకా పెద్దఱమే గాని వాండ్ల కిష్టంలేకపోతే వినిపించే సత్తా మా దగ్గిర లేదండీ.

చౌదరి : యేమంటారో చెప్పండి.

వీర : దొరలే శలవియ్యండి. మేమేమి జెపితే సాగేటట్టుంది ?

చౌదరి : సాగకేమోయ్, చెప్పు.

వీర : నా దొక్కటే మనవండి. మీరు తండ్రులు. మేము బిడ్డలవంటి వాండ్లం. మామ్మూలు ప్రకారం వెళ్లబారి పోనీయ్యండి. యెందుకు మధ్య యీ అట్టాలు.

చౌదరి : నేనూ తేడా మనిషిని గాను. నలుగురితోపాటూ మన మూనూ. ఇవ్వాళ గిద్దెడు గింజలు విడిగా లేవు. పాతర దీసి రేపు సాయంత్రం రెండురోజులదీకలిపి యిప్పిస్తా.

వీర : యీపూట నలుగురముండి పాతర దీస్తాం. పొద్దున్నే యిప్పించండి. తల బొక్కెడూ వండక తిని పొలంమీద బోతాం.

శేష : యీ వీరదాసు జమీందారీ సెకలు పోతాడు. మాకీపూట బోలె గాలదు యిప్పు డియ్యకపోతే.

కూలీలు : శేషయ్య సరి, ఉన్నమాట తెగ జెప్పాడు.

శేష : నాకీ వసవసలు పనికిరావు, ఉన్నమాట అని తీరాలె.

చౌదరి : తొందరపడకోయ్ శేషయ్యా, మా యిబ్బందులు గూడా మీరు చూడాలె.

శే : మీ యిబ్బందులు చూచే మాత్రపు వాండ్లమా ? మా కడుపాత్రం మాది.

చౌదరి : నేనేమి రోజుల తరబడి ఆగమన్నా గనుకనా. వీలైనంతవరకు రేపు సాయంత్రమే యిస్తానంటుంటిని.

వీర : పొట్ట చేత బట్టుకొని పొద్దున్నే యే ఆసామి దెగ్గరకో పోతేనేగాని మాకు జరగదు. ఈ పూట వేస్తు పడుకోని, పొద్దున్న యేమి చేయగలం ?

చౌదరి : నేను వూరకె మెత్తగా మాట్లాడుతుంటే మీరు పైకెక్కుతున్నారు గాని, మా ఆసామీలు మిమ్మును కూలికి పిలవకపోతే మీరేమి చేస్తారు ?

వీర : యీ గడ్డమీద బత్తేముంటే ఉంటాం, తీరితే కాగల్లో అంటూ దేశాల పాలయిపోతాం.

శేష : ఆసాములు మమ్ములను కూలికి పిలువకపోతే కాస్త వెనకా ముందూ వారు బయలుదేరవలసి వస్తుంది.

చౌదరి : మాకేమి పోయినదాకా ?

శేష : పోకపోతే పొలాలు బీడెట్టుకుని గడ్డి మెయ్యాలె. మేము రేపు పొద్దున్న వెళ్లి కొయ్యకపోతే మీ యిరవై యెకరాల జొన్న మట్టి గలుస్తుంది. గనిమెలుతీసి నీళ్ల గట్టకపోతే, అయిదువందల యెకరాల పల్లం యిగిరి చెక్క గడుతుంది. రేపు మీ జీతగాండ్లను బందు చెయ్యనియ్యండి. పొలాలు బీళ్లగాక ఏమవుతవో ?

ఒకరు : శేషయ్య మామ అతికేట్టు జవాబు చెప్పాడు.

చౌదరి : వా డెవడోయ్, అంతా మొనగాం డ్లయినారు.

వీర : వాడి మొగంలెండి పిల్లసన్నాసి. మా కష్టం తమకు చెప్పుకోకపోతే యెవరికి చెప్పుకొంటాం. మాకు ఏరోజు కూలి ఆరోజు కొంగులో బొయ్యంధి జరగదు.

చౌదరి : అంత జరగనివాండ్లు యివ్వాళ మునసబుమీద సమ్మె యెట్లా గట్టారు.

వీర : మాకు సమ్మె లేమున్నవండి. కడుపులో యెత్తు తేక పోతే నడిచిపోలేక పడుకుంటాం.

చౌదరి : సరే, మీరంతగా చెప్పుతున్నారు గనక నామాట మీరయినా వినాలి, మీమాట నేనయినా వినాలి. కోమటింట్లో యిప్పిస్తా పుచ్చుకోండి.

వీర : దొరలు యేదో వక మార్గం జెయ్యాలెగాని, లేకపోతే సన్నకారు బతగ్గలదా ?

చౌదరి : సంగదాసూ, వీండ్లకు తలా ఒక ఆరణాల గింజలూ యిప్పించు. తేడా ఉంటే తరువాత చూసుకుందాం.

శేష : అయ్యా, యిట్లా మభ్యపెడితే సాగే రోజులు పోయినవండి. మనిషికి పన్నెండణాల వంతున యిప్పించమనండి. కోమటింట్లోనే ఆయెను.

చౌద : దాసూ, వాండ్లకంత నమ్మకం లేకుండా ఉంటే మనమే యిబ్బంది పడదాం. విడిగా గింజెలేమైనా ఉన్నవా ?

సంగ : హానీ హానీగా వాండ్లకు సరిపోవచ్చు.

చౌద : కొలిపించు.

[చౌదరయ్య వెళ్లిపోతాడు].

సంగ : (కూలీల నాయకులను పిలిచి) శేషయ్యా, లింగయ్యా, ఒక మాట. చౌదరయ్యగారు కూలి మామూలుగా యివ్వడంచేత పూళ్లోవాండ్లు కూడా యిస్తారు. రేపు సాయంత్రం చౌదరయ్యగారు బహుశా తగ్గిస్తామంటారు. రేపు మీరు పూళ్లో ముఖ్యమైన ఆసామీల సాలాలకు మామూలు కూలి ఏర్పాటు చేసుకొనిపొండి.

శేష : సరే, మీమాట కింక అడ్డేమున్నది ?

రా. నా : దాసూ, నీవు జూదం బాగా ఆడుతావా యేమి ?

సంగ : ఈ జీవితమే జూదం.

రా. నా : జూదపు యెత్తులు వేయడం తప్పు లేదన్నమాట.

సంగ : చేసేపని మంచిదయితే దుస్సాధనాలు ఉపయోగించినా తప్పులేదని కొందరంటారు గాని, అది నేనంగీకరించను. ఒక కార్యం నిర్వహించవలసి వస్తే సామ దాన భేద దండోపాయాలు సమయానుకూలంగా ఉపయోగించవచ్చు. సామోపాయం అన్నిటికంటే మంచిది. సాధారణంగా ముందవలంబించవలసిందీని అయినా కార్యాలు కొన్ని దానివల్ల చక్కబడవు. అందువల్ల కార్యభంగమూ కావచ్చును. తక్కిన ఉపాయాలు దోషాలనడానికి వీలు లేదు. ఉపేక్ష అనే పంచమోపాయం ఒకప్పుడు వాటన్నిటికంటె యెక్కువ పనిచేస్తుంది.

**4**

ఒక ముసలిది : లచ్చక్క దొరసాని.

లక్ష్మమ్మ : ఎవరు నీవూ ?

ము : నేను ముతరాచ ముసలిదాన్నమ్మా.

రా. నా : అమ్మా, నిన్ను లచ్చక్కని పిలుస్తారేమే ?

ల : నేను యివ్వాళ యెంత పనికిరానిదానైనా, యిందాకా మీ నాయన మా వంగసం మంచిదికాదని చెప్పినా, మా అమ్మమ్మ లచ్చక్క అనే ఆమె సలభైయేండ్లు పాల్పుగా జమీ యేలింది. ఆక లనేమాట ఆమె చెవుల వినలేకపోయేది.

చౌదరి : ఆమెకు జమీందారీ ఉంది గనుక సత్రాలు పెట్టింది. ఆమె మోస్తరుగా నీవు సత్రాలు పెడతానంటే, మట్టిపిసుక్కొని బతికేవాడ్లం మేము, యెట్లా భరిస్తాం ?

ల : మీరు సత్రాలు పెట్టేవారే. కూలి గింజలకోసం యింత సేపటినుంచి ముగతికలు పడుతున్నారు.

ము : ఓ లచ్చక్క దొరసానీ, నా మొరాలకించండమ్మా. ఆకలికి ప్రాణాలు పోతున్నవి. యింత గంగ పొయ్యమ్మా.

చౌదరి : యెవరో యిదొక వేషం వేసుకొచ్చింది. కోటి విద్యలూ కూటికేగా.

ల : నీకు అన్నీ వేషాలే. యేమిటే.

ము : ఇవ్వాళకు ఏడురోజు లయింది అన్నం తిని. యింత బొద్దాకు ఉడకబెట్టుకొని తిని బతుకుతున్నా. సోషకు వచ్చింది. యింత గంజి పొయ్యమ్మా.

చౌదరి : సోష వచ్చిందట, యిక్కడికి యెట్లా నడిచి వచ్చిందో ?

ల : (సిబ్బిలో అన్నం పెట్టుకొని వచ్చి) . . . . ఇదుగో పట్టు

ము : ఏమిటమ్మా అది.

ల : అన్నం.

ము : అన్నం మింగుడు పడుతుందమ్మా యిప్పుడు ?

చౌదరి : అన్నం తెచ్చావుగాదూ, చల్ల కూడా తెమ్మంటుంది. ఆ తర్వాత పూరగాయలు తెమ్మంటుంది. పెట్టేవెఱ్ఱివాండ్లుంటే సరి.

ల : నీవు అవతలికిపో . . . . అయితే యేమంటావు ?

ము : ముందింత గంజి పొయ్యమ్మా. ధరకం అవుతుంది.

ల : (గంజి తెచ్చి) ఇదిగో, గిన్నె తీసికో.

చౌదరి : ఈపెవన్నీ వేషాలు. గిన్నె యిస్తున్నది దానికి. వెండి గిన్నేనా ?

ల : వుండూ, నీవు వూరికేనూ, ప్రతిదానికీ హేళన.

[ముసలిది గిన్నె తీసుకొని ఆత్రంగా తాగబొయ్యేవరకూ మింగుడుబడక ఉక్కిరిబిక్కిరయింది].

(ముసలిదాని తల బట్టుకొని కూర్చొని) అయ్యో పాపం, యిదేమిటి గుడ్లు తిరిగిపోతున్నవి.

చౌదరి : తెచ్చిపెట్టావు ఛీదో కొంపమీదికి. సోషకం వచ్చి వస్తున్నది గావాలె ? వీధిలోకయినా పట్టండి, మిద్దెలోగుండా శవాన్ని తీసుకపోవలసి వస్తుంది.

ల : అబ్బా, నీవు అవతలికి వెళ్లదూ. అయ్యో పాపం. ఆకటికి ప్రాణం కడపట్టిందర్రా. నాయనా రాముడూ,

యిట్లా దీన్ని పట్టుకో, గొంతులోకి గంజి సాధకం జేతాం. (రామానాయుడు వెనక అనుకొని కూర్చున్నాడు).

చౌదరి : ఇక నరే. (అని లోపలికి పోయినాడు.)

రా. నా : నాయనా, ముసలిది బతికింది.

చౌదరి : (వచ్చి) పోనీ ఉద్ధరించింది, యిక భూములు యేల్తుంది గావాలె.

రా. నా : కిందనే పడుకుంటున్నదే ?

ల : ఇదిగో చాప తెస్తిని.

చౌదరి : ఓహో ఆవిడకు పవ్వళింపు సేవ చేస్తున్నారూ, తల్లికి కొడుక్కూ బాగా దొరికింది సేవ. ఇగనైనా అన్నానికి పోతారా. మీ రీసంబ్రంలో ఉన్నారు, యిప్పుడల్లా వచ్చేటట్టు లేరని, ఆకలవుతుంటే తినొచ్చాను.

[అంటూ అక్కడ వాల్చిఉన్న మంచంమీద చల్లగాలికి పడుకున్నాడు].

ల : (మెల్లగా) నే నిక్కడ ఉంటాగాని, నీవు లేచి అన్నం తిను. ఆయన లేచి నణుగుతాడు.

## 5

[సంగదాసు గది].

సంగ : నీవు యింకా మేలుకొనే ఉన్నావా ?

రా. నా : నాకు నిద్రపట్టలేదు. నీవూ పడుకోలేదేమీ ?

సంగ : యిద్దరం ఒక అవస్థలోనే ఉన్నాం, నిద్ర పట్టించుకో.

రా. నా : పైకిపోదాం రా ?

సంగ : ఇశ్శో, అబ్బా, నే రాలేనండి.

రా. నా : ఇంతవరకూ బాగా మాట్లాడి యిప్పుడు ఆప సోపాలు పడతావేమి ? హోల్లో నిన్ను కట్టివేయనులే. సాయంత్రం కూలి విషయంలో న్యాయపద్ధతి సంగతి యెత్తి వదలిపెట్టావు. చెపుదువుగాని రా.

సంగ : మంచి లగ్నం బెట్టారే. పొద్దున్న మాట్లాడ గూడదా ?

రా. నా : ఏప్తూనా, రావా ?

*    *    *    *

సూత్రధారి : తలుపు తాళంవేసి ఉభయులూ మెట్లెక్కు తున్నారు. చౌదరయ్య యావ గలవాడు. రామా నాయుడు వీధి మెట్లు దిగడం గనిపెట్టి యేమో కుర్రవాడు ఒంటరిగా ఉన్నాడు గదా అని వూరు కున్నారు. మళ్లీ యిద్దరు మనుష్యులు మెట్లెక్కి నట్లు వినపడ్డది. ఉపేక్షించి వూరుకున్నారు. రామా నాయుడూ, సంగదాసూ చెట్టాపట్టాలు పట్టుకొని వచ్చి సావిట్లో కుర్చీలమీద కూర్చోడం కిటికీలో గుండా కనపడ్డది. మనిషి కుప్పలు గూలిపోయినాడు. వీరి వ్యవహారం శృతిమించి రాగాన పడ్డది. అయినా చూతాం అనుకున్నాడు.

## 6

రా. నా : దాసూ, సాయంత్రం ఒక ముసలమ్మ సొషవచ్చి పడ్డది. నీవు చూస్తే మూర్ఛపడిపోదువు.

సంగ : నేను చూస్తూనే ఉన్నా. యిటువంటివి మా పల్లెలో అనేకం జరుగుతుంటవి. ఆ ముసలమ్మ మీ యింట్లో వచ్చిపడ్డది గనుక బతికింది గాని మా పల్లెలలో యీ విధంగా అనేకులు రాలిపోతూనే ఉంటారు. వాండ్ల అవస్థ యెంతకాలంలో ఉంటుంది. కప్పలవలె ఎండి జీవంతో ఉన్నవాండ్లు చినుకులు పడంగనే బెకబెకలాడి మీ ఆసాములకు పంటలు పండించటానికి వస్తారు.

రా. నా : దాసూ, లోక విషయంతెలిసినకొద్దీ, నాకు మనసులో వేదన ఎక్కువవుతున్నది. వీండ్లకు దిక్కేమి ?

సంగ : నేను దేవుడే యేడుగడని తలంచేవాణ్ని. తిక్కన చెప్పినమాటే నిజం.

కారణములేకయును నుప
కార పరత్వమున ఒరుల కార్యంబులకున్
వారని యలజడి పడియెడు
వారలు నూ యేడుగడయు వసుధకు నధిపా

యీ నిర్భాగ్యుల కొరకై అర్ధరాత్రియందూ, ఆవేదన పడే మీబోటి పరోపకార పారీణులే దిక్కు.

# కవిరాజవిరాజితము: దేశకవిత

## శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

కవిరాజుల పేర చిహ్నంగాఉన్న కవిరాజవిరాజితమందు చిత్ర కవిత కవకాశమున్నదో, లేదో పరిశీలించుట జిజ్ఞాస.

భారత స్త్రీపర్వములలో తిక్కన రచించిన కవిరాజ విరాజితములు నాలుగింటిలో ఇక్కడ రెండు మాత్రమే ఉదాహరింపబడుచున్నవి.

అనవుడు నిట్లను—నన్నరపాలున
కాతడు మోక్షము—నర్థి జగ
జ్జనులకు బెట్టుట—సన్మతిఁ గోరి వి
శారదు లాదర—సంభృతులై
యనఘ సుదుస్తర—మైన భవంబున
కచ్చగు నీ యితి—హాసము బో
ధన మహనీయ వి—ధంబునఁ జెప్పి రు
దాత్త గుణాశ్రయ—తామహితా
(స్త్రీ. 1—51.)

*  *  *  *

అనయము లోలతమై విషయ ప్రచ
యంబను దుస్తర పంకమునన్
మునుఁగుచు దేలుచునుండఁగ గాలము
ముట్టి రుజన్ జర నెవ్వగ పై
కొన దొరకొల్పి క్రమంబున నంగము
క్రొవ్వును జెల్వను బాపి ప్రయో
జన రహితంబుగఁ జేసి యపాత్రపుఁ
జా వొనరించుఁ గురుప్రవరా.
—(స్త్రీ. 1—55)

క్రీ. శ. 11 శతాబ్దమునకు పూర్వము రచించిన కవిజనాశ్రయమను రేచన ఛందస్సులో కవిరాజవిరాజితము బహుయతులతో రచియింపబడియున్నను, క్రీ. శ. 11 శతాబ్ది మధ్యకాలమందలి నన్నిచోడ—నన్నయాదులు తద్భిన్నముగా సాధారణ యతులు చెల్లించుట వైకల్పితము కాబోలు.

(హ)

వనతరమూర్తి సమస్త జగద్గురు
వంద్యు ననింద్యు సదాత్మ విదున్
—(కుమా. 11—214)

*  *  *  *

నిజ హృదయం బెఱిఁగించె లతాంగి క
వింద్య చరిత్రకు వేడుకతోన్
—(అర. 2—91)

ఇట్టి కవిరాజవిరాజితములు (స్త్రీ. 2—84, 2—132, 1—55) మూడు తిక్కన వ్రాసియుండినను, ఒకటిమాత్రము రేచన పద్ధతిగా బహుయతుల వ్రాయకపోలేదు.

(వకా)

రమును నొడంబడి—రాఁ గవిరాజ వి
రాజిత మన్నది—రామనిభా
—(కవిజ. పు. 31)

*  *  *  *

(బో)

ధన మహనీయ వి—ధంబునఁ జెప్పి రు
దాత్త గుణాశ్రయ—తా మహితా
—(స్త్రీ. 1—51)

ఇట్లు కవిరాజవిరాజితములలో వైకల్పికముగా సాధారణ యతులుకాని, బహుయతులుకాని చెల్లిన చాలునని తిక్కన లక్ష్య లక్షణము చాటుచున్నది.

గణముల కూర్పు—మార్పులతో ఈ కవిరాజవిరాజిత వృత్తములో ఎన్ని దేశికవిత లుద్భవిల్ల వీలున్నదో ఊహించుట తప్పుకాదు.

|||—|∩|—|∩|—|∩|—|∩|—|∩|—|∩|—|∩.

ఇది కవిరాజ విరాజిత పాదము. పాదాదియందలి (వ) మూడు లఘువులను (నల) నాలుగు లఘువులుగా కలిపి లెక్కించినచో అవన్నియూ ఇంద్ర—చంద్ర గణములుగా మారుట కవకాశము లేకపోలేదు.

||||—∩||—∩||—∩||—∩||—∩||—∩||∩.

ఇది కవిరాజ విరాజితమందలి షట్పదిపాదము. వృత్తములో గల కడపటి '(|∩)—వ' గణమును, '(∩|)—హ' గణమును సూర్యగణముగా మార్చుటకు వీలులేదన్నచో, తద్రూపాంతర మగు షట్పది పాదాంతములో రెండు సూర్యగణము లేర్పడు చంద్రగణము నొకటి పేర్చినచో నిర్దో

వాదకముగా సీసపాద మేర్పడును. వడిసీసమునో, ప్రాస వడిసీసమునో ఇష్టానుసారము షట్పదిలో కూర్ప వీలున్నది. 'ప్రాస ముల్ ముమ్మాఱు—నిర్యతి ఖాసిల్లగా—షట్పదాఖ్య' అనుట రేచన లక్షణ సమ్మతముకాదు. సీసమునకును, షట్పదికిని భేదము కనిపెట్టుటకే త్రిప్రాస పనికి వచ్చునేమోకాని, చతుష్ప్రాస కూడ చేర్చుట కవకాశమున్నది.

'త్రిద+కది'—రేచన

*　　*　　*　　*

'ప్రాస+బాసి+వాస'—చిత్రకవి.

ఇట్టి వైకల్పిక ప్రాసయతులు షట్పదులలో చెల్లుట నిర్వివాదము. షట్పదిలో యతులు నిర్యతులన్నను, ప్రాసయతులు చెల్లుననుట నిక్కము.

సీసములో వైకల్పికముగా వడివో, ప్రాసవడివో చెల్లించుట తప్పుకానప్పుడు, తద్రూపాంతరమగు షట్పదిలో కూడా వైకల్పిక యతులు చెల్లుట దోషముకాదు.

'మల్లియల పెల్లు కన్నడ కవితా వితానంబునుం బోలె షట్పద వృత్త విలాసభాసురంబై......రహి వహించె.......

—(పాండు 4—16)

ఇట్లు కన్నడ కవితలో షట్పదులున్నను తెనుగు కవితలో వీటి ప్రచారము లేకపోవుట చిత్రము. 'అన్నిన షట్పద మంజు గీతి'ని వ్యంగ్యముగా ప్రశంసించిన చిత్రకవి నన్నిచోడకవిరాజశిఖామణి కూడ కన్నడ షట్పదిని వ్రాయలేదు. తెనుగులో షట్పదులకు బదులుగా తద్రూపాంతరములగు సీసపద్యములు ప్రసిద్ధికెక్కినవి కాబోలు.

షట్పది పాదమును ద్విపాదిగా విభజించిన సీస పద్యపాదము లేర్పడును.

ఇ—ఇ+ఇ—ఇ
ఇ—ఇ+సూ—సూ

కవిరాజ విరాజితములో కడపటి '(IU)-వ.గణము మూడు మాత్రలు కలదైనను, అది '(UI)—హ, (III)—న' గణములవలె సూర్యగణములలో చేరకపోయినను, షట్పదిలో సూర్యగణము లేర్పడు చంద్ర గణములు వాడ వీలున్నది.

అనిమిషపతి పుర । మనిమిషాస్పద మయ్యె
ననలు ప్రోలెల్లను। ననల మయము
—(కుమా. 4—28)

ఇందలి 'వ—న' సూర్యగణములు చంద్రగణములలో కుదరవు. కాబట్టి అవి, 'నహ' చంద్రగణమగునట్లు మారవలసియుండును.

అనిమిషపతిపుర—మనిమిషాస్పద మయ్యె
ననలు ప్రోలెల్లను—ననల మ(య్యె)
—(కుమా. 4—28.)

ఇప్పుడీ పాదము సీసపాదమన్నను, షట్పదపాదమన్నను గణదోషములేదు. 'రల; నహ' చంద్రగణములతో వ్రాసిన షట్పదులన్నియు సీసపద్యము లగును.

ఆరగ్వధార్క జం—బీరకర్కోల మం
దార చందననారి కేరసింధు
వారకంకేలి ఖ—ర్జూర శాల్మలీ ఘన
సార చంపక బీజ పూరదేవ
దారు నల్లకి కర వీర గుగ్గులు పీత
సారపున్నాగన మేరు కర్ణి
కార ధాత్రీత్వచి సార వటల నహ
కార భల్లాతక పారిజాత
(భూరుహారూఢ పికరాజ కీర మద మ
యూర మధుకర మృదు మధు రారవముల
జారుతరమైన భూరికాం తార మహిమ
గారవించుచు జనుదెంచె మారుతంబు)
—(కుమా. 4—109)

ఈ పర్వ ప్రాసయతి సీసభాగమును పక్షాంతరముగా షట్పది యనుట కెట్టి లోటు లేదు. (అన్వయము లేకపోయినను లక్షణముకొరకు గీతమును ప్రత్యేకించవలసియుండును.)

పాదాంతమందలి '(UIUI)—రల' చంద్రగణము '(UI—UI)— హ—హ' సూర్యగణముల చేరికవల్ల ఏర్పడుచున్నది. ఇట్లే '(IIIUI) నహ' చంద్రగణము '(II—UI) న—హ' సూర్యగణముల చేరికవల్ల ఏర్పడుచున్నది. తక్కిన సూర్యగణములకూర్పు -'(III-III—UI—III) న—న, హ—న' లు చంద్రగణములలో లేవు కావున చిత్రకవితలో వీటి నుపయోగింపరాదు.

అంధకాసుర వైరి—యని తన కల్గనో
యని రుద్రుఁ డోడి మ—హాద్రి యెక్కె
—(కుమా. 11—103)

లోలాంబు జాలముల్—నీలాలకములుగా
బాల మృణాలముల్—గేలు గాఁగ
—(కుమా. 10—[illegible])

కల్పకుజంబులు గంబంబులుగ మీఁదఁ
గల్పలతాతతిఁ గలయఁ బర్వ
—(కుమా. 9—3)

పద్మసంభవు శిరః పద్మంబు సత్కేళి
సద్మంబుగాఁ గేలఁ బట్టి యాడ
—(కుమా. 7—51)

త్రిదశేంద్ర గణములు వెలయ నిర్మోడిఁడి
కదియనంత్యంబున జంద్రుఁ గూర్చ
—(షట్పదమగు)

రేచన షట్పదిలో ప్రాసయతి చెల్లించియుండగా, దాని నప్పకవి 'ప్రాసముల్ మునుమ్మాఱు' అని పెంచుట వైకల్పికము.

పై ఉదాహరణ పాదములన్నియు నన్నిచోడకవిరాజ శిఖామణి సీసపాదములైనను, ప్రాసభేదములనుబట్టి చూచి నచో అవి 'కల్ప—కల్ప' 'పద్మ—సద్మ—పద్మ' 'లోలా—నీలా'—'బాల–గేలు' అను చిత్రప్రాసయతులుగా మారుచున్నవి. ఇట్టి బహు ప్రాసయతులు సీసగర్భిత షట్పదిలో చెల్లుట క్రమ పరిణామమేకాని అక్రమముకాదుగద!

మొదట కవిరాజవిరాజితమునుండి ప్రాసయతిభేద ముతో షట్పది పుట్టగా, ఆ షట్పదినుండి వైకల్పికయతి భేదములతో సమసీసములు పుట్టినట్లు మార్గ—దేశి క్రమ పరిణామము తార్కాణించుచున్నది.

శీర్షకమునుండి సీసము పుట్టిన దనుటకంటే కవిరాజ విరాజితమునుండి విషమసీసము పుట్టి, పిమ్మటది '(వ)—హ' సూర్యగణముల మార్పుతో సమసీసమై గీతి నాశ్రయించినట్లు కనబడుచున్నది.

ఉత్సాహ వృత్తముక్రింద సమగీతిని చేర్చిన విషమసీస మనుటకంటె, కవిరాజవిరాజితముక్రింద ఎత్తు గీతిని చేర్చుట విషమగీతి జాతి లక్షణము.

కవిరాజ విరాజితములోను, అల్పాక్కరలోను ఇంద్ర, చంద్ర గణము లుండుటనుబట్టి చూచినచో అవి రెండు చేరి విషమ సీస మగుటకును వీలున్నదికాని, లక్షణగ్రంథము లీ విషమ సీసములను పేర్కొనలేదు.

చిత్రకవులు చంద్రగణ నియమముతో సీసగర్భిత షట్పదిని వ్రాయ వీలున్నట్లే, వైకల్పిక చిత్రయతులతో షట్పది గర్భిత కవిరాజ విరాజితమును కూడ వ్రాయ వీలున్నది. ఇది,

మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశికవితఁ
బుట్టించి తెనుం
గున నిలిపిరి

అను ఛందోక్రమపరిణామమును తార్కాణించుచున్న ట్లున్నది. చంపకమునుండి రగడ మధ్యాక్కరాదులు, తరుతోజ మండి ద్విపదలు, కవిరాజవిరాజితమునుండి షట్పద సీసము లేర్పడుట మార్గ—దేశి చిత్రము.

# జలదగీత

శ్రీ శనగన నరసింహస్వామి

స్వాగతవాక్యులై నభము చాయ గనుంగొను జీవులన్ స్పృశా
భోగమునం గరంచి మునుముందుగ వచ్చిన చల్లగాలి నీ
యాగమనంబు దెల్పెను మహాత్మ! నవాంబుద! యెంతదూరమం
దాగితివోయి రమ్ము! మహితాంధ్రపదంబును శీతలింపగన్

వేసగి వెట్టకున్ విసిగి వేసరు ప్రాణులజూచి నెమ్మదిన్
గాసిలి బాష్పవారినయనంబుల మోయుచు బోవు సజ్జనా
గ్రేసర! మల్లెపూవు లొలికించుగతిన్ ప్రథమోదబిందువ
ర్షాసుధ తెన్గునేలపయి రాల్చి సమర్చలు సంగ్రహింపుమా!

ఎండిన వృక్షవల్లరుల కించుక స్వాదుజలంబు వంచి క
ట్టెండ గృశించి చెన్నఱిన యేళ్లను నించి విమూర్ఛిత ప్రజా
షండము జల్లులం దడపి శ్రావ్యరవంబున పోయి పోయి పెన్
గుండల గ్రుమ్మరించు మదిగో నెఱబీటలువాఱు చేలలోన్.

శంపాకన్యలగూడి మింటిపయి లాస్యంబాడు నీ పెంపునన్
సొంపుంగాంచి కృషీవలుల్ పొలములన్ దున్నం బ్రయాణింతు రా
చెంపం దీవ్ర సమీరణాహతికి గాసింబొంది నానాకృతిన్
సంపాదించి క్షణక్షణంబును నిరాశం బెంచకోయీ ఘనా!

తలపయి శక్రచాపమును దాల్చి యొయారముగా బ్రమోదగ
ర్జల విలసిల్లు నీకు సదృశత్వము జాటుట కీ ధరిత్రి రం
గుల పురి విప్పియాడు నవకోమల బర్హి మహేంద్రచాపముం
దలపయి దాల్చుకొన్నది ఘనా! పరికింపుము నీ ప్రభావమున్

గుడిసెల కాపురంబయిన కూటికి బియ్యము నిండినం జలిన్
వడకుచునున్నగాని నలువంకల జల్లులు కొట్టికోసినం
బిడుగులు రాలుచున్న మెఱుమిట్లు ఘటించుచు మించులాడినం
బడుగులు నిన్నుజూచి రసభావములం బులకింతు రంబుదా!

ఏ లలనా వినూత్న విరహేద్వ్యడో దౌత్యము బూనుచునన్ భయాం
దోలన దాలకేగకుము తోయదశేఖర! రేపు మాపులుం
గాలిన పొట్టలం గడపు కర్షకపాళికి ప్రేయసీ వియో
గాలపనంబు లుండునె, ధనాఢ్యులకున్ విరహంబులుండునే?

# మహత్తర పరివర్తనము - VII

## [విదేశీ ద్రవ్య సహాయం]

### శ్రీ జాన్ స్ట్రాచీ

ఈ పద్ధతి ఎట్లా పనిచేస్తున్నదో, నేను వారు చెబుతున్న దానినిబట్టి, నేను కొద్దిగా చూచిన అనుభవాన్నిబట్టి మాత్రమే చెప్పగలను. ఐదుసంవత్సరాలక్రిందట నేను ప్రొఫెసర్ గాల్‌బ్రయత్‌తో కలిసి, ఒరిస్సాలో కొన్నిప్రాంతాలను చూచాను. ఇప్పుడు ఇక్కడికివస్తూ, దారిలో భారతదేశంలో ఆగినప్పుడు ఆ దేశంలో నేనెప్పుడు చూడని ఇతర ప్రాంతాలను చూడడానికి బదులు, నేను మునుపు చూచివున్న ప్రాంతాలకుపోయి చూడటమే బాగుంటుందని అక్కడికే పోయాను. అవి పూర్వం నేను చూచినప్పటిలాగానే వున్నాయో, లేక ఏమన్నా మార్పు చెందాయో, మార్పుచెందితే ఎట్లా మార్పు చెందాయో చూద్దామని పోయాను. ఒరిస్సారాష్ట్రంలో నేను చూచిన ఆ ప్రాంతం భారతదేశంలో బాగా వెనకబడివున్న ప్రాంతాలలో ఒకటి. నాతో గూడా అప్పుడు ఈ ప్రాంతాలను చూచిన ప్రొఫెసర్ గాల్‌బ్రయత్ ఇప్పుడు భారతదేశంలో అమెరికా రాయబారిగా ఉంటున్నారు. మేము ఇద్దరము కలిసి, అప్పుడు మేము చూడకల్గినంతా, ఒరిస్సా పల్లెపట్టులను చూచాము. అప్పుడు, ఆ అయిదు సంవత్సరాలక్రిందట అక్కడ వ్యవసాయ విస్తరణ కేంద్రాలులేవు. అప్పుడే వాటిని గురించి అక్కడ మాట్లాడుకుంటున్నారు గాని, మాకు ఒక్కటిగూడా కన్పించలేదు. అక్కడప్పుడు పని గూడా ఏమీ జరుగుతున్నట్లులేదు. ప్రాకృతమైన ఆ భారతీయ కుగ్రామాలకు సంబంధించిన జన జీవితం కొన్ని వేల యుగాలుగా ఎట్లా ఉందో, అప్పుడు అట్లాగేఉంది.

ఇప్పుడు నేను ఒకనెలక్రితం అక్కడకు మళ్లీ పోయినప్పుడు కథఅంతా వేరుగాఉంది. ప్రతి కొద్దిమైళ్లదూరంలోను "వ్యవసాయ విస్తరణ కేంద్రానికి దారి" అనో, లేక "వ్యవసాయ విస్తరణ ఎరువుల డిపోకు దారి"అనో బల్లలు కన్పించాయి. కనీసం నేను పూర్వం చూచిఉన్న ఆ మారుమూల ప్రదేశంలో, జరిగిన ఐదుఏండ్లలోను, 1958 నుండి 1961 లోపల పెద్ద అభివృద్ధే కన్పించింది. కొత్తరకపు ఉత్పత్తి పద్ధతులకు రైతులను మాలిమి చేయడానికి పెద్ద ప్రయత్నాలే జరుగుతున్నాయి.

పూరీ జిల్లా కలెక్టరు నాతో ఏమి చెప్పాడో మీకు చెబుతాను. నేను, ఆయనతో అన్నాను: "ఇది అంతా రైతులమీద ఎంతవరకు పని చేస్తోంది?" ఆయన అన్నాడు: "కొద్ది కొద్దిగా పని చేస్తోంది."

నేను అడిగాను: "ముఖ్యంగా ఎందువలన?"

ఆయన అన్నాడు: "బాగుంది. ఇందులో ముఖ్యమైన విషయం ఇది. రైతుల బిడ్డలు వారిని కొత్తరకపు వ్యవసాయ పద్ధతులకు దిగవలసిందని గోల చేస్తున్నారు. ఎందుచేతనంటే వాళ్లకు బడులకు వెళ్లాలని, చదువుకోవాలనివుంది. మధ్యాహ్నపు పూట భోజనం కావాలనివుంది. కొంచెం మంచి బట్టలు వేసుకోవాలనివుంది. ఇదంతా కలిసిరావాలంటే, వారి కుటుంబం, తమకు సరిపోయే పంటనేగాక, ఇంకా కొంచెం ఎక్కువగా ఆర్జించుకోవలసి ఉంటుంది. ఆ ఆర్జన ఎట్లా? పండినధాన్యం కొంత అమ్మి డబ్బు చేసుకోవాలి."

భారతదేశంలో నేను విన్న బహు సంగతులలో ఉత్సాహజనకంగాను, ప్రోత్సాహకరంగాను వున్న ఒక్క సంగతి ఇది. ఒకపనిని సరిగ్గా చేయడానికి ఇదే సరియైన మార్గమని నేను అనుకోకుండా ఉండలేకపోతున్నాను. ఆసియా రైతులను సమష్టి వ్యవసాయ క్షేత్రాలలోకి మళ్లవేసి, వారికి ట్రాక్టర్లు, కొత్త యంత్రాలు, ఇంకా ఇతరమైన పనిని తగ్గించే సాధనాలు ఇవ్వడంలో అర్థం కనుపించదు. ఈ రైతుకు భూమిఅంటే మాంచి ప్రేమ. ఈ దేశాలలో పనిచేసేవారు అతిగా ఉన్నారు. ఆసియాలో, ముఖ్యంగా ఆసియా గ్రామ సీమలలో కావలసింది పనిని తగ్గించే ప్రయత్నాలు చేయడంకాదు. భూమిని రక్షించుకునే పనులు జరగాలి. ఇక్కడ ఎకరాకు ఎంత పంట ఎక్కువ అయినదన్నది ముఖ్యంగాని, మనుష్యుడు ఒక గంటలో ఎంత పనిని హెచ్చుగా చేస్తున్నాడన్నదికాదు. ఇక్కడ పనిచేసేవాళ్లు అధికంగావుండి, ఆ పనికిఅయిన క్షేత్రం పరిమితంగావుంది. ఇది ఇక్కడ ముఖ్యమైన విషయం. అందువల్ల ఈ పనిని సాధించడానికి చైనా అనుసరిస్తున్న మార్గంకంటే, భారతదేశం అనుసరిస్తున్న మార్గమే సముచితమైనది.

ఇది కాలంమీద కాని తేలదు. ఇంకా కొంతకాలందాకా ఇందులో ఏదీ బుజువుకాదు. ఎవ్వరూ పూర్తిగా దీనిని బుజూ చేయలేరు. కాని, ఇకనుంచీ ఇందుకు కావలసిన సాక్ష్యం లభిస్తుంది. 1966 నాటికి భారతదేశపు మూడవ ప్రణాళిక పూర్తిఅయ్యేసరికి దీనిని బుజూచెయ్యడం సాధ్యపడవచ్చు. అప్పటికి భారతదేశం అనుసరిస్తున్న ఈ పద్ధతి ఏమవుతుందో తెలుస్తుందనే నేను భావిస్తున్నాను.

# మహత్తర పరివర్తనము - VII

భారతదేశపు యింకో ముఖ్య అవసరాన్నిగూర్చి గూడా క్లుప్తముగా మాట్లాడుతాను. ఆ దేశము పైకిరావాలంటే ఇది చాలా ముఖ్యమైనది. ఆ దేశానికి, ఇతరదేశాల సహాయము కావాలి. ఆ సహాయాన్ని ఆదేశము సంపాదించుకోవాలి. అదిలేకుండా ఆ దేశము ఈ కార్యాన్ని సాధించలేదు. సాధించడము అసాధ్యము కూడాను. చైనా విషయము కూడా అంతే. చైనాకు రష్యా నుండి ఎంతో సహాయము లభిస్తున్నది. ఏమైనా భారతదేశము ప్రజాస్వామ్యదేశము గనుక, ప్రజాస్వామిక ప్రభుత్వముకల దేశము కనుక, ప్రపంచములోని ఇతర దేశాలనుండి డబ్బును పుచ్చుకోకుండా, పరిశ్రమలను పెట్టుకోవాలనే ఆశను నెరవేర్చుకోలేదనే చెప్పవలసి ఉన్నది.

దీనినిగూర్చి విపరీతముగా తీసుకోకండి. తాను ఎంత పెట్టుబడిని పెట్టవలసి ఉన్నదో, దాదాపుగా అంత పెట్టుబడిని ఇతర దేశాలనుంచి భారతదేశము తెచ్చుకోవాలని ఎక్కడాలేదు. అయితే ఎంతమాత్రపు డబ్బు ఈవిధముగా కావలసిఉంటుందో నాకు ఇంకా తెలియదు. కాని, ఆ దేశముపెట్టే మొత్తపు పెట్టుబడిలో కొద్దిమాత్రపు మొత్తాన్నే ఈవిధముగా ఇతర దేశాల నుండి సంపాయించుకోవలసి ఉంటుందని నేను అనుకుంటున్నాను. ఎక్కువ భాగము పెట్టుబడి భారతదేశము తన అంతట తానే పోగుచేసుకోవలసిఉంది. దేశములోనే దానిని సమకూర్చుకోవలసి ఉన్నది. భారతదేశపు డబ్బునే భారతదేశపు ఆర్థిక వ్యవస్థలోనికి రాబట్టుకోవలసి ఉన్నది. ఇది ఇట్లా చేసుకోగా, భారతదేశమునకు సాలుకు 350—450 మిలియనుల పౌనులు విదేశాలనుంచి అవసరము కాగలవని ఆర్థికవేత్తలు లెక్కవేస్తున్నారు. ఆ తేడాను భారతదేశము, ఇతర దేశాలనుండి సంపాదించుకోవాలి. ఇది ఇట్లా ఎందుచేతనంటే, ఆ డబ్బుతో ఆ దేశము కొనగల వస్తువులు ఇంకా అక్కడ కావలసిన సంఖ్యలో ఉత్పత్తి కావడములేదు. యంత్రాలు మొదలైన చాలా రకాల సామగ్రులను భారతదేశము తయారు చేసుకోగలదు. కాని, కావలసినన్ని ఉత్పత్తి చేసుకోలేదు. ఉదాహరణకు, అక్కడ వారు ఇప్పుడు భారీ విద్యుత్ పరిశ్రమను నెలకొల్పుకుంటున్నారు. ఆ పరిశ్రమకు అవసరమైన, జటిలమైన యంత్రాలను—ట్రాన్స్‌ఫార్మర్లు మొదలైనవాటిని-- వారు ఇతర దేశాలలో ఖరీదు చేయవలసిఉన్నది. ఆ యంత్రాలు గూడా దేశములో ఉత్పత్తి అయ్యేదాకా ఆగడముఅంటే, పని జరగడము ఏండ్లకు ఏండ్లు ఆలస్యమైపోతుంది. అందువల్ల నేను చెప్పిన వేగముతో అభివృద్ధి పనులు జరగాలి అంటే, వారు ఇతర దేశముల దగ్గరనుండి డబ్బును సహాయముగా పొందక తప్పదు. మరీ పెద్ద మొత్తాలుగా కాదనుకోండి. తగుమాత్రపు మొత్తాలను పుచ్చుకోవాలి. సం. ఒకటికి 350—400 మిలియనుల పౌనుల చొప్పున పుచ్చుకోవాలి.

ఈ మొత్తము మరీ పెద్దదిగాగాని, లేక మరీ చిన్నదిగా గాని ఉన్నదని మీకు అనిపిస్తున్నదా! బహుశా అది ఆ రెండు రకాలుగాను అనిపిస్తూ ఉండదు. అది స్పష్టమైన అభిప్రాయాన్ని దేనిని కల్గించదు. కాని, అది నిజముగా పెద్ద మొత్తమేమీకాదు. ఆ మొత్తమంతా ఒక్క బ్రిటన్‌నుంచో, లేక పశ్చిమ జర్మనీ నుంచో, లేక ఒక్క అమెరికానుంచో మాత్రమే రావలసివుంటే, అది పెద్ద మొత్తము అనిపించవచ్చు. కాని, ఆ మొత్తాన్ని ప్రపంచములో అభివృద్ధి చెందిన ఆ యా దేశాలమీద పంచి సంగ్రహించేపక్షములో, అది తగుమాత్రపు మొత్తమే అవుతుంది. ఆ మొత్తము బ్రిటన్‌కుగాని, అమెరికాకుగాని, జర్మనీకిగాని, ఫ్రాన్సుకుగాని, ఇటలీకిగాని ఇవ్వడము కష్టము అనిపించదు. ఎవరివంతు సహాయము వారు ఇవ్వడము కష్టముకాదు. ప్రపంచము ఇట్లా సహాయము చేయవలసిన దేశాలు—మలయా, సింగపూరులతో సహా ఇంకా చాల ఉన్నాయి అని అనుకున్నా, భారతదేశానికి కావలసిన సహాయమును సమకూర్చడము ఈ దేశాలకు అసాధ్యముకాదని, అవి సహాయము చేయగలవని, నాకన్నా సమర్థులయినవారు భావిస్తున్నారని నేను మీకు హామీ ఇస్తున్నాను. అదీగాక, భారతదేశము తనకు అవసరమైన ఈ మొత్తాన్ని అంతా ఒక్క పాశ్చాత్యరాజ్యాల దగ్గరనుంచే పుచ్చుకోదు. రష్యా దగ్గరనుంచి గూడా కొంత సంపాయిస్తుంది. ఇది వివేకంతో కూడిన ఆలోచన అని నేను అనుకుంటున్నాను. నిజానికి ఇప్పుడే భారతదేశము రష్యా దగ్గరనుంచి సహాయమును పొందుతున్నది. రష్యన్‌లు అప్పుడే ఆదేశమునకు ఒక ఉక్కు కర్మాగారాన్ని నిర్మించి ఇచ్చారు. జర్మనులు ఇంకొకదాన్ని నిర్మించారు. బ్రిటన్ ఇంకో ఉక్కు కర్మాగారాన్ని నిర్మించి ఇచ్చింది. ఈ పద్ధతి చాలా బాగుంది. ఇది తెలివిగల పద్ధతి. ఈ మూడు దేశాల సాంకేతిక నైపుణ్యం ఎటువంటిదో భారతదేశము పోల్చిచూచుకోగల్గుతోంది. ఈ దేశాల దగ్గరనుంచి సహాయాన్ని పొందుతోంది. అందువల్ల మూడో ప్రణాళికకు కావలసిన విదేశీ ద్రవ్యములో ఉదాత్తముగానే కొంత డబ్బును రష్యానుండి భారతదేశము పొందగలదనే నేను అనుకుంటున్నాను. అంటే, ఈ భారములో కొంత రష్యా గూడా భరిస్తుంది అని అర్థము. పాశ్చాత్య దేశములలో మేమే ఈ అంత బరువును మొయ్యాలని అనుకోవడములేదు. నేను ఈ విషయము కచ్చితముగా చెప్పగలను. ఇందులో కొంత బరువును రష్యా మోస్తానంటే మేము సంతోషిస్తాము. ఉక్కు కర్మాగారములలో, నూనెశుద్ధి కర్మాగారములలో, ఇంకో ఒకటి, రెండు పరిశ్రమల కార్యక్రమములలో రష్యనులు, మరీ పెద్ద మొత్తాన్ని కాకపోయినా, కొంత ఉదాత్తంగానే డబ్బు పెడుతున్నారు. ఇట్లా మొత్తంమీద, మూడవ ప్రణాళికకు తనకు సం. ఒకటికి కావలసిన 350—400 మిలియనులు మొత్తాన్ని భారతదేశము పొందగలదనే నేను భావిస్తున్నాను. ఈ మొత్తము చిటికలో లభిస్తుందని నేను అనడంలేదు. డబ్బు ఇవ్వడానికి బ్రిటన్, అమెరికా, జర్మనీ, ఇంకా ఇతర దేశాలు ఊరికే నీలుగుతాయి. గోల చేస్తాయి. అమ్మో, మేము ఇవ్వలేము అంటాయి. భారతదేశము దివాలా తీసింది, నాశనమైపోయింది, అక్కడ అంతా ఘోరంగా ఉంది అని మన అందరికి చెబుతాయి.

నేను ఒకప్పుడు ఒక భారతీయ స్నేహితుడితో అన్నాను. ప్రతి రెండు సంవత్సరాలకు భారతదేశం దివాలా తీస్తూ ఉండే

విధానం మీకు మంచిది అని. ఎందుచేతనంటే, చివరికి ఎట్లాగూ కావలసిన డబ్బు భారతదేశానికి లభిస్తుంది. ఎప్పుడు ఇబ్బందిలో పడ్డా, మావాళ్లు బయటికిలాగుతారు. అందువల్ల ''అంతా నాశనం అయిపోయింది'' అని గోల విన్పించినప్పుడు, ఎవ్వరూ భయ పడవలసిందిలేదు. ఆ మాట విన్పిస్తూనే ఉంటుంది. డబ్బు పుడుతూనే ఉంటుంది. భారతదేశానికి దమ్మిడీ ఇచ్చేదిలేదు, అక్కడ అంతా పాడైపోయింది అని మీకు చెబుతూ ఉంటారు. అసలు భారతదేశమే అట్లా మాట్లాడాలి. అందుకు కారణంవుంది. పాశ్చాత్య దేశాలు ఇంతవరకు ఆ దేశానికి దీర్ఘకాలికమైన ఏర్పాట్లేమీ చేయలేదు. వ్యాపార సరళిలో ఏ పనీ చేయలేదు. కాని, మేము అట్లా చేస్తాము. చివరికి ఇవ్వవలసిన డబ్బు ఎట్లాగూ ఇస్తాము. పాశ్చాత్య దేశాలలో ప్రభుత్వాలు కొన్ని పెద్ద తప్పులు చేస్తూ ఉంటాయి. కాని, భారతదేశం విఫలం అవుతూంటే చూస్తూ కూర్చుండేలంత తప్పు చేస్తామని నేను అనుకోను. భారతదేశంలో ఆరంభమైన మహా ప్రారంభాన్ని—దానిని నేను ప్రయోగము అని అనను–అది అంతకంటే గొప్పది–వట్టిపోనీయడము, నా మనస్సుకు, పాశ్చాత్య ప్రపంచము ఆత్మహత్య చేసుకోవడము అనే. ఆదేశము పెట్టుబడిదారీ పద్ధతిని, సామ్యవాద పద్ధతిని కలబోసి, ప్రజాస్వామికమైన రాజకీయ యంత్రాంగములో, ఒక మహాకార్యాన్ని సాధించాలని పెట్టుకున్నది. పాశ్చాత్యరాజ్యాలు బాగా చిలిపిగా కనపడే తప్పులను చేయగలవు. కాని, ఈ ప్రయత్నం విఫలంఅయ్యేట్లు చేస్తాయని మాత్రం నేను అనుకోను. అందువల్ల, భారతదేశము విజయము పొందడానికి అవసరమైన రెండో షరతు, విదేశీద్రవ్యము అవసరాలు తీరడము అన్నది, కూడివస్తుందనే చెప్పవలసివుంది.

ఈ విజయానికి రాజకీయ పరిస్థితులు గూడా ఇంకా చాలా కలిసిరావలసివున్నవి. ముఖ్యంగా దేశపు ఐకమత్యమును రక్షించు కొనడమువంటివి. శ్రీ నెహ్రూ ఇంకో పదిఏళ్లు బ్రతికితే ఇది నెరవేరుతుందని కొందరు భావిస్తున్నారు. నేను ఇక్కడికివస్తూ, దారిలో ఆయన్ను చూచాను. ఆయన ఇంకో పదేళ్లేకాదు, ఇరవైఏళ్లు గూడా బ్రతకాలన్న పట్టుదలతో ఉన్నట్లు కన్పించారు. ఆయన మంచి ఉత్సాహంగా ఉన్నారు. అయితే, ఆయన గూడా అందరిలాగానే మర్త్యుడు. ఒకవేళ ఆయనపోతే, భారతదేశము ముక్కలు ముక్కలైపోతుందనుకోడం తప్పన్న నమ్మకం నాకు కల్గింది. భారతదేశం ఒక మనిషితలభారతంకాదు. ఆ దేశాన్ని సమర్థులు, అనుభవజ్ఞులు అయినవాళ్లు నడుపుతున్నారు. వీరు కాంగ్రెసుపార్టీ నాయకులు. వీరిలో శ్రీ నెహ్రూ గొప్పవాడంటే నేను అంగీకరిస్తాను. అంతేగాని, భారత మంత్రిమండలిలో ప్రభుత్వపు పగ్గాలను పట్టుకొని నడిపించేవారు ఇంకా ఎవ్వరూ లేరనడం పెద్ద పొరపాటు. నెహ్రూ మరణిస్తే, అది పెద్ద నష్టము. కాని, అంతమాత్రముతో భారతదేశం నడవలేదు అనుకోడం మాత్రము తప్పు. ఇట్లా అనేవారిలో నెహ్రూయే మొదటివారు కాగలరు.

ఇప్పటి ఈ రోజు గడిచింది. ఇప్పుడు భారతదేశం ఏమి చేస్తున్నది, ఏమి చెయ్యడంలేదు, చేస్తుంటే బాగా చేస్తున్నదా లేక పాడుచేస్తున్నదా మొదలైన విషయాలను ఊరికే తర్జన భర్జనలుచేసే ఉద్దేశం నాకులేదు. దానినిగూర్చి ఎవరి అభిప్రాయం వారిది. అది ఇక్కడ ముఖ్య విషయంకాదు. ముఖ్యమైనది ఇది. చైనా ఎట్లాగో, భారతదేశం గూడా అట్లాగే పెద్ద ఎత్తున పరిశ్రమలను పెంపొందించుకోవడానికి పోటీపడి పని చేస్తున్నది. మొదలుపెట్టడం కొంచెం నెమ్మదిగా మొదలు పెట్టింది నిజమే. కాని, ఆ అభివృద్ధి నిలకడగా కొనసాగుతోంది. మన్నికగా ఉంటున్నది. భారతదేశం ఎంతవేగంతో అభివృద్ధి చెందుతున్నదో తేలడము సంగతి ఎట్లావున్నా, ఇప్పటి ప్రపంచములో ఆదేశము కీలక దేశము. ఆ దేశమే గనుక విఫలమైతే, ఆ దేశములోనే గనుక ప్రజాస్వామ్య పద్ధతి ప్రభుత్వము పతనము చెంది, సైనిక నియంతృత్వమో, లేక కమ్యూనిస్టు నియంతృత్వమో ఏర్పడితే (బహుశా ముందు ఒకరకము నియంతృత్వము, తర్వాత ఇంకోరకము నియంతృత్వముకు లోనుఅయితే కావచ్చు) అప్పుడు ప్రపంచంలో ఊతం పూర్తిగా కమ్యూనిస్టుల వైపుకు ముల్లు చూపుతుంది. అందువల్లనే, అంతా భారతదేశం అభివృద్ధిమీద ఆధారపడి ఉన్నది.

మీరు సింగపూరువారు గనుక, దీనిని చూస్తూ ఉండవచ్చు. అందువల్ల మీకు లాభం ఉంటుంది. ఇంకో కొద్ది సంవత్సరాలలో భారతదేశముయొక్క ఆర్థిక అభివృద్ధి ప్రాభవము ప్రపంచంలో ఈ ప్రాంతములో అధికము కావడం మీరు చూస్తారనే నా నమ్మకము. త్వరలోనే ఈ లక్షణం మీకు కన్పిస్తుంది. వచ్చే సంవత్సరము (1962) లో సింగపూరు, మలయాలు 30 వేల టన్నుల భారతదేశపు ఉక్కును దిగుమతి చేసుకోబోతున్నట్లు నిన్నో, మొన్నో నాతో ఒకరు అన్నారు. ఆ దేశంలో కొత్తగా నిర్మాణమైన ఉక్కుమిల్లుల మొదటిసరుకు అది. ఈ పద్ధతే పోను పోను ఎక్కువౌతుంది. మీకు పడమరగా ఒక పెద్ద దేశము అప్పుడు మీకు ఎరుకలోకి వస్తుంది. మీకు ఉత్తరంగాఉన్నదేశము ఎట్లా కన్పిస్తుందో, అట్లాగే ఈ దేశము కన్పిస్తుంది.

# స్వాతంత్ర్యానంతరం కవిత్వం పల్చబడినా వచనరచన బాగా సాగుతోంది

శ్రీ డి. రామలింగం

వెనుక ఒకప్పుడు చిలుకూరి నారాయణరావుగా రనుకుంటాను, "భారతి సంపాదకులుండి ఉండి చాలా చిక్కయిన ప్రశ్న ఒకటి వేస్తూ ఉంటారు" అన్నారు. 'భారతి' రజతోత్సవం చేసుకునే సందర్భంలో 'సజీవ భాష అనగా ఏమిటి?' అని సంపాదకులు ప్రశ్నించారట. అలాగే ఇప్పుడూ "భారత దేశంలోను, తెనుగు దేశంలోను స్వాతంత్ర్యం అనంతరం ఉత్తమ సాహిత్యం వచ్చిందా ? లేక అంతకు పూర్వం ఉత్తమ సాహిత్యం వచ్చిందా ?" అని ప్రశ్న వేశారు. ఇది వారు నేటి సాహితీపరుల నందరినీ ఉద్దేశించి వేసిన ప్రశ్న అనుకుంటాను. మనకు స్వాతంత్ర్యం వచ్చి పదిహేనేళ్లు నిండుతున్నాయి గనుకనూ, స్వాతంత్ర్యం పొందిన జాతి సర్వతోముఖంగా వికాసం పొందుతుందన్న నమ్మకం ఒకటి ఉంది గనుకనూ ఇంతదూరం వచ్చాక ఒకమారు మన సాహిత్యం బాగోగులను పరామర్శ చేసుకోవడం మంచిదే.

మొదట భారతదేశం సంగతి ఆలోచిద్దాము. దేశంలోని 14 భాషలు తెలిసినవా రెందరో వుండరుగనుక మనం ఆ సాహిత్యాలను చదివి గాక ఆ సాహిత్యాలను సృష్టిస్తూ పరిశీలిస్తూ పోయినవారి అభిప్రాయాలను గమనించి సంగతి సందర్భాలను తెలుసుకొనవలసి వస్తున్నది. ఆ అభిప్రాయాలలోను అన్నీ సరియైనవి కాకపో వచ్చును. కాని మనలో చాలామందికి గత్యంతరము అదొక్కటే అవడంచేత వారిలో పెద్దల అభిప్రాయాలను పరిగణించుదాము. పోయిన సంవత్సరం 'కల్చరల్ ఫోరం' వారు 'ఆధునిక భారతీయ సాహిత్యము' అన్న విషయంపై జరిపిన చర్చాగోష్ఠిలో పాల్గొంటూ విఖ్యాత రచయిత డా. ముల్కురాజ్ ఆనంద్ "మనం పరదాస్యం నుంచి విముక్తులమైన పిమ్మట నుండి ఆరంభమైన దశలో ఒక విధమైన శూన్యస్థితి ఏర్పడిపోయింది. తిరుగుబాటుకూ, విప్లవానికీ అలవాటు పడిపోయిన మన రచయితలు ఎవరిని విమర్శించాలో తెలియని అయోమయ స్థితిలో పడిపోయ్యారు. ఏర్పడిన కొత్త ప్రభుత్వం మనదే నయ్యె ..... అప్పటినుంచీ సమకాలిక జీవిత స్థితిగతులు మన మేధావులకు అంతు చిక్కకుండా అయిపోయ్యాయి" అన్నారు. అదే గోష్ఠిలో పాల్గొన్న ప్రముఖ గుజరాతీ రచయిత శ్రీ ఉమాశంకర్ జోషి "వెనుకటికంటె ఇప్పుడు రచనలు పుస్తకాలు అసంఖ్యాకంగా వెలువడుతూ ఉన్నమాట నిజమే. కాని భారతీయ సాహిత్యంలో యేదో ప్రతిష్ఠంభన ఏర్పడినట్లనిపిస్తూవుంది. ఇప్పుడు మనవాళ్లు చేసే రచనలలో యే ఒక్కటీ మన ఆధునిక సాహిత్య నిర్మాతల రచనలతో సరితూగేదిగా కన్పట్టడంలేదు. ఇందుకు కారణం మనం నేల విడిచి సాము చేయడమే. స్థానబలం లేదు. మళ్లీ భారతదేశంలో మరొక జాగృతి—మరొక పునరుజ్జీవనోద్యమం రావాలి. అది తప్పకుండా వస్తుంది" అన్నారు.

ఈ అభిప్రాయాలు ఇట్లా ఉండగా ఇటీవల ఢిల్లీలో ఒక హిందీ ప్రచురణ సంస్థవారు ఒక చర్చాగోష్ఠి ఏర్పాటు చేశారు. వారు చర్చకు పెట్టిన విషయం : "స్వాతంత్ర్యానంతరం ప్రజాజీవితానికీ, భారతీయ భాషలలో వెలువడుతూవున్న సాహిత్యానికీ మధ్య అంతరము పెరుగుతూ పోవడానికి కారణ మేమిటి ?". ఈ గోష్ఠిలో పలుభాషల రచయితలు పాల్గొన్నారు. పంజాబీ రచయిత, పత్రికా సంపాదకుడూ అయిన శ్రీ మోహన్‌సింగ్, పంజాబీ రచయితలు కొందరు దేశానికి స్వాతంత్ర్యం రావడంతోటే సమస్యలన్నీ తీరిపోయాయని భావించి స్వంత ప్రయోగాల నీలిమేడలలో కూర్చొని తోచింది వ్రాసుకుంటున్నారని చెప్పారు. మళయాళీ రచయిత శ్రీ ఎస్. జి. నాయర్ "స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే మళయాళంలో కవిత, నవల, నాటకం, కథానిక ఒక్కసారిగా వికసించినట్లే వికసించి మూణ్నాళ్ల ముచ్చటగా ఉండి చప్పబడిపోయ్యాయి. నేటి సాహిత్యరంగం బంజరుభూమి. ఒక దారి లేదు. ఒక ప్రయోజనం లేదు. శక్తి అంతకన్నా లేదు. రచయితలకు తమపైగాని దేశంపైనగాని విశ్వాసం లేదు. ప్రజ లెవరో వారికి తెలియదు. రచనా శిల్పం మర్మాలు

తెలీవు. కాబట్టే వారికీ ప్రజలకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడి ఉంది.'' అన్నారు. ఉర్దూ రచయిత శ్రీ జఫర్ పయామీ ''లోతైన గంభీరమైన రచనలు నానాటికీ కరవైపోతూ ఉన్న మాట నిజమే. కాని యిందుకు రచయితలను నిందించి ప్రయోజనము లేదు. ప్రజలూ పత్రికలవారూ ఎలాంటి రచనలు కావాలని అంటున్నారో అటువంటి రచనలే వస్తున్నాయి. అయినా రచయిత కూడా సమాజంలోని ఒక వ్యక్తి. అతని కిప్పుడు పెద్ద కాంతులేవీ కన్పించడంలేదు. రెండు దశాబ్దాల క్రిందట దేశంలో ఉన్న సాంఘిక, రాజకీయ భావాలు యిప్పుడు అతణ్ణి ఆకర్షించడం లేదు. కనుకనే ఏమి వ్రాయాలి ? ఎవరికోసం వ్రాయాలి అన్న జిజ్ఞాసలో అతడు పడిఉన్నాడు'' అన్నాడు. కాని మరొక ప్రసిద్ధ ఉర్దూ రచయిత శ్రీ సజ్జాద్ జహీర్ ''చర్చకు పెట్టిన శీర్షికను తాను ఆమోదించజాలననీ, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా ఉర్దూలో ఉత్తమ రచనలు వెలువడుతూ ఉన్నాయనీ, ప్రజా జీవితానికి సాహిత్యం సన్నిహితంగానే ఉంది'' అనీ చెప్పారు. ఇక హిందీ రచయితలు ముక్తకంఠంగా స్వాతంత్ర్యం తరువాత హిందీలో మరింత మంచి రచనలు వెలువడ్డాయని చెప్పుకున్నారు. మరి ఆత్మాభిమానం కోసమే అలా చెప్పుకున్నారో లేక నిజంగానే హిందీలో ఉత్తమ సాహిత్యం వెలువడిందో సరిగా తెలియదు. గోష్ఠికి అధ్యక్షత వహించిన హిందీ నవలా రచయిత శ్రీ యశపాల్ మాత్రం పూర్తిగా హిందీ రచయితల అభిప్రాయంతో ఏకీభవించినట్లు లేదు. అటూ యిటూగా అధ్యక్షోపన్యాస మిచ్చాడు. మాయాగుప్త అనే బెంగాలీ రచయిత మాత్రం నేటి బెంగాలీ సాహిత్యం గ్రామాల పట్టణాల జీవితంతో నిండిఉందనీ, ప్రజా సమస్యలు ప్రజల ఆందోళనలు అందులో వ్యక్త మవుతున్నాయనీ, ప్రజల నుంచి పలాయనం చిత్తగించే ధోరణి బెంగాలీ రచయితలలో లేదనీ ఒకవేళ ఏ రచయిత అయినా అట్లా పరారీ అయితే పాఠకులు అతడికి తగు హెచ్చరిక చేసి దారికి తీసుకువస్తారనీ అన్నారు. కాని ఆ మధ్య బొంబాయిలో జరిగిన రచయిత్రుల గోష్ఠిలో సుబ్రత బెనర్జీ అనే బెంగాలీ రచయిత ''స్వాతంత్ర్యోద్యమం రచయితలకు కొన్ని విలువలను, లక్ష్యాలను చూపెట్టింది. అప్పుడొక ఆదర్శం వారిని కార్యోన్ముఖులను చేసి ఒక లక్ష్యంవేపు నడిపింది. స్వాతంత్ర్యాన్ని పొందిన తరువాత ప్రజలకు రచయితలకూ మధ్య గల యీ సంబంధం పోయింది. సంతృప్తి ఏర్పడింది. తిరిగి క్రొత్త గమ్యం ఏదీ లేకపోయింది'' అని చెబుతూ ''ఏవో క్రొత్త ప్రయోగాలు జరుగుతున్నాయి. రచనా వ్యాసంగం సజీవమై చైతన్యవంతమై ఉందనడానికి అదే గుర్తు'' అన్నారు. తెలుగు సాహిత్యాన్ని గూర్చి నేను నా అభిప్రాయం తెలుపుతూ శీర్షికలో వెలిబుచ్చబడిన భావం కొంతవరకు సమంజసమే ననీ, ఆంధ్రలో స్వాతంత్రోద్యమంతోపాటు రాష్ట్రోద్యమం కూడా సాగిందనీ, ఆ జంట ఉద్యమాలలో ప్రబోధాత్మకమైన రచనలు వెలువడ్డాయనీ, ఆ తరువాత కాల్పనికోద్యమం, అభ్యుదయోద్యమం వంటివి వచ్చాయనీ, తెలుగు రచయితలు పాశ్చాత్య రీతుల నన్నిటినీ అవలంబించి రచనలు చేశారనీ, ఇప్పుడా పాశ్చాత్య దేశాలలో కూడా కొత్త ఏమీ లేకపోయేసరికి నియో క్లాసిజం వైపు పోయి, అది కూడా సంతృప్తి యివ్వక ఏమీ పాలుపోని స్థితిలో ఉన్నారనీ, అయితే తెలుగు కథానిక మాత్రం బాగా అభివృద్ధి చెందుతూ ఉందనీ, స్త్రీలు ఎక్కువమంది ఇప్పుడు కథలు, నవలలూ రచిస్తున్నారనీ, మా 'భారతి'' పత్రికలో కూడా ఇప్పుడు ఇటువంటి చర్చ ఒకటి జరుగుతూ ఉందనీ తెలిపాను. తమిళం, అస్సామీ, కాశ్మీరీ, ఒరియా, మరాటీ, గుజరాతీ సాహిత్యాలను గూర్చి చెప్పినవారు లేరు. కన్నడ సాహిత్యమును గూర్చి ఒక మిత్రుడు అభిప్రాయం వ్రాసి పంపాడు గాని ఆయన ఇదమిద్ధమని తేల్చి చెప్పలేదు. ఆంధ్రేతర సాహిత్యముల పరిస్థితి ఇది.

మన తెలుగులో నిజంగా, నిస్సందేహంగా స్వాతంత్ర్యానికి పూర్వమే ఉత్తమ సాహిత్యం వచ్చింది. ''కన్యాశుల్కం'' నుంచి మొదలుపెడితే అప్పటినుండీ వెలువడ్డ నాటక సాహిత్యం, రాయప్రోలు ఖండ కావ్యాలు, ''ఆంధ్ర ప్రశస్తి'', ''యెంకి పాటలు'', ''కృష్ణపక్షం'', ''ఏకాంతసేవ'', ''సౌందరనందము'', ''శివతాండవం'', ''శివభారతము'', 'పానశాల', బసవరాజు అప్పారావు గేయాలు, ''మహాప్రస్థానం'' వంటి కావ్యాలూ, 'మాలపల్లి', 'ఏకవీర', 'నారాయణరావు', 'అసమర్థుని జీవయాత్ర', 'చివరికి మిగిలేది' వంటి నవలలూ, చలం రచనలూ, దీక్షితుల కథలూ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి కథలు, కాంతం కథలు, ''కూలిజనం'' వంటి కథలూ వెలువడ్డాయి. స్వాతంత్ర్యం తరువాత వాటిని మించినవిగాని లేక వాటితో సరితూగగలవిగాని రానిమాట యదార్థం. అయినా 'స్వాతంత్ర్యము వచ్చిన తరువాత కవుల నుంచి ఉత్తమ సాహిత్యము వచ్చిన దనుకోను నేను' అన్న శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవింపజాలను. దాశరథి ''మహాంద్రోదయం'', బాలగంగాధర తిలక్ గేయాలు, విశ్వనాథ ''రామాయణ కల్పవృక్షము'', గోరా శాస్త్రి నాటికలు, బుచ్చిబాబు కథలు, రాచగొండ విశ్వనాథ శాస్త్రి నవల ''అల్పజీవి'', ఆయన ఇటీవల రచించిన అనేక కథలు, శ్రీదేవి 'కాలాతీత వ్యక్తులు' ఉత్తమ రచనలని అంగీకరించక తప్పదు. అయితే నేటి వార, మాస పత్రికలలో అసంఖ్యాకరిగా కథలు, నవలలు, కవితలు వెలువడుతున్నాయి గాని అవి సాహిత్య మూల్యాలను పరిశీలించేవారిని కదిలించి వారిచేత మళ్లీ మళ్లీ చదివించలేకపోతున్నాయి. ఇందుకు కొన్ని కారణా లున్నాయి. నేను పరిశీలించ గలిగినంతవరకు ఆ కారణాలు ఇవి : మన రచయితలలో పేరుపడ్డవారూ, క్రొత్తగా వ్రాసేవారూ రచనయే ముఖ్యవృత్తిగా పెట్టుకొని లేరు.

# స్వాతంత్ర్యానంతరం కవిత్వం పల్చపడ్డనా వచనరచన బాగా సాగుతోంది

ఉద్యోగం వల్లనో, మరే ఇతర వృత్తివల్లనో జీవిస్తూ తామూ ఏదో వ్రాయాలని వ్రాస్తున్నారు. కనుక అది వారి సరదా వ్యాపకంగానే ఉండిపోతున్నది గాని ఒక తపస్సుగా, గాఢమైన కృషిగా ఉండడంలేదు. కనుకనే లోతుగల రచనలు రావడం అపురూపంగా ఉంది. మరికొందరు రచయితలు సినిమా రచయితలు కావడంచేత వారు ప్రతిభావంతులై ఉండీ స్వచ్ఛమైన రచనావ్యాసంగానికి వారికి తీరికలేదు. ఉద్యోగాలు చేసుకుంటూ ఎక్కడో ఉండి రచనలు చేసే రచయితలు దేశ ప్రజా జీవితానికి దూరంగా ఉండడంచేత వారి రచనలు ఊహ కల్పనల తోనే నిండి ఉంటున్నాయి గాని ప్రజల వాస్తవ జీవితం వాటిలో ప్రతిబింబించడంలేదు. ఇక ప్రజల మధ్యనే ఉండి రచనలు చేసేవారు కొత్తవారు కావడంవల్లా, కొందరు ఉత్తమ శిల్పులు కాకపోవడంవల్లా శిల్పం కొరవడి అవగాహన లోపిస్తున్నది. దేశంలో రాజకీయంగానో, సాంఘికంగానో, సాహిత్యకంగానో ఏదో ఒక ఉద్యమం ఉన్నప్పుడు అది కూడా కొంతవరకు ఉత్తమ కావ్యాలు అవతరించడానికి కారణమవుతుంది. కవులు రచయితలు ఒక ఉత్సాహంలోపడి మంచివో చెడువో కొన్ని రచనలు చేస్తారు. వాటిలో మంచివి కొంత కాలానికి పైకి తేలి పాఠకుల దృష్టి నాకర్షిస్తాయి. నిజంగా ఉద్యమమని చెప్పడానికి వీలు లేనటువంటి—తెచ్చిపెట్టుకొన్న ఉద్యమం వంటి కాల్పనికోద్యమంలో సైతము తెలుగులో ఉత్తమ కావ్య ఖండికలు వెలువడ్డాయి. "వైతాళికులు" చూస్తే యీ విషయం మనకు బోధపడుతుంది. మరి యిప్పుడు మనకు ఏ ఉద్యమమూ ఉన్నట్లు కన్పించదు. సామాజికాభివృద్ధి ఉద్యమం ఉందిగాని అటువంటి వాటివల్ల ఉత్తమ సాహిత్యం వెలువడుతుందని చెప్పలేము. రచనలు వెలువడడానికి దేశంలోనూ, సమాజంలోనూ కొన్ని కాగే సమస్యలు ఉండాలి. మన పాత సమస్యలు మన రచనలలో చాలావరకు కొట్టిన పిండి అయిపోయాయి. అవి ప్రేరణ కలిగించడంలేదు. స్వాతంత్ర్యానంతరం కొన్ని కొత్త సమస్యలు ఉద్భవించాయి గాని వాటిని సమన్వయించి ఉత్తమ కావ్యములు వెలార్చగల ప్రతిభావంతు లింకా తయారు కాలేదు. స్వాతంత్ర్యానంతరం దాకా ఎందుకు, స్వాతంత్ర్యోద్యమంలో, గాంధీయ యుగంలో మన ఆంధ్రదేశంలోనే ఎన్ని సంఘటనలు ప్రజల నుర్రూత లూగించలేదు.? అవి కావ్యాలకు ఇతివృత్తా లయ్యాయా ? చాలా కాలేదు. ఇవన్నీ గాక, ఎన్ని పనులున్నా, ఎన్ని గొడవలూ, ఈతిబాధలూ ఉన్నా వాటి నన్నిటినీ ఒక ప్రక్కకు నెట్టి రవీంద్రునివలె, ప్రేమ్‌చంద్ వలె నిజాయితీతో, ఒక ఆదర్శంతో, లక్ష్యశుద్ధితో తపస్సువలె ఒక ధ్యేయంతో కవులు, రచయితలు కృషి చేసినప్పుడు ఉత్తమ సాహిత్యం తప్పకుండా ఆవిర్భవిస్తుంది. వీటి అన్నిటికి తోడు సరియైన నిష్పాక్షికమైన, నిరంతరమైన సారస్వత విమర్శన కూడా ఉండాలి. ఇవి మన కింకా ఒనగూరలేదు. జీవితం ఆర్థికంగా మనల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తూవుంది. దానినే తట్టుకోలేకుండా ఉన్నాము. వచ్చేతరంవారికోసం మనం నిజంగా యిప్పుడు త్యాగంచేసి అనేక యిబ్బందుల కోర్చుకుంటున్నాము. ఈ సంక్లిష్టస్థితిలో నిలకడ, ప్రశాంతత లభించకుండా ఉన్నాయి. ఇంతకూ కవులు ఋషులైతే తప్ప కార్యంలేదు. రచయితలు విస్పష్టమైన దృక్పథం దీక్ష గలవారు కాకపోతే యథాస్థితి తప్పదు.

"సాహిత్య విద్యార్థి" గారు 'ఉత్తమ సాహిత్య లక్షణాలు కవిత్వంలోనే లేకపోతే గద్య రచనలలో ఎక్కడ ?' అన్నారు. వారితో నేను ఏకీభవింప జాలను. ఒకప్పుడు పద్య కావ్య రచన ఉచ్చస్థాయిలో ఉండి గద్య రచన హీన స్థాయిలో ఉండడం కద్దు. నవలా రచన, కథా రచన విజృంభించినపుడు కవితారచన అప్రముఖ స్థాయికి పోవచ్చు. రష్యాలో మహోత్తమమైన నవలలు కథానికలు వెలువడ్డ కాలంలో గొప్ప కవు లెందరున్నారు ? గొప్ప పద్య కావ్యాలేవి వెలువడ్డాయి ? ఇప్పుడు మన ఆంధ్రదేశంలో నిజం చెప్పాలంటే కవితా రచన పల్చబడిపోయి, నవలారచన కథారచన బహుళంగా, కొంత చక్కగా కూడా సాగుతున్నాయి. అందుచేత ఈ దశను పరిశీలించి అంచనా కట్టేప్పుడు వచన రచనలకు హెచ్చు స్థానమిచ్చి కొంత హెచ్చు శ్రద్ధ వాటిపట్ల చూపవలసి ఉంటుంది. మళ్లీ శ్రీశ్రీ వంటి ప్రతిభావంతుడు పుట్టేదాకా మన కవితారంగం మరికొంతకాలం ఇప్పటిలాగే మందకొడిగా ఉండేట్టు ఉంది. కాని మన గద్య రచనల (Prose fiction) పరిస్థితి అలాకాదు. ప్రతిభావంతులైన నేటి కథా రచయితలు కొందరు మరొక్క అడుగు ముందుకువేసి సత్యం, శివం, సుందరముల నారాధించి దీక్షతో రచనలు చేశారంటే 1970 రాకపూర్వమే తెలుగు సాహిత్యం ఖండాంతర ప్రశస్తి పొందగల సూచన లున్నాయి.

[ఈ చర్చను ఇంతటితో ముగించుచున్నాము—సం.]

# ఉర్దూకవుల గీతాలు

శ్రీ సదాశివ

అణఁగియణఁగి సుందర దరహాస రేఖ
లామె సురుచిరాననముపై నవఘుళించె;
నార! బాలభానుని కిరణాళిచేఁ బ్ర
సూనవాటిక శోభాయమానమయ్యె!

నా ప్రణయగాథ సత్యమైనదియె, కాని
కలవు కొన్ని కల్పన లలంకారమునకు

అశ్రువులు జారు మధుపాత్ర లవధరించి,
హృదయమునఁదోఁచు మాదకాకృతి యెవరిదో?

అశ్రు శూన్యంబు నేత్రమెట్లగును? మౌక్తి
కంబువలననే గద శుక్తిగౌరవంబు

మఱవలే నామె కనులలో మసలుకైపు
చషకము గ్రహింపఁడే నిల్వఁజాల నింక

ఎవ్వరైన నీపై రెత్తిరేని, యొడిసి
యొడిసి పట్టుకొందును గాయపడిన గుండె

ప్రణయగోపనోద్దేశంబు వలనఁ గాని
తొణఁకి తెప్పలంటిన యశ్రుకణములెన్నొ?

అలవడియె నెట్టిటో హృదయమున కోర్కి
స్మృతికి నీవు రాఁగా యథాస్థితికి వచ్చె

అక్కటా! మృత్యుసమయాన నర్థమయ్యె
కాంచినది కల, వినినది గాథయగుట

ఆమెయు నెఱుంగలే దారయఁగ నిజావ
లోకన ప్రభావము; తదాలోకనాప
హారితసర్వస్వ నీ మర్మముఁగవలయు

కాంతి వంతమౌ స్వీయముఖమ్ము సమ్ము
ఖమున దీపమ్ము నిలిపి, "యేకడకు శలభ
మరుగునో చూడవలె" నను నా లతాంగి

# మానవ దుఃఖం లోతులు తరచిన విశ్వరచయిత విలియం ఫాక్నర్

## శ్రీ లోకనాథ్ భట్టాచార్య

విలియం ఫాక్నర్ ఇక లేరు. జులై 6 న, హృద్రోగంతో మరణించారు. అప్పుడు ఆయనకు అరవై నాలుగేండ్లు.

మరణం అన్నది ఎవరికైనా రాసిపెట్టివుంది. కాని, ఫాక్నర్ మరణించారు అని వినగానే, ఆయనఅంటే భక్తి



విలియం ఫాక్నర్

ప్రపత్తులు వున్నవాళ్ళందరకు దిగ్భ్రాంతి కల్గింది. ఫాక్నర్ అనేది ఒక సంజ్ఞ మాత్రమే అయినా, ఆ సంజ్ఞలో ఎంతో ఇది ఇమిడిఉండటమే అందుకు కారణం. ఫాక్నర్ ఒక వ్యక్తి అయినా, ఆ వ్యక్తి తక్కిన వ్యక్తులకంటే, వ్యక్తి అన్న అర్థం కంటే, ఉన్నతుడు. ఫాక్నర్ రచయితే అయినా, రచయిత శబ్దానికి అతీతుడైనవాడు.

ఫాక్నర్ అమెరికా దేశపు నవలాకారుడు. అంతమాత్రమేనా ఆయన ఉనికి? కాదు. ఆయన ప్రపంచ పౌరుడు. అమెరికా దక్షిణప్రాంతపు ఒకానొక రాష్ట్రంలో ఆయన నివాసం. కాని, ఆయన రచనలకు ఆధారభూతమైన సర్వేతివృత్తము మానవుని విషాదాత్మమైన వీరభావనం. యోక్నపాటఫా కౌంటీ అన్నది ఫాక్నర్ ఉపజ్ఞమైన ఒక లఘు ప్రపంచం. సర్వ సంపన్నమైంది అది. ఆయన రచనలకు దాదాపుగా అన్నింటికి అదే రంగస్థలం. మిసిసిపీరాష్ట్రంలో వాయవ్యంగావున్న ఒకానొక ప్రాంతంలో ఫాక్నర్ నివాసస్థానం వుంది. దానికి ప్రతిబింబమే ఇది. ఒక్క ఆకారంలోనేకాదు. అన్ని విధాలుగాను అది అదే. అక్కడి మనుష్యులు, వారి పనులు, వారి నీతి, వారి నియమాలు, వారి ధర్మం—సర్వం అక్కడినుంచే తెచ్చి, ఆయన తన ఉపజ్ఞాలోకంలో బిగించివేశారు. ఆయనచుట్టూ ఆవరించిఉన్న ప్రపంచం అది. దానితో ఆయనకు తత్త్వతః సరిపడలేదు. అందులోనుండి ఆంతరమైన సంఘర్షణ ప్రాదుర్భావం చెందింది. ఆ సంఘర్షణయొక్క నిర్వ్యూహమే ఆయన రచననిండా అనంతంగా నిండిపోయింది. అయితే, యోక్నపాటఫాలో ఆయన ఒక్క అమెరికా దేశపు దక్షిణ రాష్ట్రాలసంగతినే తాత్త్వికదృష్ట్యా నిరూపిస్తున్నారా? దాని కథఅంతా ఆ అమెరికా దక్షిణ రాష్ట్రాలకథా? కాదు. అది అంతకంటే అధికము, వీక్షణము అయింది. దాన్ని ఆధారంగా చేసుకొని, ఆధునాతన ప్రపంచంయొక్క ఉనికికి సంబంధించిన సర్వ ప్రధానమైన సమస్యలను ఆయన చర్చించారు. ఆ సమస్యలను, దానిద్వారా లక్షణయా, వెలుగులోకి తీసుకురాగల్గారు. అందులోనే సత్యదర్శనంకోసం ఆయన ఉత్తేజితుడై జరిపిన భూతార్థగవేషణం విద్యమానం అవుతున్నది.

ఇప్పుడు ప్రపంచంలో బహుసంవాదాలకు గురి అవుతున్న రచయితగా ఫాక్నర్ అభ్యుద్ధానం చెందినారు అంటే, అందుకు రెండు కారణాలు ఉన్నాయి. (1) రచయితగా ఫాక్నర్ పాఠకులముందు ఉంచినన్ని సమస్యలను మరి ఏ ఇతర రచయితా ఉంచలేకపోవడం. (2) రచయితలను, వారి హక్కులను గురించి

ఫాక్నర్‌కువున్న విశిష్ట అభిప్రాయాలు, రచనను గురించి ఆయనకువున్న విస్పష్టమైన భావాలు మరొకరికి లేకపోవడం—ఈ విషయాలపై ఆయన వ్రాతలు సకల సాహిత్యానికి అనువర్తిస్తాయి. సాహిత్య రచనకు సంబంధించిన పరమసత్యం తాను ఈ చెప్పినదే అని గూడా ఆయన భావించారు.

1950 లో నోబుల్ బహుమానాన్ని స్వీకరిస్తూ, ఫాక్నర్ ఈ విషయాన్ని గూర్చిన తను సిద్ధాంతాన్ని చాలా వివరంగాను, స్పష్టంగాను పేర్కొనిఉన్నారు. మనుష్యునికి అంతం ఉన్నదని నేను అంగీకరించను అని, మానవుడు అవిచ్ఛేదుడు అవడమేగాక ప్రభవిష్ణువు గూడా అని ఆయన అప్పుడు అన్నారు. ఆయన అన్నమాటలు ఇవి: "మానవుడు అంతవంతుడు అనే వాదాన్ని నేను ఆమోదించను. అయితే మానవుడు అమరుడు, అతడు అవిచ్ఛేదుడు గనుక అమరుడు అని చెప్పడం తేలిక. ప్రళయంవచ్చి తుది ఘడియలను గంటలుగా మ్రోగుతూ, అంతిమసాయంవేళా రక్తిమలో నిష్ప్రచార నిరామయస్థితిలో వ్రేలాడుతున్న తుచ్ఛమైన శిలలమీదుగా ప్రవిలీయం చెందుతూవున్న సమయంలో గూడా అప్పుడు ఒక వాక్కు, ఒక్క ధ్వని, ఒక్క నాదం వినిపిస్తుంది. అది ఆ మానవుని కంఠం. అది అల్పిష్టమైనది కావచ్చు. కాని, అది అక్షయమైనది. అది అవినాశి. అవిరతము, నిరంతరము విపులము అయింది. అది అట్లా నదిస్తూనే ఉంటుంది. అందువల్ల నేను మానవుడు అంతవంతుడు అనే వాదాన్ని తృణీకరిస్తున్నాను. తిరస్కరిస్తున్నాను. మానవుడు అవిచ్ఛేదుడు, నిరంతరుడు అనే కాదు నేను నమ్మేది. అతడు ప్రభవిష్ణువు అని గూడా నమ్ముతాను. అతడు అమరుడు. ఎందుచేత? జీవజాలంలో అతనికి ఒక్కడికే ఈ అవినాశి అయిన వాక్కుఉంది కాబట్టి అని కొందరు అంటారు. నేను అనేది ఒక్క అందువల్లనేకాదు. మానవునికి ఆత్మ అన్నది వుంది. అందుచేత. ఆ ఆత్మ ఎట్టిది? దాని శక్తి ఏమిటి? లక్షణం ఏమిటి? అది ఎందుకు సమర్థమైంది? ఆ ఆత్మ సానుక్రోశమైంది. కరుణాధుర్యమైంది. త్యాగశీలం కలది. ఆ ఆత్మ చిరంతనము, అవిచ్ఛేదము అయింది. అట్టి ఆత్మ ఉన్నందువల్ల, అది మానవునియందు ఉన్నందువల్ల, ఆ మానవుడు అమరుడు, నిత్యుడు అవుతున్నాడు. ఒక కవి, ఒక రచయిత—ఈ ఆత్మ గుణాలను గురించి గానం చేయవలసి ఉంటుంది. అది వారి ధర్మం. మరి ఆ మానవుని కడచినకాలం గూడా ఉజ్వలమైంది. ఆకాలంలో అతను పొందిన, అనుభవించిన సుఖాలు ఉన్నాయి. దుఃఖాలు ఉన్నాయి. అతడు చూపించిన దయవున్నది. దాక్షిణ్యం ఉన్నది. పొందిన గౌరవం ఉన్నది. మర్యాదవున్నది. చూపించిన ధైర్యం ఉన్నది. సాహసం ఉన్నది. ప్రదర్శించిన కారుణ్యము ఉన్నది. చేసిన త్యాగం ఉన్నది. కవియైనవాడు సర్వమైన ఈ ఆత్మ గుణాలను—మానవుని పురా చరిత్రను చరితార్థం చేసినవాటిని—గానం చేసి, మానవుని హృదయాన్ని ఔన్నత్యానికి తార్చి, అతడు అమరుడు, నిరంతరుడు అయ్యేట్లు చెయ్యాలి. అది అతని విశేషమైన అధికారం. మనుష్యుణ్ణి గురించి గానం చెయ్యడంతోనే కవి తృప్తిపడి లాభం లేదు. ఆ మనుష్యుడు చిరంతనుడు కావడానికి, ప్రభవిష్ణువు కావడానికి తన గానం పూతగాఉండేటట్లు, ఆధారస్తంభం అయ్యేట్లు కూడా చూచుకోవాలి."

ఫాక్నర్ పల్చని మనిషి. నెమ్మదియైన మనిషి. తన్ను గురించి ఆయనే ఒకసారి ఇట్లా చెప్పుకున్నారు: "నేను సాహిత్యపరుణ్ణికాదు. కథలు చెప్పడంకోసం బ్రతుకుతున్న మనుష్యమాత్రుణ్ణి." ఇట్టి ఈయన మిసిసిపీ రాష్ట్రంలో 1897 సెప్టెంబరు 25 న న్యూ ఆల్బనీ అనే ఒకానొక చిన్న పట్టణంలో జన్మించారు. 1926 నుంచి రచన ప్రారంభం చేశారు. అంటే, అప్పటిదాకా ఏమీ రాయలేదనికాదు. అప్పటినుంచి నిజంగా వ్రాయడం ప్రారంభం చేశారు. ఆయన మొదటి నవల "సోల్జర్స్ పే" అన్నది. ఆరు వారాలలో దాన్ని ఆయన రచించారు. అది 1926 లోనే ప్రకటింపబడింది. ఆ మరు సంవత్సరం అంటే 1927 లో "మస్క్విటోస్" అనే నవల బయటికి వచ్చింది. ఇది న్యూ ఆర్లియన్సులోని స్వైరజీవులను గురించి ఆయన వ్రాసిన అవహేళన గ్రంథం. 1929 లో గాని ఆయన ఉద్గ్రంథ రచనం ప్రారంభం చెయ్యలేదు. ఆ సంవత్సరం "సార్టోరిస్" అనే నవలను ఆయన వ్రాసారు. దీనితోనే ఫాక్నర్ ఉపజ్ఞమైన యోక్నపాటఫా ప్రపంచం ముఖం చూసింది. దీని తర్వాతనే దీనితో విడని ముడిని పడివున్న నవలలు, కథలు వచ్చాయి. ఈ నవలలోని గాని, కథలలోనిగాని పాత్రలు ఒక విస్పష్టమైన, అనుస్యూతమైన, సంగతమైనట్టిగాని అర్థాన్ని, సంతృప్తికరమైన అర్థాన్ని మనకు వివచ్యమానం అయ్యేట్లు చెయ్యవు. ఆ అర్థం పూర్తిగా అవగతం కావాలిఅంటే ఫాక్నర్ ఉపజ్ఞమైన ఊహా ప్రపంచం యొక్క చరిత్రఅంతా మనకు తెలిసి ఉండాలి. తెలిసి చూడాలి. ఈ ప్రకరణంలో చూస్తేనే దాని సాంతత్యంవల్ల అతని అర్థపద్ధతి యేమో మనకు అర్థం అవుతుంది. అంతేగాని, ఆ అర్థం వేనిలో నిహితం చేశాడో, ఆ పుస్తకాలను అచ్చులో చదివినంతమాత్రం చేత అర్థంకాదు. అది, ఆయన సాధించిన ఘనకార్యం.

"సార్టోరిస్" నవలను ప్రకటించింది మొదలు తన ఈ పద్ధతిని, 'యోక్నపాటఫా' పద్ధతిని "సౌండ్ అండ్ ఫ్యూరీ", "ఏజ్ ఐ లేడైయింగ్", "శాంక్చ్యుయారీ", "లైట్ ఇన్ ఆగష్ట్" "అబ్సలాం, అబ్సలాం", "ది హామ్లెట్", "గోడౌన్ మోజెస్ అండ్ అదర్ స్టోరీస్" "ఇంట్రూడర్ ఇన్ ది డస్ట్", "రెక్వియం ఫర్ ఏనన్" మొదలైన అన్ని గ్రంథాలలో నిహితం చేసి, నిరూపించి ఉన్నారు. "ఫేబుల్" అన్నది ఈ వరుసకు చెందినదికాదు. దీనిని ఆయన 1954 ప్రకటించారు. ఇది ఫాక్నర్ దృష్టిలో చాలా గొప్పది. (ఇతరులు ఆయన రచించిన "ది సౌండ్ అండ్ ఫ్యూరీ" గొప్పది అంటారు.) కాని, "ఫేబుల్" లో ఆయన గాథను, వైయక్తికమ్ము అయిన మహార్థాన్ని ఇముడ్చగల్గినానని భావించారు. అందచేతనే అది తాను వ్రాసిన అన్ని గ్రంథాలలోను ప్రశస్తమైనదని, తన రచనలకు శేఖరప్రాయమైనదని అన్నారు. 1954 లో దీనికి పులిట్జర్ బహుమతి లభించింది. అంతకు నాల్గు సంవత్సరాలకుముందు ఆయన నోబుల్ బహుమానాన్ని పొందారు.

# మానవదుఃఖం లోతులుతరచిన విశ్వరచయిత విలియం ఫాక్నర్

ఆ తర్వాత గూడా ఫాక్నర్ కొన్ని గ్రంథాలు వ్రాశారు. "ది టౌన్", "ది మేన్షన్" మొదలైనవి. ఆయన చివర వ్రాసిన గ్రంథం "ది రైవర్స్" అన్నది. తన మరణానికిముందు ఫాక్నర్ వ్రాస్తూ, వర్జీనియా విశ్వవిద్యాలయంలో అమెరికన్ సాహిత్యాన్ని గురించి పాఠాలు చెబుతూ గడిపారు. ఆయనకు వేట ఒక వ్యసనం. మిత్రులతో తరుచుట వ్యాగయా వినోదియై చరించేవారు.

అమెరికాదేశపు దక్షిణప్రాంతాన్ని గురించి ఆయన తన "యోక్నపాటఫా" నవలల్లో వ్రాసినదంతా కొంత చూచింది; కొంత తన చిన్న తనంనాటి విషయాలు జ్ఞాపకం ఉన్నది వ్రాశారు. అంతేగాక, కొంత ఆ యా వంశాల తాలూకు సంప్రదాయాలు ఆధారంగా గూడా రచించారు. ఈ మహాపురాణంలో ఆయన మనుష్యుని దుఃఖాన్ని సారం చూచారు. అదే మానవునియొక్క మాహాత్మ్యం అని ఆయన భావించారు. ఆ మాహాత్మ్యం—అపజయంవల్ల వచ్చిందికాదు, శరణాగతివల్ల కల్గింది.

అమెరికా దక్షిణ రాష్ట్రాలలోఉన్న దోషం అంతా, ఫాక్నర్ లెక్క ప్రకారం, అక్కడి జీవితవిధానంలో వుంది. అక్కడ మనుష్యులు, మనుష్యుల్ని పీడిస్తారు. ముందు రెడ్ ఇండియన్ లను పీడించారు. తర్వాత నీగ్రోలను పీడించుకుని, పీల్చుకుని తిన్నారు. అది ఆ నేలకు శాపం కొట్టినట్టు కొట్టింది. ఆ తర్వాత అమెరికాలో అంతర్యుద్ధం జరిగింది. అప్పుడు ఈ పూర్వపు పాపానికి ఇంకో కొత్త పాపం తోడైంది. అదో కొత్త ప్రపంచం అయిపోయింది. నైతిక కైతవం, ప్రతారణం అక్కడ ప్రధాన ధర్మాలైపోయినాయి. యాంత్రికమైన సామర్థ్యం ఒకటి పెరిగిపోయింది. దీనికి అక్కడి తెల్లజాతి కుటుంబాలన్నీ, తరము తరువాత తరముగా "జోహా కుంటు" అయిపోయినాయి. వారు అట్లా దానికి వశంకాక తప్పలేదు. ఇష్టంలేకపోయినా, దానిముందు వారు తలవంచవలసి వచ్చింది. దానితో ప్రాత, క్రొత్తలకు సంఘర్షణ ప్రారంభమైంది. "సార్టోరిస్"లో ఫాక్నర్ ఈ సంఘర్షణను చిత్రించారు. ప్రాతపద్ధతులకు చెందిన సార్టోరిస్‌వంటివారు క్రొత్తగా తలఎత్తిన జాతికి "స్నోప్సెస్‌కు" ఎదురు నిల్వలేక విజితులైపోయినారు. సాంప్రదాయికమైన నియమాలు, నిబంధనలు వారిని ముందుగానే విజితులను చేశాము. తమ విరోధుల మీద ఈ జాతి మనుష్యులు, ఈ నియమాలను, నిబంధనలను పెట్టుకొని, ఆ విరోధులు ఉపయోగించే ఆయుధాలను—అనగా అనుసరించే పద్ధతులను, ప్రయోగించే ఎత్తులను—ఉపయోగించలేనివారైపోయినారు.

ఇప్పుడు ఈ జనం తిరిగి ఔన్నత్యాన్ని పొందాలంటే, తిరిగి విజయాన్ని సాధించాలంటే, నైతిక దృష్టిని తమలో మేల్కొల్పుకోవాలి. ఆ జాతికి ఆ దృష్టి కౌమారదశలో ఉండే ఉంది. తర్వాత లుప్తమైపోయింది. దాన్ని వారు తిరిగి సంపాదించుకోవాలి. అంతేగాక నీగ్రోలను కట్టుకోవాలి. ఆ నీగ్రోలబలం స్థిరమైంది. వారిని గురించి ఆచరించబడిన పాపాన్ని తితిక్షద్వారా, సహిష్ణుత ద్వారా కడిగివేసుకోవాలి. "ఇంతమాత్రంతో ఆ చేసినపాపం పోదు. అది ఇంకా అట్లాగే నిల్చిఉంటుంది. అయితే మనుష్యుని అమరత్వానికి సంబంధించిన చరిత్ర యావత్తు అతడు అనుభవించిన దుఃఖంలో, పొందిన అనుతాపంలో నిహితమైవుంది. పాపనిష్కృతికోసం దైవత్వాన్నికోరి, అతను సాగించే పోరాటంలో వుంది" అని ఫాక్నర్ అన్నారు.

అమెరికా దక్షిణ రాష్ట్రాల గతాన్ని, అనుభవాన్ని, కీర్తిని నిస్పృహను, వైఫల్యాన్ని పడుగుగా, పేకగా చేసి ఫాక్నర్ మానవ జీవిత దుఃఖగాథాపటాన్ని అల్లారు. ఆయన రచన మృదువైంది, అపరుషమైందికాదు. స్వార్థాన్ని, సమున్నతిని, ఆక్రమణాన్ని ఆవేశాన్ని, చిత్తవిక్షేపాన్ని, మూర్ఖత్వాన్ని, బుద్ధిమాంద్యాన్ని ఆయన ఎప్పుడు తక్కువచేసి చెప్పలేదు. తగ్గించలేదు. ఎప్పుడూ మరిచిపోవడానికి వీలులేనివిధంగా మనుష్యుణ్ణి గురించిన యథార్థాన్ని గానం చేశారు. అతని సమస్యలను చిత్రించారు. అతని సాహసాన్ని, ధైర్యప్రదర్శన సామర్థ్యాన్ని, సహనం చూపగల దక్షతను వర్ణించారు. ఆయన కథలు లేక వానిలో చాలా కథలు—ఒక పక్షంగాచూస్తే ప్రాకృతులు ప్రదర్శించే దౌర్జన్యాన్ని గూర్చిన కథలను పోలి గోచరిస్తాయి. కాని, వాటినే, ఫాక్నర్ దృష్టిని అవలంబించి, పరిశీలనచేస్తే, మానవుని దుఃఖము మహోత్సాహంగా గానం చేయబడటం గోచరం అవుతుంది. ఫాక్నర్‌లో ఉన్న అద్భుతం అదే. ఒకరు కావాలనుకుంటే, ఎదిరివారు గూడా అయిఉండటమే అది. అతని జీవితం "మనవాత్మయొక్క కష్టంలో, నిష్కారంలో" పునీతమైంది.

[యు. ఎస్. ఐ. ఎస్. సౌజన్యంతో]

# దధివామనస్తోత్రము: మరికొన్ని క్రొత్త విషయములు

శ్రీ వై. సీతారామశర్మ

శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తిగారు పై శీర్షికతో నొక చిన్ని వ్యాసము ఆగస్టు 1962 భారతిలోఁ బ్రకటించి, "ఇంకను విశేషము లున్న విషయాలు తెలుపవలెనని మనవి" అని కోరియున్నారు. పై విషయమును నాకు తోచినంత చెప్పుటకే యీ వ్యాస ముద్దేశింపఁబడినది.

వ్యాసకర్త అభిప్రాయపడినట్లు, "దధివామనుఁ డనఁగా వెన్నముద్ద బాలగోపాల కృష్ణమ్మ" కాదు. వామనస్తుతి కృష్ణస్మరణకా బనిలేదు.

"వామనస్తుతిపరత్వమున లేచి" అని పెద్దన వ్రాయుటలో నౌచిత్యము ని ట్లుగ్గడింప వీలున్నది. వైష్ణవమత స్థాపనమునకు నితివృత్తముగా "నాముక్తమాల్యద" ను రచించిన శ్రీ కృష్ణదేవరాయలు ప్రాతఃకాలమున దధివామన స్తోత్రమును పారాయణము చేసినవాఁడు. అతనికిఁ బ్రీతిపాత్ర మగు పారాయణస్తోత్ర మీ దధివామనస్తోత్ర మగుటచే దీనికిఁ బ్రాధాన్య మీయఁదలఁచి హరిభక్తుఁడు పెద్దన ప్రవరుని నిత్య కృత్యములపట్ల వామనస్తుతిని ప్రస్తావించుటలో నౌచిత్యము కాక మరేమి ?

ఇదికాక కృష్ణరాయలు తన గ్రంథాదియందు శంఖ, చక్ర, గదా, ఖడ్గ, గరుత్మంతులను స్తుతించు నూతన పద్ధతిని ప్రారంభించుటయు, వైష్ణవ మతమును స్థాపించు గ్రంథము రచించుటను చూపుచున్నది. కనుకనే పెద్దన తత్ప్రభావమునకు లోబడి ప్రవరుని గుణశీల వర్ణనముపట్ల తచ్ఛాయలఁ జూపకపోలేదు. "శీలంబున్ గులమున్ .... మాన్య క్షేత్రంబులన్ బెక్కు వందాలంబందు నొక్కప్పుడున్ దలఁగ డింటన్ బాడియున్ బంటయున్" అనియు—అతని అన్నదానమును గురించి చెప్పునప్పుడు "వండ నలయదు వేవురు వచ్చిరేని" .... ఇత్యాదిగా రచించినాడు. దధివామనస్తోత్రమునందు స్తోత్రపారాయణము వలనఁ గలుగు ఫలశ్రుతి ఈవిధముగాఁ జెప్పఁబడియున్నది.

"బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ ధ్యాయే ద్దేవ మధోక్షజం
ఆయురారోగ్య మైశ్వర్యం లభతే చాన్న సంపదం.
అతిసువిమలగాత్రం రుక్మపాత్రస్థ మన్నం
సులలితదధిఖండం పాణినా దక్షిణేన
కల మమృతపూర్ణం వామహస్తే దధానం
తరతి సకల దుఃఖా ద్వామనం భావయేద్యః.
ఇదం స్తోత్రం పఠేద్యస్తు ప్రాతఃకాలే ద్విజోత్తమః
అక్లేశా దన్న సిద్ధ్యర్థం జ్ఞాన సిద్ధ్యర్థ మేవచ.

పై శ్లోకములనుబట్టి అక్లేశాన్న సంసిద్ధి, జ్ఞానసిద్ధి, ఆయురారోగ్య వైభవములు, సకల దుఃఖతారణము మొదలగునవి దధివామనస్తోత్ర పారాయణము వలన సిద్ధించును.. ప్రాయశః ప్రతినిత్యము దీనిని అల్లసాని పెద్దన కూడ పారాయణ మొనర్చెడివాఁడేమో! ఈ స్తోత్రము పద్విప్రులకు సంప్రదాయ సిద్ధముగా గురుపరంపరగా వచ్చియుండును. కనుక ప్రవరుఁడు సైత మా స్తోత్రమును బారాయణ మొనర్చె ననుటలో దోషములేదు. అతఁడు ప్రాతఃకాలమున పారాయణ మొనర్చునది దధివామనస్తోత్రమే. దధివామనస్తోత్ర పారాయణాపాదిత సచ్ఛీల సద్ధర్మరూప వైభవాదులు పూర్వోక్తతత్స్తోత్ర పారాయణాపాదితము లనుటలో దోష మావంత కానంబడదు.

దధివామనుని స్వరూపము దధివామన స్తోత్రమునందే వర్ణితము. వామన పురాణమున

"హేమాద్రి శిఖరాకారం శుద్ధస్ఫటిక సన్నిభం
పూర్ణచంద్ర నిభం దేవం ద్విభుజం వామనం స్మరేత్ ॥ 1

పద్మాసనస్థం దేవేశం చంద్రమండల మధ్యగం
జ్వలత్కాలానలప్రఖ్యం తటిత్కోటి సమప్రభం॥ 2

సూర్యకోటి ప్రతీకాశం చంద్రకోటి సుశీతలం
చంద్రమండల మధ్యస్థం విష్ణు మచ్యుత మవ్యయం॥ 3

శ్రీవత్సకౌస్తుభోరస్కం దివ్యరత్న విభూషితం
పీతాంబరధరం దేవం వనమాలా విభూషితం॥ 4

సుందరం పుండరీకాక్షం కిరీటేన విరాజితమ్
షోడశస్త్రీ పరివృత మప్సరోగణసేవితమ్॥ 5

సనకాదిభి రన్యైశ్చ స్తూయమానం సమంతతః
ఋగ్యజుస్సామథర్వాభి ర్గీయమానం జనార్దనం॥ 6

చతుర్ముఖాద్యై ర్దేవేశైః స్తోత్రారాధన తత్పరైః
త్రియంబకో మహాదేవో నృత్యతే యస్య సన్నిధౌ॥ 7

దధిమిశ్రాన్నకబలం రుక్మపాత్రంచ దక్షిణే
కరేఽపి చింతయేద్వామే పీయూష మమలం సుధీః॥ 8

సాధకానాం ప్రయచ్ఛంత మన్నపాన మనుత్తమం
బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ ధ్యాయేద్దేవ మధోక్షజమ్
ఆయురారోగ్య మైశ్వర్యం లభతే చాన్నసంపదమ్॥ 9

అతిసువిమలగాత్రం రుక్మపాత్రస్థ మన్నం
సులలితదధిఖండం పాణినా దక్షిణేన
కలశ మమృత పూర్ణం వామహస్తే దధానం
తరతిసకలదుఃఖా ద్వామనం భావయేద్యః॥ 10

ఇదం స్తోత్రం పఠేద్యస్తు ప్రాతఃకాలే ద్విజోత్తమః
అక్లేశా దన్నసిధ్యర్థం జ్ఞానసిధ్యర్థ మేవచ ॥ 11

అభ్రశ్యామః శుభ్రయజ్ఞోపవీతీ
సత్కౌపీనః పీతకృష్ణాజినశ్రీః
ఛత్రీ దండీ పుండరీకాయతాక్షః
పాయాద్దేవో వామనో బ్రహ్మచారీ॥ 12

అజిన దండ కమండలు మేఖలా రుచిర పావన వామనమూర్తయే
విగత జగత్త్రితయాయ జితారయే నిగమ వాక్పటవే నమః ॥ 13

శ్రీభూమిసహితం దివ్యం ముక్తాహార విభూషితం
నమామి వామనం దేవం భుక్తిముక్తి వరప్రదమ్ ॥ 14

వామనో బుద్ధిదాతా చ ద్రవస్థో వామనస్స్మృతః
వామన స్తారకోభాభ్యాం వామనాయ నమోనమః ॥ 14

ఇతి శ్రీవామనపురాణే దధివామనస్తోత్రం సంపూర్ణమ్ ॥

అని యున్నది.

పై విషయములఁ బర్యాలోకన మొనర్చువారలకు బ్రహ్మశ్రీ కీ. శే. వేటూరివారు చెప్పినట్లు "బాలగోపాల కృష్ణమ్మ" అను నర్థము దధివామన శబ్దమునకు సరస ముగా నున్నట్లు తోచదుగదా ! ప్రత్యేకముగా వామన పురాణాం తర్గతమై యున్న స్తోత్రమును వదలి శాఖాచంక్రమణార్థముల గవేషింపవలసిన ప్రారబ్ధ మేమి ?

దధివామనస్తోత్రము ద్వైత మతావలంబులకు నిత్య పారాయణ వేదమై ఆంధ్రదేశమున నింకను పూర్వాచార పరా యణుల రసనలపై హాళ్లీసక మనుదిన మాడుచుండుటఁబట్టి పైవిధముగా నిర్ణయించుట సాహసము కాజాలదు. సరస్వతీ తత్త్వ మర్మజ్ఞు లేతద్విషయమును పరామర్శింతురుగాక యని విద్వల్లోకమునకు విన్నవించుకొంటిని.

# పద్మనాభ శతకము: రామవర్మ భక్తిభావములు

## శ్రీ టి. బి. యం. అయ్యవారు

సంస్కృత సాహిత్య వికాసమునకు దోహద మొనరించిన వారిలో ప్రథమ పరిగణనము కేరళీయులకు లభించును. శంకర భగవత్ పాదుల నుండి మొన్న మొన్నటి వఱకు, నా దేశమున గీర్వాణవాణి—యుచ్చావచ విలాసములఁ జూపుచునే యున్నది. యుధిష్ఠిర విజయ, రాఘవీయాది మహా కావ్య ములు—ఆశ్చర్యచూడామణ్యాద్యనేకోత్తమ రూపకములు—కేరళ మున ప్రభవించినవే. అసలా దేశపు భాషయే సంస్కృత మయమైపోయి—మణి ప్రవాళశైలి కాకరమైనది. దీనికి తోడు రాజావలంబనమును దేవభాషాభ్యుదయమునకు మిక్కిలి సహకరించినది.

తిరువాన్కూరు రాజవంశము కేవలము సంస్కృత కవులనుఁ బోషించుటతో తృప్తినందలేదు. తానును ననే కామూల్య రచనలకుఁ గర్తృత్వము వహించి ధన్యమైనది. ఈ రాజవంశస్థు లనేకులు కావ్యకర్తలుగా మనకు దర్శన మిత్తురు. వారిని గుఱించి సవిస్తరముగ వేఱొక వ్యాసమున మనవిఁజేసు కొందును. ప్రస్తుతము పద్మనాభ శతక కర్తయగు శ్రీరామ వర్మ కులశేఖర వంచి మహారాజు భక్తిభావ తరంగితమగు కవితా సౌభాగ్యమునుఁ బ్రస్తావింతును.

పద్మనాభశతక ప్రణేతయగు నీ రాజకవి క్రీ. శ. 1813వ సంవత్సరమున నేప్రిల్ 16 వ తారీఖున స్వాతి నక్షత్రమున జన్మించెను. గర్భశ్రీమంతుడను కవిజన వ్యవహార మదృష్టశాలి యగు నీతనికిఁ గేరళమున సిద్ధించినది. రెండేండ్ల వయస్సు ననే తల్లి స్వర్గస్థురా లగుటచే నీతఁడు—అప్పటి బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధియగు కర్నల్ మన్రో పెంపకమునఁ బెరిగి పెద్దవాడై రాజ్యాంగ నిర్వహణమునకు వలయు చదువు సాము లన్నియును నేర్చుకొనెను. సంస్కృత, మళయాళములే కాక—ఆంధ్ర, ద్రవిడ, కర్ణాట, మహారాష్ట్ర భాషలను సైత మభ్యసించి—యందు కృతుల రచించునంతటి పాండిత్యమును గడించెనట ! ముప్పదినాలుగు వర్షముల స్వల్పజీవిత పరిధిలో నీ మహారాజు సంపాదించిన పాండిత్యమును, నిర్మించిన కృతు లును—నెవ్వరికైన నాశ్చర్యమును గొలుపు ననుటలో సందే హము లేదు. రాజ్యపాలనా విషయమునను—మళయాళదేశ చరిత్రమున నీయన పేరు మఱచిపోరానిది. ప్రజోపయోగకార్యము లనేకము లీ దొడ్డ ప్రభువు ఆఁచరికమున విరచితము లైనవి. ఆంగ్లేయుల పద్ధతి ననుసరించి క్రొత్తగ న్యాయ స్థానములు తిరువాన్కూరు సంస్థానమున నీయన కాలముననే స్థాపితములైనవి. ఉచిత చికిత్సాలయ మొకటి నిర్మిత మైనది. విశిష్టములగు ననేక ప్రాచీన గ్రంథముల కాన్పదమగు నొక గ్రంథాలయము నెలకొల్పఁబడినది. ఇవన్నియును— నీరాజకవిచంద్రుని సర్వతోముఖ ప్రతిభకు శాశ్వత ప్రతీకలు. విస్మరింత మన్నను విస్మృతికి రానివి.

### ఇతర కృతులు :—

(1) భక్తిమంజరి :—ఇది కేరళమున విపుల ప్రచార మున నున్న నారాయణీయమున కనుసరణము. భక్తిమార్గముల నన్నింటిని భవ్యముగ ప్రపంచించిన కృతిరత్నము.

(2) స్యానందూరపుర వర్ణన ప్రబంధము :—ఇది తిరువనంతపురమున (Trivendram) వేంచేసియున్న శ్రీ పద్మనాభస్వామి మాహాత్మ్యమును ప్రతిపాదించు మనోహర చంపువు. ఈ స్వామియే ప్రకృత శతకమునందును బహుధా స్తుతింపఁబడినాఁడు. నిజమునకు రామవర్మ కవితాహార్మ్యమునకు సుందర వైజయంతిక యీ కృతియే!

(3) కుచేలోపాఖ్యానము.

(4) అజామిళోపాఖ్యానము.

ఈ రెండును హరికథా కాలక్షేపమున కుపయోగించు సంగీత కృతులు. ఇవికాక ఆంధ్ర, ద్రవిడ, కర్ణాట, మహారాష్ట్ర భాషలందును భక్తిభావ బంధురములగు కీర్తనల పరశ్శతము రచించి, సంగీతమునందును నీతఁడు తన వైదుష్యమును ప్రకటించుకొనెను. ఈతని యాస్థానమే చోళపురము రఘునాథరావు వంటి వైణిక సార్వభౌములకు నిలయమైనదనిన నీయన రసజ్ఞతను గురించి వేఱుచెప్పఁ బనిలేదు.

తెలుఁగువారికి తిరుపతి వేంకటేశ్వరుఁ డెట్లో కేరళీయులకు స్యానందూరపురము (Trivendram) నందలి పద్మనాభస్వామి యట్లు. ఈ శతక మాయన గుణగణములను, నవతార విశేషములను, సుకుమార శైలిలో స్తుతించుచున్నది. మొత్తము శతక మంతయును బది దశకములుగ విభక్తమైనది. కొన్ని దశకములు స్తోత్రరూపమున నున్నవి. కొన్ని కేవలము వర్ణనాత్మకములై యున్నవి. మఱికొన్ని కథా రూపమున నడచినవి. సూక్ష్మములో మోక్ష మన్నట్లు ముత్తెఱఁగుల కవితాభంగులును నీ లఘుకావ్యమున ముచ్చటగా నిక్షేపింపఁబడినవి.

ప్రథమ దశకము :—ఇది పద్మనాభస్వామివారి ప్రాభవ వైభవముఁ బ్రస్తుతించును. ఈ సృష్టి యంతయును నాయన యధీనముననే వర్తించు ననుట! ఆయన యాజ్ఞ లేనిదే కించిత్తు కూడ సాగదు. ప్రాణుల సర్వ వ్యాపారములకును నాయనయే సూత్రధారుఁడు. ఈ భావమునే కవి యెట్లు చెప్పుచున్నాఁడో చూడుఁడు :

యే నేదం భువనం తతం స్వబలతో
యస్యాజ్ఞయోదేత్యహ
ర్నాథో వాత్యనిలోదహత్యపి శిఖీ
సర్వేపి యన్నిర్మితాః
యశ్చేదం సకలం జగత్ స్వజఠరే
ధత్తే౽థ కల్పావధౌ
త త్వాద్భృత్విభవే త్వయి ప్రముదితే
కిం వా దురాపం నృణామ్.

నానా విభక్త్యాత్మకమైన యీ శ్లోక ముదాహరణ కావ్యమును దలపించుచున్నది.

నత్త్వైక ప్రవణాశయులగు మహామునులు వేదవాక్యములు స్తుతించియును స్వామి మహాత్మ్యమును సముద్రము యొక్క సారమును పొందలేకపోయిరఁట! ఇఁక నల్పబుద్ధి యగు తా నెట్లు భగవన్మాహాత్మ్య వర్ణనమున శక్తుఁడ నగుదునని కవి యహంకార నిరసనము గావించినాఁడు. సంసార బంధావహమగు మోహమును తొలగించి సర్వాపదున్మూలిని యగు భక్తిని ప్రసాదింప భగవంతుఁడగు పద్మనాభుని మనసార ప్రార్థించినాఁడు. అంతేకాక యీ దశకమున విష్ణుసేవ వలన సర్వాపదలఁ దరించిన యింద్రద్యుమ్నాజామిళాదుల గాథలను ప్రస్తావించినాఁడు.

ద్వితీయ దశకము :—విష్ణుభక్తి గరిమ మిందు మనోజ్ఞముగ ప్రతిపాదితమైనది. కవి నిజముగ నిం దార్తుఁడై తన్నుద్ధరింపుమని యిష్టదైవమును వేడుకొన్నాఁడు. విషయ ప్రసక్తమై, యశాంత్యావిలమైన తన మనస్సును సన్మార్గమునకుఁ ద్రిప్పుమని పరమేశ్వరుని నభ్యర్థించినాఁడు. తన సర్వేంద్రియ వ్యాపారములును భగవత్ పరాయణములు కావలెనని యిట్లనుచున్నాఁడు.

"దృశౌ భవన్మూర్తి విలోక లోలే
శ్రుతీ చ తే చారుకథా ప్రసక్తే
కరౌ చ తే పూజనబద్ధ తృష్ణౌ
విధేహి నిత్యం మమ పంకజాక్ష."

చూపులు పద్మనాభుని దివ్యమంగళ విగ్రహాలోకనమున—కర్ణము లాయన కథా ప్రసంగములయందును—హస్తములు తత్ పూజన మందును లగ్నములు కావలయునఁట. మనుజుల యింద్రియములకు సార్థక్య మింతకంటె వేఱేమి కలదు? పోతనామాత్యులు కూడ "కమలాక్షు నర్చించు కరములు కరములని" యీ భావమునే భంగ్యంతరమున వ్యక్తము చేసిరి. తెలుఁగున భక్తి భరితములగు కీర్తనల పెక్కు రచించిన యీ రాజకవి పోతన భాగవతమును చదువకుండునా! శ్రీ శంకర భగవత్పాదుల "మనస్తే పాదాబ్జే నివసతు" అను శ్లోకమును దీనిని చదువఁగనే మనకు జ్ఞప్తికి రాకపోదు.

వేదోక్త కర్మాచరణమునఁ బాపములు నశించిన నశింపవచ్చును గాని "వాసన" మాత్రము నశింపదఁట! ఆ వాసన యున్నంతవరకును జీవికిఁ బ్రమాదము తప్పదు. అది సమూలముగా నశింపవలెనన్న భక్తి తప్ప వేఱొక మార్గము లేదు. చూడుఁడు రామవర్మ యేమి చెప్పుచున్నాఁడో!

"వేదోదితాభిర్వ్రత సత్క్రియాభిః
నశ్యత్యఘౌఘో నహి వాసనాతు
త్వ త్పాదసేవా హరతి ద్వయం యత్
తస్మా స్థిరా సైవ మమాశు భూయాత్."

భగవంతుని పాదసేవ పాపములు దొలగించును. అంతేకాక దానికి మూలమగు వాసనను హరించునఁట! అందుచేతనే దానిని నత్వరము తన కనుగ్రహింపు మనుచున్నాఁడు.

ధర్మములతో నెంత తల(క్రిందైనను జీవికి మోక్షము లేదు. ఏలనన వాని ఫలము శాశ్వతము కాదు. ధర్మ కర్మాచరణ లబ్ధమగు స్వర్గము—పుణ్యము తీఱిన వెంటనే కొంత మాలినదై పతనహేతు వగుచున్నది. పద్మనాభశతక కర్త దీని నిట్లు వచించుచున్నాఁడు.

"అనేక ధర్మాన్ ప్రచరన్ మనుష్యో
నా కోఽను భుజ్క్తే సుఖ మవ్యలీకమ్
తస్యావధౌ సంపతతీహ భూమౌ
త్వత్ సేవకో జాతు నవిచ్యుతః స్యాత్."

స్వర్గసుఖము లస్థిరములు. గడువు తీఱిన మరల భూమికి దిగక తప్పదు. భగవద్భక్తునకు మాత్ర మీ దుర్గతి పట్టదు. ఆతఁడు చ్యుతిరహితుఁడు. శ్రీ కృష్ణభగవానుఁడును గీతలో నిట్లే సెలవిచ్చినాఁడు.

"త్రైవిద్యా మాం సోమపాః పూత పాపా
య జ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్యమాసాద్య సురేంద్ర లోకమ్
అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్.
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే."
"నమే భక్తః ప్రణశ్యతి"
(భగవద్గీత—9 వ అధ్యాయము.)

ఈ భక్తి మొదటినుండి లేకపోయినను భయపడ నవసరములేదు. అవసాన సమయమందైనను భగవంతుని స్మరించిన చాలును. సద్గతి లభించును. గీతాప్రోక్తమగు నీ రహస్యమును నిందు చెప్ప బడినది. ఈ క్రింది శ్లోకము నవధరింపుఁడు.

"యద్యత్ స్మరన్ ప్రోజ్ఝతి దేహ మేతత్
ప్రయాణకాలే వివశోఽత్ర దేహీ
తత్తత్ కిలాప్నోతి యదన్యభావే
తస్మాత్తవైవ స్మృతిరస్తు నిత్యమ్."

తృతీయ దశకము :—పద్మనాభస్వామివారి ప్రత్యవయవమును నిందు వర్ణితమగుచున్నది. దీని శైలి కూడ లలిత సమాస భూయిష్ఠమై శ్రవణపేయమై యలరారుచున్నది. మఱి వర్ణనావసరముల నిట్టి రీతినే కదా శిల్ప మెఱిఁగిన సుకవులు పాటింతురు. ఉదాహరణకు

"దినమనుపదయుగ్మం భావయే తే మురారే
కులిశ శఫర ముఖ్యైః చిహ్నితం చారు చిహ్నైః
యదుదిత జలధారా పావనీజహ్నుకన్యా
పురభిదపి మహాత్మా యాం బిభర్తి స్మమూర్ధ్నా
భుజగశయన ! తత్తే మంజు మంజీరయుక్తం
ముహురపి హృది సేవే పాదపద్మం మనోజ్ఞమ్."

అలంతి యలంతి సమాసములతో నీ దశక మంతయు హృదయంగమశయ్యాసౌభాగ్యమున నిట్లే సాగినది. ఇందలి ప్రతి శ్లోకమును నోరారఁ జదువుకొనఁ దగినదే !

చతుర్థ దశకము :—ఇది యొక చిన్న కథవలె నడచినది. శతకముల నడుమ నిట్లు కథలు జెప్పుట యొక విలక్షణ పద్ధతి. మొదలు నుండి తుది వరకును కథారూపమున నడచిన శతకములు కొన్ని తెలుఁగునఁ గలవు. సంస్కృతమును జాల యరుదు. అసలు లేవని చెప్పినను తప్పు కాదేమో ! అందుచే సంస్కృత శతకములలో నిది యొక ప్రత్యేకతను సంపాదించుకొన్న దనియే నుడువవలయును. శ్రీ విష్ణువు నాభీకమలమున జన్మించిన బ్రహ్మదేవుఁడు దిక్కు తెలియక చింతించుట—శ్రీ మహావిష్ణు వనుగ్రహించి యాతనికి చరాచరాత్మకమగు విశ్వమును సృష్టించు సామర్థ్య మొసంగుట యిందు వర్ణితములగు విషయములు. దీని శైలి యంతయు నతి ప్రసన్నమై కథాకథనమున కనుకూలముగ వర్తించినది. కథకుఁ దగిన వృత్తము (Metre) స్వీకృతమైనది. భాగవత తృతీయ స్కంధమునందలి గాథయే దీనికి మూలము. కవియును నీ దశకమును బురాణరీతి నవలంబించుట ప్రశంసింపఁ దగినది.

పంచమ దశకము :—దుష్టశిక్షణకును, శిష్ట రక్షణకును మహావిష్ణు వెత్తిన యవతారములలో మత్స్య కూర్మ వరాహావతారము లిందు కథితములైనవి. హిరణ్యకశిపుని ప్రసంగమును కొంత వచ్చినది. ఆ సందర్భమునందలి పద్యమిది:

వధేన స్వభ్రాతుః పరమ కుపితో
దానవవరో
హిరణ్య ప్రారంభః కశిపురిహ
మోహాకులమతిః
విజేతుం త్వాం సోఽయం నిఖిలజగ
దాధార వపుషం
ప్రతిజ్ఞాం చా కార్షీద్వనుసుతస
భా మధ్య నిలయః

జగదాధార భూతుఁడగు నారాయణుని జయించుటకు హిరణ్యకశిపుఁడు ప్రతిజ్ఞ గైకొనుటయే యిందలి శ్లోకభావము. ఈ శ్లోకము సరిగా నారాయణీయమునందలి యీ దిగువ శ్లోకమును బోలియున్నది.

"హిరణ్యాక్షో ప్యాత్రి ప్రవర వపుషా
దేవ ! భవతా

హిరణ్య ప్రారంభః కశిపు రమ
రారాతి సదసి
ప్రతిజ్ఞా మాతే నే తవ కిల
వధార్థం సురరిపో!"

నారాయణభట్టు కృతమగు నారాయణీయము కేరళమున విపుల ప్రచారమున నున్న స్తుతి కావ్యము. కేరళీయులైన సంస్కృత కవు లనేకులు దాని ననుకరించిరి. ఈ లఘుకావ్యమునఁ గూడ నారాయణీయానుసరములు చాల కలవు.

షష్ఠ దశకము :—దీనియందు నృసింహ వామన పరశురామావతారములు నిగదితములైనవి.

సప్తమ దశకము :—రామాయణగాథ యంతయును నీ దశకమున సంక్షేపముగ వర్ణింపబడినది. మందాక్రాంత వృత్తములతో నీ దశక మంతయును మధుర మధురముగ నర్తించినది. ప్రణయ సందేశముల కుపయోగించు వృత్తమును నిచ్చుట విన్యసించుట యొక విశేషము.

అష్టమ నవమ దశకములు :—ఈ రెండును కృష్ణావతారాభివర్ణనమున సహృదయరంజన సమర్థములై యొప్పుచున్నవి. పరిణతమగు శయ్యాసౌందర్యము వీనియందును ప్రత్యక్షరమునఁ దాండవించుచున్నది. శ్రీకృష్ణుఁడు కుచేలునిఁ బ్రోచిన యీ శ్లోకమును చూడుఁడు.

విప్రం నిస్స్వం కుచేలం సదన
ముపగతం బాల్యకాలైక మిత్రం
పశ్యన్ కారుణ్యలోలః పృథుక మిహ
కరాత్ తస్య సంగృహ్యతూర్ణమ్
లక్ష్మ్యా సంవారితోఽపి స్వయమపరిమితం
విత్తమస్మై దదానః
కారుణ్యాంభోనిధిస్త్వం జయ జయ భగవన్
సర్వ లోకాధినాథ."

దశమ దశకము :—తాపత్రయపీడితుఁడై భవాంధ కూపమునుండి త నుద్ధరింపుమని కవి యిందు దీన దీనముగ భగవంతుని గురించి యాక్రోశించును. భావానుకూల వృత్తస్వీకృతి యీ కడపటి దశకమున కొక వన్నె తెచ్చినది. అదియునుగాక గ్రంథకర్త అద్వైత మార్గావలంబియై యిందు భగవంతునిఁ బ్రస్తుతించి ధన్యుఁడైనాఁడు. ఈ శ్లోకములనుఁ బరిశీలింపుఁడు.

భూషణేషు కిల హేమ వజ్జగతి
వృత్తికావ దధవాఘటే
తంతుజాలవదహోప టేష్వపిచ,
రాజతాద్వయ రసాత్మకమ్

సర్వ సత్త్వ హృదయైక సాక్షిణ
మిహాతి మాయ నిజవైభవం
భావయామి హృదయే భవంత మిహ
పద్మనాభ ! పరిపాహి మామ్

చిన్మయాంబునిధి వీచి రూప
సనకాది చింత్య విమలాకృతే
జాతి కర్మ గుణ భేదహీన !
సకలాదిమూల జగతాం గురో

బ్రహ్మ శంకర ముఖైరమేయ
విపులానుభావ ! కరుణానిధే
భావయామి హృదయే భవంత మిహ
పద్మనాభ ! పరిపాహి మామ్."

మొదటి శ్లోకమున నిక్షిప్తములైన దృష్టాంతము లన్నియు నద్వైత సిద్ధాంత ప్రతిపాదక గ్రంథములఁ దఱచు వచ్చు చుండును. అద్వైత స్థాపనాచార్యుల దేశమునఁ బుట్టిన యీతనిపై తన్మతప్రభావము ప్రసరించుట వింతకాదు. "తత్పరైకమతిరంత్యజోఽపి ఖలు లోక మీశ్వర! పునాత్యహో నో రమేశ! విముఖాశయో భవతి విప్రజాతి రపి కేవలమ్" అని చండాలుఁడైనను భగవద్భక్తుఁడైన సర్వోత్తముఁడై లోకమునుఁ బవిత్రీకరించునని యీత డీ దశకమున నిష్కర్షగఁ జెప్పును. భాగవత కర్తయును దీనిని చెప్పినాఁడు. శివభక్తుల నుద్దేశించి బసవేశ్వరుఁడును నీ పారమార్థిక సత్యమునే కన్నడమున వచన రూపమునఁ బ్రవచించినాఁడు. జ్ఞానయోగములు విరక్తులకును, కర్మయోగ మధిక సక్త మనస్కులకును నుపయోగింప భక్తియోగము సర్వజనులకు నుపకరించునని యీతఁ డీ గ్రంథమున స్పష్టముగ వక్కాణించును.

భక్తిభావబంధురమై, శిరీష కుసుమపేశల సుధామయోక్తులతో నిండిన యీ శతకము సంస్కృత శతక వాఙ్మయమున విశిష్టమని చెప్పుటలో నత్యుక్తి యేమాత్రమును లేదనుకొందును.

# ద్రౌపదీ కల్యాణము: అముద్రిత కావ్యము

శ్రీ టి. భీమసేనరావు

**ఇది** యొక అముద్రిత కావ్యము. దీనిని పెదపానుగంటి కుమార వేంకట మహీపతి రచించెను. ఇతనితల్లి రామమాంబ. తండ్రి వేంకటమహీపతి. నివాసస్థలము పెద్దపానుగల్లు. కాలమును కవి వ్రాసికొనలేదు. ఇతని గురువు సముద్రాల తిరువలార్యుని దౌహిత్రుడగు వేంకటాచార్యుల కుమారుడు కోనపాచార్యుడు. ఇది యైదాశ్వాసముల ప్రబంధము.

ప్రథమాశ్వాసమున 514 పద్యములు.
ద్వితీయాశ్వాసమున 414 పద్యములు.
తృతీయాశ్వాసమున 345 పద్యములు.
చతుర్థాశ్వాసమున 468 పద్యములు.
పంచమాశ్వాసమున 399 పద్యములు కలవు.

ఆశ్వాసాంతమున "ఇది శ్రీమద్వేంకటేశ్వర ప్రసాదోపలక్షిత లక్ష్మీ మకళావిరాజమాన, సకల సుకవి జేగీయమాన, పెన్నాలగోత్ర పవిత్ర,బొయినపల్లి కుల కలశపారావార కైరవమిత్ర, రామమాంబా గర్భ నిర్భర శుక్తిముక్తావతార, అనవద్యవిద్యావిశంకట వెంకట రాయకుమార వేంకటరాయ ప్రణీతంబైన ద్రౌపదీ కల్యాణం బను మహా ప్రబంధంబు" అని గద్యను వ్రాసినాడు. ఇతడు తిక్కన వలె తన ప్రబంధమునకు కృతిపతిని నిర్ణయించుకొన్నాడు. తా నొక కావ్యము వ్రాయదలచి, దానికి కృతిపతి ఎవ్వ రుండ వలయునని మనసున నాలోచించుచూ, నిద్రింప కలలో వేంకట రమణస్వామి సాక్షాత్కరించి, వెనుచరచి,

'వెఱచదేటికి
నను నెఱుగవె వేంకటగిరినాథుడ నే
వచ్చినవాడ నోడ కిచ్చితి
ననవరత శ్రీ జయాయురారోగ్యంబుల్
నీ లక్ష్య లక్షణ పదవి
ధాలితోక్తులకు మెచ్చొదవె రస పాకా
పాలకళిల కవితలన్
బాలక యొక కృతి వచింపుమా మాపేరన్"

అని యానతిచ్చి యంతర్హితుండయ్యెను. పిమ్మట వేంకటపతి మేల్కొని తన స్నేహితుడైన బోరువెల్లి నరసింహ సుకవిని పిలిపించి, తన స్వప్న వృత్తాంతమును వివరించెను. అప్పుడు నరసింహకవి వేంకట మహీపతితో నిట్లనెను. "జగన్నాథు డైన వేంకటేశ్వరుడు నీ యెడ ప్రసన్నుడై, తనకు నీ కావ్యమును కృతి ఇమ్మని కోరెను. కాన "........అతులార్థ విధాలంకార శుభాం కూరర సాంకూర పద ప్రబంధముగాన్ నీ పదగుంఫన లేర్పడగా పాకము, రీతి, శయ్య, గౌరవ మొదవన్ ద్రౌపది కల్యాణమును రచింపుము" అనెను.

ఇందు భారతమునందువలె జనమేజయునకు వైశం పాయనుడు కథ చెప్పుచు, జనమేజయుడు అడిగిన ప్రశ్నకు సమాధానముగా ఈ కావ్యమును కవి ప్రారంభించును. ప్రథమా శ్వాసమున ద్రోణ, ద్రుపదుల జన్మవృత్తాంతము మొదలు కుమార రాస్త్ర విద్యా ప్రదర్శనముదాక వ్రాసెను.

ద్వితీయాశ్వాసమున అర్జునునిచే ద్రుపదుని పరాభవము, ద్రుపదుని తపస్సు, యజ్ఞవేదికలో ద్రౌపదీ దృష్టద్యుమ్నుల జన్మము వర్ణితము.

తృతీయాశ్వాసమున పాండవులు వారణావతమున వాసము, లాక్షాగృహదహనము, హిడింబాసురయుద్ధము, ఘటోత్కచుని జననము, ద్రౌపదీ సౌందర్య వర్ణనము, స్వయంవరమును చాటుట, బకాసురవధ, ధౌమ్యుని పాండవులు పురోహితునిగా వరించుట, వ్యాసుడు ప్రత్యక్షమై పాండవుల దీవించుట మొద లగు విషయములు కలవు.

నాల్గవ ఆశ్వాసమున ద్రుపదుడు పాండవుల వెదికించుట — పురోహితుడు స్వయంవరము చాటిన పాండవులు తప్పకవత్తురని ధైర్యము చెప్పుట—ద్రౌపది వర్ణనము, వివిధ రాజుల వర్ణనము, మత్స్య యంత్రభేదనము, యుద్ధము, కుంతిమాట ననుసరించి ద్రౌపదినందరు వరించుట కంగీక రించుట, బలరామకృష్ణుల యాగమనము, వసంతఋతువర్ణ నము, ద్రౌపదీ వనవిహార, విరహ, తత్పరిచర్యా వర్ణనములు— ద్రౌపదిశుకముచే సందేశ మంపుట.

ఐదవయాశ్వాసమున:—

ద్రుపదుడు ద్రౌపదీ కల్యాణమును గుఱించి కుంతి మాటలను పాండవు లెట్లు ఆచరింతురాయని దానిలోని ధర్మా ధర్మములను ఆలోచించు సమయమున వ్యాసమునీంద్రుడు ప్రత్యక్షమగుట, ద్రౌపది పూర్వజన్మ వృత్తాంతంబు తెలియ జేయుట, పరిణయమంటపాలంకారము, పంచపాండవులతో క్రమముగా, ప్రత్యేకముగా పాణిగ్రహణ మహోత్సవము, వ్యాసా దుల దీవనలు, వ్యాసుని అంతర్ధానము, పంచపాండవులు ద్రౌప దితో దిన మొకరుగా రతికేళిని దేలుట, ఇట్లు సంవత్సరకాలము ద్రుపదునిఇంట నుండుట, చారులవలన ధృతరాష్ట్రుడు పాండ వులు సజీవులైయున్నారని తెలిసి, విదురునిపంచి, పాండవుల పిలిపించుట— ఇంద్రప్రస్థమున వీరు రాజ్యమేలుట అను విషయములు గలవు.

కవితా రీతులు:—

ఇందలి ఇతివృత్తము భారతములోని యొక ఘట్టము. దానిని ప్రబంధ పద్ధతిలో, చక్కని వర్ణనలతో పెంచి, రమ్య ముగా దిద్ది తీర్చినాడు కవి.

ఇందలి భాష జానుతెనగు నుడికారములతో నొప్పారు చున్నది. సంస్కృత సమాసములందుగాని, అచ్చతెనుగు పదములు వాడుటయందుగాని నడక ఎచ్చట కుంటువడలేదు. ఇందలి దీర్ఘ సమాసములు చూచిన ఇతని సంస్కృత భాషా పాండిత్య మపారమనిపించును.

శైలి పరిపక్వమైనది. తంజావూరు రఘునాథరాయల రామాయణ కవిత కన్నను బాగున్నదనిపించును. కొన్ని యెడల వివిధ శ్లేషాలంకారములను కూర్చిన పట్టులు, కంకంటి పాప రాజు కవితను తలపింపజేయుచున్నవి.

మొత్తముగా ఈ కావ్యము ఆదినుండి కొనవరకు చేమ కూరి వేంకటకవి విజయవిలాసమును బోలి శబ్దార్థ చమత్కా రములతో నొప్పారుచున్నది. ఇందు శబ్దాలంకారములు విశే షముగానున్నను అర్థ చమత్కారము అడుగడ్గున వెల్లి విరి యుటచే నిది యుత్తమ కావ్యమనిపించుకొనుటకు సర్వథా తగి యున్నది. ప్రధానమైనది శృంగారరసము. శృంగార రసము

చాల ఉచితముగ వర్ణింపబడినది. వీరాదిరసములను ఆ యా ఘట్టములందు ముచ్చటగా వర్ణించినాడు కవి.

వచనములు అరదు. అవి యైనను అను(పాసాలంకార భూయిష్ఠమై వృత్తములవలెనే నడచినవి.

(పాచీన (పబంధములందువలె అన్ని వృత్తములు గలవు. ఆశ్వాసాంతమునందు చ(కబంధము, గోమూ(తికాబంధము, రథ బంధము మున్నగు బంధ కవిత్వమును కూడ కవి రచించినాడు. మచ్చునకు కొన్ని పద్యము లిచట నుదాహరింపబడినవి.

గోపగోపక గోప గోపనల్ నలువొందు
నీ దయోదయ భోగ నియతి కలన
రాజరాజవరాజ రాజజుల్ జులుకన
నీ నిధానధనారి నిధన విధుల
ధర్మ ధర్మజ ధర్మ ధర్మముల్ ములుజూప
వరయ నీ శమన సత్య రుజు గతుల
రామ రామా రామ రామమూర్తుల తుల
నీ బల ధర్మార్థ నిశ్చయముల
గండ భేరుండ గండరగండ చండ
సమర నిశ్శంక బిరుదాంక నద కలంక
పద విశంకట వేంకట(పభుకులాధి
నాయక కుమార వేంకట రాయధీర

అఖిలక్ష్మా భరణాత్మ పెంపయిన వా
డఖిలక్ష్మా భరణాత్ముడయ్యె
లక్ష్మీ కళా లక్ష్య లక్ష్ముడై తగువాడు
లక్ష్మీ కళా లక్ష్మ లక్ష్ముడయ్యె
కౌమార రూప స్వ ధామంబు గలవాడు
కౌమారరూపస్వధాముడయ్యె
సు(పజా సముదయ శోభితుండగువాడు
సు(పజాసముదయశోభియయ్యె
జై(త తార్చిత నిజనత ఛ్ఛ(తగండ
భేరుండ బిరుదాంక మండనాభి
రామనామాపహృత వైరి రావణుండు
బొయినిపలి రామక్ష్మా నాయకుండు

నావుడు లేవ డే విటు వి
నంగ ననంగ రూపజి
ద్యావను లీ కుమారకుల
నారయ నారయ వృత్తి బోయెదన్
దీవల దీవలెన్ మనికి
దేవళె దేవళె నంచు నెంచు కీ
బావిని దోవి నూతు రెదః
బారెద బారెద నాట నేటికో

సంతోషంబున నేకలవ్యుడు గురు
స్వచ్ఛంద వాంఛల్ సమ
ర్థింతుంగాకని యేకలవ్యుడయి యుం
తేవాసియై యుంట నా
కెంతే వాసియటంచు నెంచె మదిలో
నీ లీల మున్ ఫాలమం
దంతే (వాసిన (బహ్మ(వాలుడుప
శక్యంబౌనె యెవ్వారికిన్.

# లేఖలు

# క్రీడాభిరామ పీఠికానుబంధము

## "భారతి" సంపాదకులకు :

అయ్యా!

శ్రీ ప్రభాకర పరిశోధకమండలి పక్షమున ప్రకటింపఁబడిన క్రీడాభిరామ తృతీయ ముద్రణమును భారతి పత్రికాధిపతులు సహృదయులైన శ్రీ 'కోదండ' గారిచే సమీక్ష చేయించిరి. ఇరువురకును పరిశోధకమండలి పక్షమున ప్రకాశకులివే కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నారు.

సమీక్షకులు ప్రస్తుత ముద్రణమును ప్రశంసించుచు, పీఠికానుబంధముగా నే నందు చేర్చిన వ్యాసమును పరామర్శించి యొండు రెండు విషయములనుగూర్చిమాత్రము భిన్నాభిప్రాయము వెలిబుచ్చిరి. వానినిగూర్చి మాత్రమే ఇంచుక వ్రాయుచున్నాను.

1. వల్లభరాయనికి క్రీడాభిరామముతోఁగల సంబంధమును గూర్చి నేను వ్రాసిన విషయమ్మై సమీక్షకులు కొన్ని పంక్తులు వ్రాసినారు. 'వీధిని వీధిగానే మూలము ననుసరించి (కవితలో కాక ప్రదర్శన కనుకూలముగా వచనము గాబోలును) వల్లభరాయఁడు రచియించి, బహుశః మోపూరు భైరవుని తిరునాళ్ల సందర్భమున ప్రదర్శింపించియుండును.....' ఇత్యాదిగా కొంత నేను సోపపత్తికముగా వ్రాసియుంటిని. సమీక్షకు లాభావమున కభ్యంతరము వెల్లడించిరి. 'కవితలోకాక, వచనమున గాబోలును' అని కుండలీకరణములో నేను వ్రాసినదాని కా రూపకానుసరణ మామూలాగ్రము ఈ గ్రంథమందున్న ప్రబంధ కవితాధోరణిని గాక, సంభాషణయోగ్యమగు వచనమున గాబోలు నను నా యభిప్రాయము సువ్యక్తమగుచునేయున్నదనుకొందను. కావున వల్లభరాయని యనుసరణము వచనములోనని యనుకొనవలసిన పని యేమి? అను ప్రశ్న ముదయింపదు. వచన మేల యన ఆ వీధీ రూపకము ప్రదర్శన యోగ్యము కావున సంభాషణ కొరకై యనవలసియున్నది. వినుకొండకవి గావించిన ఈ రూపకానుసరణము మోపూరు భైరవుని తిరునాళ్ల సందర్భమున దోర సముద్రపు నటులచే ప్రదర్శింప బడినదని యనుకొనుటకును, అట్లు ప్రదర్శితమైన రచనయే ప్రబంధీకరింపఁబడినదనుకొనుటకును ఈ గ్రంథమందే సాక్ష్యమున్నది. ఆ విషయము నా వ్యాసమందే వివరించితిని. కావున నాడు కేవల వచన నాటకము లుండెనా లేదా—వల్లభరాయఁడు సమర్థుఁడగునా కాదా యను వాదమునకే ప్రసక్తిలేదు. దేశి దృశ్య రచనలకును, సంస్కృత రూపకానుసరణములకును ప్రారంభ మా దినములలోనే కావున గేయాంశము కలిగిన వచనమున నాటి రూపకము లుండవచ్చు నన్నట్లనుకొన్నను సాహసమేమియు లేదనుకొందును.

ఇక 'వీధీనాటకమునకు శ్రీనాథుఁడో, వల్లభరాయఁడో మరికొన్ని విషయములుచేర్చి చేసిన ప్రబంధానుసరణ మీ క్రీడాభిరామ మనుకొనినచో నిది వీధీనాటకమా, ప్రబంధమా యను సందేహమునకే తావుండదు' అని సమీక్షకులు వ్రాసిరి. తిరిగి వాదమెల్ల మొదటికి వచ్చినది! విషయ మంత తేలికగా పోవునదిగా దోపదు. నేడు మన కుపలబ్ధమగు రచనము వల్లభరాయనిది కాజాలదనియు, శ్రీనాథునిదేయగుననియు, విపులముగా విశదీకరించిన శ్రీ శాస్త్రిగారి వాదమునే నేను విశ్వసించుచున్నాను. కావున నిందు వల్లభరాయనిప్రసక్తి యనవసరము. పోతే శ్రీనాథుఁడుకావించిన ప్రబంధానుకరణమే అనుకొందమన్నను చిక్కులున్నవి.

త్రిపురాంతకునిది మూలమగు రూపకము. మన కుపలబ్ధమైనది ప్రదర్శనమునకు వీలుకాని ప్రబంధానుసరణము. ఈ రెండునుకాక, వినుకొండకవి వ్రాసి దోరసముద్రపు నటులచే భైరవుని తిరునాళ్లలో ప్రదర్శితమైన రచన యొక్కటి ప్రస్తావింపఁబడుట చేతనే సమంజసమగునని నే నట్లు వ్రాసితిని. వాదమేలయని అసలు ఈ (293, 294) పద్యములలోని సరసములగు పాఠములనే పరిహరింపవలెననుటకు నే నంగీకరింపను. విజ్ఞులు మూలమును బరిశీలింపఁదగుదురు. శ్రీ శాస్త్రిగారు జాగ్రత్తగా గుర్తించిన పాఠముతో నేను సంపూర్ణముగా నేకీభవించుచున్నాను. కావున సమీక్షకులు చిక్కు విడఁదీసిన దెక్కడ? ఇక సంస్కృత పరిజ్ఞానముండుట వేరు. దానిని చక్కని కవితలో వెలయించుటవేరు. వల్లభరాయఁడు పద్యములు వ్రాయజాలినవాఁడో, జాలనివాఁడో నాకు తెలిసిన విషయముకాదు. గ్రంథస్థ సాక్ష్యమునుబట్టియే నే న ట్లూహించితిని. శ్రీనాథునిదే ఈ క్రీడాభిరామమును శ్రీ శాస్త్రిగారి వాదముతోబాటు, వల్లభరాయనికి కూడ నిందు సంబంధమున్నదన్న ఇతర విమర్శకుల వాదము కూడ నేను వివరించిన విధమున సమన్వితమై సంభావితమగుటయేకాదు, చిక్కులు కూడ తొలఁగినవనియే నా యభిప్రాయము.

2. 'పటుఝూంఝూ' పద్యమునుగూర్చి. నా కీ పద్యమున నేమియు చిక్కు తోపకున్నది. గర్జావచః ప్రౌఢిమన్—నట్టనడురే' అన్న పదములన్నియు నమూలకములైనను శ్రీ శాస్త్రిగారు వ్రాసినట్లే 'అవశ్యకములు నధిక గుణ సంపాదకములు'

నైనవి. ఆ గర్జ తటిత్తుదే యనుట సత్యమై, సుందరమై, యొప్పుచున్నది. దోషి ఎదుట నున్నపుడు పెద్దలు దోషము నిరూపించి హుంకరించుచు 'చూడు నీ మూలమున నెంత జరిగి నదో' అన్నంత గాంభీర్య మీ గర్జావచః ప్రౌఢిమలో ధ్వనించు చున్నది. అంతేకాదు, నేను ఉదహరించిన 'యది గర్జతు వారి ధరో' అను మృచ్ఛకటిక శ్లోకమందలి భావ ప్రౌఢిమ కూడా ఇందలి ప్రౌఢిమత్వమును సమర్థించుచున్నది. సమీక్షకులు ప్రస్తావించిన 'వారణసేయ' పద్యము కూడ పండితు లింతకు పూర్వమే వివరించినట్లు అనువాదము సొగసు చెడకనే యున్నదని నాకు తోచుచున్నది.

3. "తమ్మడిసాని (కూతు)"—ఈపట్టున (కూతు) అని చేర్చుట అనవసరమని సమీక్షకులు నంగీకరించిరి. కాని స్పష్టత కొరకై శ్రీ తమ్మయ్యగారు చేర్చియుండినచో మాత్రము తప్పులేదనిరి. క్షమింతురుగాక—ఆ పద్ధతిని సందర్భమునుబట్టి గ్రంథ భాగములందే 'తల్లి'—'బిడ్డ' అని వ్యాఖ్యానమునే ముద్రించుకొనుచుఁ బోవచ్చును గదా!

ఆ పదమును జేర్చుట లనవసరమే. సమీక్షకులు "'పూజరి సాని తల్లి యన్నట్లు, తమ్మడిసాని కూతురన్నట్లు ప్రయోగింపఁ బడిన దనుట సరికాదు. అవి రెండును పర్యాయములుగానే ప్రయోగింపఁబడినవి. పూజరి సానియన్నను, తమ్మరిసాని యన్నను నర్థమొక్కటే. ఆ పట్టు కొంత చిక్కునే గొల్పుచున్నది" అని భిన్నాభిప్రాయమును వెలిబుచ్చిరి. అట్లు వ్రాయుట సరికాదు. ఆ పట్టును ఒకసారి తిరిగి పరికింపఁదగునని మనవిసేయుచున్నాను. అప్పుడు ఉన్నచిక్కు తొలగగలదు. తమ్మడిసానియన్నను, పూజరి సానియన్నను నర్థమొక్కటే అని శ్రీనాథునకును దెలియును గదా! కావుననే ఆతని ప్రయోగములను జాగ్రత్తగా పరికింప వలయుట. ఏమోగాని ఇప్పటికిని నాకు తమ్మరిసాని అని బిడ్డను గూర్చియు, పూజరిసాని అని తల్లినిగూర్చియు కవి ప్రయోగించి నట్లే నాకు గోచరించుచున్నది. అట్లనుటకు తగినంత బలము కూడ నున్నది. ఇంచుక వివరింతును.

గోవిందమంచనశర్మయు, టిట్టిభసెట్టియు తమ్మడి సాని మందిరమున విడిసిరి. మంచెనశర్మ తమ్మడిసానిని దొరసె మున చూచినాడు. నిరుడు చూచినాడు. వర్తమాన వత్సర మున టిట్టిభునితోడ గూడింపఁజేయుటకే "కొత్తమజంగవు బోడితలు' అచట పలువు రుండినను, వారినికాక "గూడ వివి క్తంబును, బూర్వపరిచితంబును, బురుషశూన్యంబును, వివాహ కాలోచిత వృత్తస్తన భార వివిధ విలాస విప్రవాస కన్యాసనాథం బును"నైన తమ్మడిసాని మందిరంబున (అనగా బిడ్డయైన తమ్మడిసానియున్న మందిరమున టిట్టిభుని తోడ గూడింప జేయుటకు ఆ బిడ్డనుగూర్చియే వచ్చినవారు గావున!) విడిసివారు. పనిలో పనిగా నామె తల్లియైన 'పూజరి విధవ' (పనిపాటులకో పణము గొనుటకో మాత్రమే అగు నామె) చేతనే కామమంజరికి కబురు చేయించినాడు. అది తన పని! ఆమె మంచనశర్మను పూర్వ మందుకూడ వీరభద్రేశ్వరార్చనా విధి నెపమున (రథ్యాముఖ శివ చత్వర ప్రపామంటపములందు) ఆ సమీపములందే వెన్నెల బయట నడిరేయివచ్చి కలిసి జోహారులు సేయుచుండెడిది. కామమంజరి వచ్చినది. ఆ జారదంపతు లిట్లు 'పూజరివారి ఇంటి ముంగిట' (ఆ పూజరుల ఇంటిముందు అని!) వెన్నెలబైట విడిసినారు. తమ యవసరమునకు వీలు గల్పించుకొనుటకై టిట్టిభునకు—బిడ్డయైన తమ్మడిసానిని కూర్పు నేర్పు' విచారించిరి. ఆమెను వానికి గూర్చుటకొరకే వా రా యింటికి వచ్చినది. ఇప్పుడు దానిని 'గూర్పునేర్పు' విచారించిరి. చీకటివేళ పరులకు వినరాకుండ 'సన్నపు టెలుంగున బూజరిసాని' (తల్లి)ని బిలిచి 'అచ్చేడియ' (తల్లి) చేతిలోన కనకనిష్కంబుతో గూడ కర్పూర వీడియం బుంచిరి. తరువాత ప్రక్కనే యుండిన బిడ్డను (287, 288 పద్యములలో) వర్ణించిరి. పిదప ఇంకను సూక్ష్మముగ 'పూజరి సాని' (తల్లి)ని 'సన్నజాఫులఁ' బిలిచి పసిడిటంకంబు పరిరంభ పణముజేసి టిట్టిభునితోడ నేడు గూడింపుగూతు' నన్నారు. కన్నెరిక ముడుప వేరే సొన్నాటంకము లిచ్చునట్లుగా కూడ తెలి పిరి. 'పూజరిసాని బిడ్డను' వెడ్డవెట్టి టిట్టిభున కిప్పించి తమ తమ యవసరముల దీర్చుకొనిరి. ఇందు 'తమ్మడిసాని మందిరమున విడిసి' అను పట్టుననే పర్యాయపదముగా వాడె నేమో అను ననుమానము కల్గుట. అక్కడ బిడ్డకొరకే వచ్చినవారు కావున దానిని స్ఫురింపఁజేయుటకే అట్లు ప్రయోగించినాడని నాకు తోచుచున్నది. ఇక మిగిలిన పట్టులం దంతటను తల్లికి పూజరిసానియనియు, బిడ్డకు తమ్మడిసానియనియు ప్రయో గించుట విదితమే. సన్నపు టెలుంగుతోడను, సన్నచూపులతో తోడను పిలిచి పరికింపఁజాలిన శ్రీనాథుని పై ప్రయోగము లందలి తారతమ్యమును సూక్ష్మముగానే పరికించి తెలిసికొనఁ దగును.

సమీక్షకులు వ్రాసినట్లు 291 వచనమున నన్వయము కదురుటలేదు. నిజమే. అందు "టిట్టిభుండు విన నిట్లనియె" అని కాక, 'నిట్లనిరి' అని యుండినచో సరిపోవు ననుకొందును. కథా సందర్భము క్రమముగానే ఉన్నది కావున నక్కడ గ్రంథ పాత ముండియుండు ననుకొనను.

4. 'కీసిన—వ్యవహారమున గూడ నీ పదము పరుషార్థి గానే యున్నదికదా. నవనాథ చరిత్ర ప్రయోగము నిర్ణాయక మగుననియే నే నుదాహరించితిని. తాళపత్రప్రతిపాఠము చూడ దగును.

5. 'రసనా ప్రవాళమ్ము'—గొరగవడుచు గావించిన విశేషములను వర్ణించుపట్టున సమీక్షకులు వివరించిన అర్థమే మిక్కిలి సమంజసమై కవి హృదయమును వెల్లడిచేయున ట్లున్నది. ఈ రీతినే పై విశేషమును మా పితృపాదులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు పూర్వ మొకప్పుడు తమకు వివరించియుండి నట్లు మా మిత్రులు కూడ నొక రిటీవల నాకు దెల్పిరి. నేను వ్రాసిన యర్థము సరికాదు.

వలువురకుఁ గొట్టినపిండియైనను శ్రీ ప్రభాకర పరి శోధక మండలివారు ప్రచురించిన క్రీడాభిరామ తృతీయముద్రణ మును సమీక్షించుచు, తిరిగి కొన్ని సూక్ష్మసూక్ష్మతరములై

పాఠములను గూర్చిన చర్చ కవకాశమిచ్చినందులకు సమీక్షకులకును, పత్రికాధికారులకును నా కృతజ్ఞతాభివందనము లర్పించుకొన్న చున్నాడను. నే వ్రాసిన యంశములను ప్రతి విమర్శగా నెంచక సహృదయతతో స్వీకరింతురుగాకని పెద్దలను గోరుచున్నాను.

— వేటూరి ఆనందమూర్తి.

## అర్జునుని శరీరవర్ణ మెట్టిది?

"భారతి" పత్రికా సంపాదకులకు :

అయ్యా !

పూజ్యులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు డిసెంబరు 1961 భారతిలో 'ధనంజయ ప్రవరకరమ్ము' —అను శీర్షికతో ప్రకటింపబడిన వ్యాసమునందు ప్రసంగవశమున, అర్జునుడు నీలవర్ణ శరీరుడని సెలవిచ్చిరి. దానికి సమాధానముగా శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ఫిబ్రవరి 1962 భారతిలో "అర్జును డనగా తెలుపు వర్ణము గలవాడనియు, అతని శరీర వర్ణము నీలము కాదనియు" తమ అభిప్రాయమును వెల్లడించిరి. అట్లు వెల్లడించుటలో శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు కొంత సందేహమును గూడ వెలిబుచ్చిరి. "అర్జును డనగా తెల్లనివాడని యర్థము. ఆ పేరు వచ్చుటకు కారణముగా చెప్పబడినది 'అవదాతవర్ణము'. ఆ వర్ణము నీలముగునేని 'అర్జునుడ' ని పేరు వచ్చునా ?"—ఇది శ్రీ శాస్త్రిగారికి కలిగిన సందేహము. కాని చిట్టచివరకు వారు తమ సంశయమును తామే విచ్ఛేదించుకొని, ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చిరి. ఆ యభిప్రాయ మేమనగా—అర్జునుడు తెల్లనివాడని. శ్రీ పిచ్చయ్య శాస్త్రిగారి అభిప్రాయము సరియైనది కాదనియు, శ్రీ రాళ్లపల్లివారు సెల విచ్చినదే సరియైనదనియు, నా అభిప్రాయము. ఇందులకు సంస్కృతాంధ్ర భారతముల నుండి యీ క్రింది సాక్ష్యములు మనకు లభించుచున్నవి. పాఠకోత్తములు శ్రద్ధతో గమనింతురుగాక.

1. కుంతికి అర్జునుడు జన్మించినపుడు అశరీరవాణి యీ క్రింది విధముగా పల్కినది.

శ్లో. "కార్తవీర్య సమః కుంతి శివతుల్య పరాక్రమః
ఏషశక్ర ఇవాజయ్యో యశస్తే ప్రథయిష్యతి.
(ఆది—123—38)

పూర్వ క్షత్రియ వీరులలో కృతవీరుని కుమారుడగు అర్జునుడు పరాక్రమమునకు ప్రసిద్ధి కెక్కినవాడు. ఈ పార్థుడు కూడ పరాక్రమమునందు అతనికి సమానుడో, అతనికంటె మిన్నయో అగును గాని అతనికేమాత్రమును తీసిపోడు. అందుచే నీతడు కూడ అర్జున నామమున విఖ్యాతుడు కాగలడని ఆకాశవాణి అభిప్రాయము. దీనినే నన్నయభట్టారకుడు విశదీకరించి యిట్లు చెప్పినాడు.

"విను కార్తవీర్యు కంటెను వీరు డగుట
అర్జుననామ మీతండ యొనర దాల్చు ......"
(ఆది—5—124)

అంతేకాని, తెల్లనివా డగుటచే అర్జునుడని పేరు వచ్చినదని యీ సందర్భమున—మఱియే సందర్భమున గూడ—చెప్పబడి యుండలేదు. కార్తవీర్యునకు అర్జునుడను పే రెట్లు వచ్చినదో మనకు తెలియదు కాని, ఈ ఫల్గుణునకు మాత్రము కార్తవీర్యార్జునునితో సమానమైన (లేదా అంతకు మించిన) పరాక్రమము గలవా డగుటచేత మాత్రమే అర్జునుడను పేరు గల్గినది.

2. పై సందర్భమునుబట్టి అర్జునునకు శరీర వర్ణమును బట్టి ఆపేరు రాలేదని తెలియుచున్నది. అయినచో అతని శరీరవర్ణ మెట్టిది ? దీనిని వ్యాసభగవానుని అభిప్రాయానుసారముగా నన్నయ భట్టారకుడు చాల చోట్ల మనకు తెలియజేసి యున్నాడు. కౌరవ పాండవుల అస్త్రవిద్యాపాటవ పరీక్షా సందర్భమున అర్జును డీవిధముగా వర్ణింపబడినాడు :

హారి విచిత్రహేమ కవచావృతు డున్నత చాపధారు డీ
ర్ఘోరుభుజుండు భాస్వదసితోత్పలవర్ణుడు సేంద్రచాప శం
పారుచి మేఘమో యనగ పాండవ మధ్యము డొప్పె.."
(ఆది—6—17)

ఇచ్చట అర్జునుడు 'అసితోత్పలవర్ణుడు'—అని వర్ణింపబడినాడు. అసితోత్పల మనగా నల్లకలువ. అట్టి శరీర వర్ణము గలవాడు కుంతీ తృతీయ పుత్రుడు. పై సీస పద్యమునకు మూలములైన శ్లోకములందు గూడ ఈ విషయము మరొక విధముగా చెప్పబడినది.

ఆచార్య వచనే నాథ కృత స్వస్త్యయనో యువా
బద్ధ గోధాంగుళిత్రాణః పూర్ణ తూణ స్సకార్ముకః
కాంచనం కవచం బిభ్రత్ప్రత్యదృశ్యత ఫాల్గునః
సార్కః సేంద్రాయుధ తటిత్స సంధ్య ఇవ తోయదః
(ఆది—135—8—9.

వ్యాసమహర్షి అర్జునుని మేఘముతో సరిపోల్చినాడు. నన్నయ్య దానిని విశదీకరించి 'అసితోత్పల వర్ణుడు' అని టీక చెప్పినాడు.

3. నన్నపార్యుడు పైన పేర్కొనినట్లు మరల అర్జునుని 'నీలవర్ణునిగా' ద్రౌపదీ వివాహ ప్రయత్న ఘట్టమునందు గూడ వర్ణించినాడు.

• ఇంద్రసమానున కిందీవర శ్యామ సుందరాంగున కింద్రనందనునకు దేవిగా బ్రీతితో నీని నీఁ గాంచితి ...... "
(ఆది—7—24)

4. పాండవులు ద్రౌపదీస్వయంవరమున కేగుచు దారిలో బ్రాహ్మణులను గనసికొనగా, వారు ధర్మజునితో నిట్లనిరి :

మీయందీ కృష్ణు నుదం
సాయత భుజుఁ జూచి తాన హర్షముతోడం
దోయజముఖి వరియించును
మా యెఱిగిన కార్య మిది సమంజస బుద్ధిన్''
(ఆది—7—162)

ఇక్కడ 'ఈ కృష్ణుడు' అర్జునుడే. ''దీనికి మీయందు కృష్ణ వర్ణు మహాయతభుజు జూచి''—అను పాఠాంతరము కూడ దిగువ నీయబడినది. కనుక అర్జునుడు కృష్ణవర్ణుడని నిర్ణయించుట కిదియు ఉపకరించుచున్నది.

5. మత్స్య యంత్రమును భేదించిన పిమ్మట అర్జునుడు ద్రౌపదిచే వరింపబడిన సందర్భమున అతనిని నన్నయ ఇట్లు వర్ణించినాడు :

ధరణీశ నందనుల్ దన్నతి ప్రీతితో
చూచుచు నుండంగ సుందరాంగి
తోయజదళనేత్ర ద్రుపదరాజాత్మజ
కమనీయగజరాజగమన లీల
జనుదెంచి సురరాజసన్నిభు నభినవ
యౌవనోద్భాసితు నసితరత్న
రుచిరాంగు నంగజరూపు ధనంజయు
దనజేతి సితపుష్ప దామకమున
బొలతి ముదముతోడ బూజించె ....
(ఆది—7—189)

అర్జునుడు అసితరత్న రుచిరాంగుడు. అనగా ఇంద్రనీలమణి వంటి మేని వన్నె గలవాడు. (అంతేకాని, నీలమణులచేత అలంకరింపబడిన అవయవములు గలవాడని చెప్పుకొంద మన్నను అది యిక్కడ చెల్లదు. ఎందుచేత ననగా అతడు భిక్షాటనము చేసుకొను బ్రాహ్మణ వేషమున నున్నాడు గనుక.)

6. అర్జునుడు తీర్థయాత్రకు జని గంగానదీ తీరమున హోమము చేయుచున్న సందర్భము నందలి మఱియొక పద్యమును గనుగొనుడు :

వేల్వంగ నమకట్టి వెలువడనున్న న
య్యింద్రనందను రుచిరేంద్ర నీల
సుందర శ్యామాంగు సురరాజ కరికరా
కార మహాబాహుఁ గన్గొని జూచి.'' (ఆది—8—128)

ఇచ్చట కూడ సందేహమునకు తావులేకుండ 'సుందర శ్యామాంగుడు' గా అర్జునుడు వర్ణింపబడినాడు.

7. ఇట్టిదే మఱియొక ఘట్టమున గలదు. యతివేషమున నున్న అర్జునునకు పరిచర్యలు చేయుచు సుభద్ర తనలో నిట్లు తలపోసినదట :

అలినీల కుంతలుఁ డనియును హరినీల
సమవర్ణు డనియు వాజాను లంబి
తాయత స్థిరబాహు డనియు నా రక్తాంత
నళిన దళాకార నయనుఁ డనియు
నుత్తుంగ ఘన విశాలోరస్కుఁ డనియును
గవ్వడి యనియును గరము వేడ్క
విప్వచ్చు నెప్పుడు విని యెడు నది తన
వినినట్లు యతిఁజూచి వీడు విజయుఁ
డొక్కొ యనుచు సంశయోపేత చిత్తయై .....
(ఆది—8—185)

అర్జునుని రూపము సమగ్రముగా పై పద్యమున నన్నయ మనకు తెలియజేసినాడు.

II

ఇంక తిక్కన సోమయాజి కూడ ఆయా సందర్భములందు అర్జునుడు నీలవర్ణు డనియే తెల్పినాడు.

8. ''ధరణి దుర్లభమగు నవదాతవర్ణ
మార గల్గుట నర్జును డంద్రు నన్ను'
(విరా—4—146)

అర్జునుడు ఉత్తరునితో తనకు అర్జున నామము వచ్చుటకు కారణము చెప్పినాడు. దీనికి మూలము :

పృథివ్యాం చతురంతాయాం వర్ణో మే దుర్లభస్సమః
కరోమి కర్మ శుక్లంచ తేన మా మర్జునం విదుః
(విరా—44అధ్యా—20)

ఈ శ్లోకమున అర్జునుని శరీర వర్ణ మేదో పేర్కొనబడలేదు. కాని అతడు శుక్లమైన కర్మను చేయుటచేత అతనికి అర్జును డని పేరు వచ్చినట్లు చెప్పికొనినాడు. దీనికి పిమ్మట మరియొక శ్లోకమున నిట్లున్నది.

కృష్ణ ఇత్యేవ దశమం నామ చక్రే పితా మమ
కృష్ణావదాతస్సనతః ప్రియత్వా ద్బాలకస్యవై
(విరా—44 అధ్యా—23)

అర్జునునకు పాండురాజే ''కృష్ణుడు'' అను పేరు పెట్టినాడు. ఏల ? అతని వర్ణము కృష్ణావదాతము. అనగా మిక్కిలి పరిశుద్ధమైన నలుపురంగు. 'అవదాతః సితే పీతే శుద్ధే' అని అమర కోశము చెప్పుచున్నది. స్వచ్ఛమైన నలుపురంగు గల శరీరము గలవాడు కనుకనే అతనికి కృష్ణుడను పేరు వచ్చినది. (అర్జును డనినను పరిశుభ్రమైనవాడు, స్వచ్ఛమైనవాడు అని అర్థము చెల్లును. )

[ఇక్కడ అర్జునునకు కృష్ణుడను పేరు వచ్చుటకు తిక్కన పేర్కొనిన కారణము మూలవిరుద్ధముగా నున్నది.

ఖాండవ వనమును దహించిన తర్వాత రుద్ర విరించులు అర్జును నకు 'కృష్ణుడను నేకాదశ నామంబు, నప్రతిహతంబులగు బాణం బుల నొసంగిరి'—అని యున్నది. చూడు. విరా—4—149. ఈ విషయము మూల భారతమున కానవచ్చుటలేదు. ఏది ఏమై నను, దీనిని ఆధారముగా దీసికొన్నను అర్జునుడు తెల్లని వాడని యుందు చెప్పబడుటలేదు.]

9. ఉత్తరగోగ్రహణ సమయంబున ద్రోణాచార్యుడు అర్జునుని శరీరవర్ణము నీలమని ధ్వనించునట్లు అతనిని మేఘ ములో సరిపోల్చినాడు :—

విలసద్గాండివ చాపనోద్ధతి కన ద్విద్యుల్లతా లీలగా
నలఘు స్ఫార కపిధ్వజధ్వని సముద్యద్గర్జ చందంబుగా
జలదాకారత నొందె దే రితడు పర్జన్యాకృతిం బొల్చె దో
ర్బల శీవ్రారి నిదాఘ దుర్విషహ గర్వస్ఫూర్తి నిర్మూర్తిగాన్.
(విరా—4—251)

పర్జన్యముతో సరిపోల్చబడినంత మాత్రాన అర్జునుడు నీల వర్ణుడని చెప్పుటకు ఆధారము చాలదందురేమో ? మఱి యొక పర్యాయ మిట్లే సరిపోల్చుచు తిక్కయజ్వ మన సందేహమును నివారించినాడు.

10. గాండివం బింద్రచాపంబు కరణి నొప్ప
మెఱసి దివ్య కిరీటంబు మెఱుగులడర
జ్యా నినాదంబు గర్జగా మేని కృష్ణకాంతి
బొలిచె కవ్వడి యను కారుమొగులు."
(భీష్మ—1—108)

పైన పేర్కొనబడిన అన్ని సందర్భముల యందును అర్జు నుడు కృష్ణవర్ణుడుగానే వర్ణింపబడినాడు. ఇంకను సందేహ మేమైన ఉన్నచో దానిని పూర్తిగా పారద్రోలుటకు అన్నిటి కంటె ముఖ్యతమమైన సందర్భమును మఱియొకదానిని చూపించుచున్నాను.

ఆశ్రమవాసియైన ధృతరాష్ట్రుని జూచుటకు పాండ వులు వెళ్లిరి. ఆ వచ్చిన పాండవులను సంజయుడు వేర్వేరుగా ఇట్లు వర్ణించి ధృతరాష్ట్రునికి తెల్పినాడు.

జాంబూనదచ్ఛాయ చందంబు వర్ణంబు
గలిగిన పలుచని గనపమేను
నుచిత దీర్ఘత్వ సమున్నత ఘ్రాణంబు
నిడుదలైన విశాల నేత్రములును
కంఠీరవంబు రేఖయు నొప్పఁ జూడ్కికి
వెంతయు ప్రేగ్గైన యితడు ధర్మ
తనయుడు . . . . . . .
వ్రదనంబు దనరిన మూపులు
నాయత స్ఫీతంబులైన బాహు
వులును వెడదయురంబునై పొలుచు నితడు
భీముఁడు . . . . .
ఉజ్జ్వల సుందర శ్యామ తనువు
వారణేంద్రు కైవడియును వారిజముల
యట్టి కనుదోయి గల యితం డర్జునుండు."
(ఆశ్రమ—2—40)

ధర్మజ భీములు బంగారువంటి మేని వన్నె కలవారు. అర్జునుడు శ్యామలాంగుడు (నల్లనివాడు). ఈ విషయమును వ్యాసమహర్షి కూడ పై సందర్భమునందే స్పష్టీకరించి యున్నాడు.

య ఏష జాంబూనద శుద్ధ గౌరః
తనుర్మహాన్ సింహ ఇవ ప్రవృద్ధః
ప్రచండ ఘోణః పృథుదీర్ఘనేత్రః
తామ్రాయతాక్షః కురురాజ ఏషః.
(ఆశ—25—5)

అయం పునర్మత్త గజేంద్రగామీ
ప్రతప్త చామీకర శుద్ధ గౌరః
పృథ్వాయతాంసః పృథు దీర్ఘబాహుః
వృకోదరః పశ్యత పశ్యతేమం.
(ఆశ—25—6.)

యస్త్వేష పార్శ్వేఽస్య మహా ధనుష్మాన్
శ్యామో యువా వారణ యూథపాభః
సింహోన్నతాంసో గజఖేల గామీ
పద్మాయతాక్షః అర్జున ఏషవీరః (ఆశ 25-7)

పై సీసపద్యము వల్లను, సంస్కృత భారతమునందలి పై శ్లోకముల వల్లను కౌంతేయుల శరీర వర్ణము లెట్టివో మనకు స్పష్టముగా, నిస్సంశయముగా తెలియవచ్చుచున్నవి. భారత కథలకు సంబంధించిన దృశ్య నాటకములలో ధర్మజ భీమార్జున పాత్రలను ధరించువారికి వేషములు వేసుకొనుట యందు పై శ్లోకములు మార్గదర్శకములుగా నున్నవి. సాధా రణముగా నాటకములలో అర్జున పాత్రధారి తెల్లని రంగును పూసుకొనుచున్నాడు. కాని యిది తప్పు. అర్జునుడు కూడ శ్రీకృష్ణుని వలె నల్లనివాడే.

ధర్మజాదు భీమార్జునుల శరీర వర్ణములే కాదు. పాండ వుల భార్యలలో ఎవరెవరు ఎట్టి మేని చాయ గలవారో,— ఉలూపి దేహవర్ణ మెట్టిదో, ద్రౌపది శరీరచ్ఛాయ ఎట్టిదో, సుభద్ర దేహచ్ఛాయ ఎటువంటిదో, ఉత్తర ఎట్టిదో— మొద లగు విశేషములన్నియు భారతమున విస్పష్టముగా వర్ణింపబడి యున్నవి. అంతేకాదు, పాండవుల వయస్సును గురించిన వివ రము లన్నియు—వారు ఏ యీడున రాజసూయము చేసిరో, ఏ వయస్సున అరణ్యవాసము చేసిరో, ఏ వయస్సున యుద్ధము

చేసిరో, ఏ వయస్సున మహాప్రస్థానము జరిగినదో—వ్యాస మహర్షి మనకు తెల్పియే యున్నాడు. వేయేల ? వ్యాసభగవానుడు ఒక మహా నాటకమునందలి పాత్రల నన్నిటిని రంగులతో, అలంకారములతో, వేషములతో, మన కండ్ల ఎదుట నిల్పినాడు.

శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి అభిప్రాయము సరియైనది కాదని నా మనవి. మహాభారత మహార్ణవమును మథించిన దిట్టలలో శ్రీ శాస్త్రిగారొక సిద్ధహస్తులు. వారివలన ఎన్నో నూతన విషయములను తెలుసుకొనుటకు నా వంటివారు ఉవ్విళ్ళూరుచుందురు. వారివంటి పండితులే తొందరపాటుతో పొరపాటులు చేయుచుండుట విచారకరమైన విషయము. నా వ్యాసమునందలి ఔచిత్యమును పరిశీలించి శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు అర్జునుని దేహవర్ణమును గురించిన తమ అభిప్రాయమును సరిదిద్దుకొనినచో కృతకృత్యుడ నయ్యెదను.

—మంగిపూడి కృష్ణమూర్తి.

## పరామర్శ కొక పరామర్శ

### "భారతి" సంపాదకులకు :

అయ్యా !

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు జూలై 1962 సం. భారతి సంచికలో "కాళహస్తి మహాత్మ్య పాఠపరామర్శము" అను శీర్షికలో నూతన ప్రతి యందలి పాఠములఁ గొన్నిటి నపపాఠములుగా నిరూపించి సవరింపఁ బ్రయత్నించియున్నారు. అట్లు సవరింపఁ బ్రయత్నింపఁ బడినవానిలో పూర్వ నూతన ముద్రణములందు రెండిటియందును సమానములైనవియును గలవు. వానిలో కొన్ని యపపాఠములుఁ గానేరవని నా బుద్ధికి గోచరములైన వానిని గూర్చి వ్రాయుచున్నాను. నా గ్రహించిన పాఠములు పూర్వ నూతన ముద్రణములు రెండిటి యందును సమానములే యని గ్రహింపఁ గోరిక.

### 1. "తత్పురము తూ చా."

"తత్పురము, వర్ణన సేయన్ అను క్రియకు కర్మ గావున ద్వితీయాంతము. కావున 'తత్పురముఁ దూచా' అని యుండవలెను" అని శ్రీ దీపాలవారు వ్రాసిరి. వారు "కర్మంబున ద్వితీయయగు" నను దానినే గ్రహించి "తత్పురము" నకు ద్వితీయాంతత్వమునే యంగీకరించిరి. కాని పురము జడము గావున "జడంబు ద్వితీయకు బ్రథమ బహుళముగా నగు' నను నియమము గూడ గ్రహించి యుండినచో "తత్పురము" యొక్క ప్రథమ నసాధువుగా నిరూపింపఁ బ్రయత్నింపరు.

### 2. దుర్వాసనన్ :-

దుర్వాసన యని యేకవచనాంతముగాఁ బ్రయోగింపఁబడి యుండలేదని నుడివినారు. సంస్కృత లాక్షణికుఁడగు దండి తన కావ్యాదర్శమునందు "నవిద్యతే యద్యపి పూర్వ వాసనా" అని యేకవచనాంతముగానే వాడినాఁడు. పండితరాజును తన రసగంగాధరమందు శక్తి వ్యుత్పత్త్యాది నిరూపణ సందర్భమున వాసన నేకవచనాంతముగానే వాడియున్నాఁడు. సంస్కృత కవి ప్రయోగము లెందులకని శంకింపఁ బనిలేదు. ఏలయన మనము విచారించునది తత్సమ శబ్దము గూర్చియే కదా ! ఆ శబ్దమును సంస్కృతమునుండి గ్రహించినపుడు తన్మర్యాద నేల గ్రహింపరాదు ?

ఇచట శ్రీ దీపాలవారు ఏకవచనాంతముగా నుండరాదని తెల్పి స్వవచన సమర్థక మగునట్లు ధూర్జటి ప్రయోగమునే "మానునె తొల్లిటి జన్మవాసనల్" అనుదానిని చూపినారు. ఒకచో బహువచనముతోఁ బ్రయోగించినదానిని వేఱొకచో నేకవచనాంతముగాఁ బ్రయోగింపరాదని యేదైన నియమమున్నచోఁ దెలుపఁగోరుచున్నాను. అంతియకాక వారు చూపిన బహువచనాంతము పాదాంతము నందలిది. అచట నేకవచనముగాఁ బ్రయోగింప నవకాశమే లేదు. అట్లయిన గణభంగము కాఁగలదు. అందువలననే ధూర్జటి యచట బహువచనాంతము వాడినాఁడు.

### 3. "రతి ప్రసంగములనర్థ..."

పద్యములోని తక్కిన విశేష్యముల వలెనే "ప్రసంగములు" ప్రథమలోనే యుండవలెను. లేకున్నచో అర్థము సరిపడదు. కాబట్టి ప్రసంగములు నర్థ అని మార్చవలెను— అని శ్రీ దీపాలవారు వ్రాసిరి.

కాని యా తక్కిన విశేష్యము లన్నియును (అర్థనిమీలితనేత్ర పద్మముల్, మానని చుంబనంబులు మొ॥ వి) రతి సందర్భములే గావున రతి ప్రసంగములయం దంతర్భవింపఁ జేయవచ్చును. అట్లయిన అర్థము సరిపడును. కావున "ప్రసంగముల" ను ప్రసంగములుగా మార్ప నవసరములేదు.

### 4. "విశ్వాధిక యనఁగ"

"విశ్వాధికుఁ డనఁగ విందు" అనిన గాని వాక్య మర్థవంతముగాదు." అని శ్రీ దీపాలవారు వ్రాసిరి.

"ఓ మహేశా ! నిన్ను విశ్వజని స్థితి లయకర ! విశ్వాధిక ! యనఁగ విందున్" అని చక్కగా అన్వయము కుదురుచున్నది. ఇది వారికేల యర్థవంతము కాలేదో బోధపడుట లేదు.

### 5. వలువన్

వలువన్ అను పాఠమున సముచ్చయార్థము రాదు— అని దీపాలవారు వ్రాసిరి.

అట్లు వ్రాయుట మిక్కిలి సాహసమే యనఁదగును. ఏలయన ప్రౌఢ వ్యాకర్త తన వ్యాకరణమున శబ్దపరిచ్ఛేదమునందలి నూట పదునారవ సూత్రమునందు సముచ్చయార్థకను వర్ణమును గూర్చి వివరించుచు .... "కళలగు నను దంత

శబ్దములమీద నయ్యాది (ను వర్ణము) యువర్ణపూర్వకంబుగ విభాషనగు ....'' అని వ్రాసియున్నాఁడు. ఇచట ''వలువ'' యనునది అనుదంతమును, కళయును. కావున దానిపై సముచ్చయార్థక నువర్ణము యువర్ణపూర్వకమై యొకమాఱును యువర్ణపూర్వకముగాక మఱియొకమాఱు రావలసియున్నది. ''వలువన్'' అనునది యువర్ణపూర్వకముగాని నువర్ణ మను ప్రయుక్తమైన రూపము. కాన నిచ్చట తప్పక సముచ్చయార్థము రాఁగలదు. అంతియకాక ప్రౌఢ వ్యాకర్త యీ సందర్భమున ''లేఁజిగురుగొమ్మం జేవగాకుండునే'' (రామరాజ భూషణుఁడు), ''నిడుపును దూర్పునఁ బడమరనై రెండు'' (తిక్కన) మున్నగు మహాకవి ప్రయోగములఁ జూపియున్నాఁడు. శ్రీ శాస్త్రిగారు వానిని గ్రహింతురుగాక!

—రావూరి మృత్యుంజయరావు

## నన్నయ మధ్యాక్కర

**"భారతి" సంపాదకులకు:**

అయ్యా!

భారతి 7—5—62 లో ''నన్నయ రచనలో కొన్ని సవరణలు'' అను వ్యాసము శ్రీ మంగిపూడి కృష్ణమూర్తిగారు ప్రకటించిరి. వారి 'సాహితీ సేవ' ప్రశంసనీయమైనదని సవినయముగా మనవి చేసికొనుచున్నాను. కాని, నన్నయ మధ్యాక్కర విషయమై ('' 4 కానీన'' అను విషయము దగ్గర—50 పు.) వారు సెలవిచ్చినది పునఃపరిశీల నార్హమని తోఁచుచున్నది.

''కానీన, సర్వ శస్త్రాస్త్ర విద్యలఁ గడుఁ బ్రసిద్ధుండ'' (ఆది 7—202) అను పాఠమునకు ''కాని శస్త్రాస్త్ర విద్యలయందుఁ గడుఁ బ్రసిద్ధుండ'' అని చూపఁబడిన పాఠాంతరము, మధ్యాక్కర పాదమునకు గణభంగము గలుగఁజేయుచున్నదిగాన నగ్రాహ్యమని, తాము మరియొక సవరణ చూపియున్నారు. కాని, నన్నయ మధ్యాక్కర తత్త్వ మిట్టిదని గుర్తించినవారు పై పాఠాంతరమును అగ్రాహ్యమని త్రోసిపుచ్చ రనుకొందును.

''నన్నయ మధ్యాక్కర'' యను శీర్షికతో 'ఆంధ్రపత్రిక' సారస్వతానుబంధం—22—1—61 లో నే నొక వ్యాసము ప్రకటించియున్నాను. అందు, నన్నయ మధ్యాక్కరలలోని విశేష లక్షణములనుగూర్చి చర్చించియున్నాను. అనుగ్రహింప వేఁడెదను.

''కాని, శస్త్రాస్త్ర విద్యలయందుఁ గడుఁ బ్రసిద్ధుండ'' అను పాదమును, ''కాని శ|స్త్రాస్త్ర| విద్య|యందుఁ+గడుఁ బ్రసి|ద్ధుండ'' అని గణ విభజనము చేయవచ్చును. ఇందుకు మఱియొక ప్రయోగము: ''కలుగు కొ| ఱఁగి యు|పాయపూ|ర్వమునఁ+గడఁగి త| త్సిద్ధి'' (అర. 1—234)

[ఇందు—మూఁడవ (గణ) స్థానమందలి సూర్యగణము (విన్నకోట పెద్దన, మహాక్కరకు చూపినట్లు) రెండవ స్థానమునకుఁగాని, నాల్గవ స్థానమునకుఁగాని వచ్చినప్పుడు, మరియొక సూర్యగణము రెండవచోటఁ (ఇంద్రగణ స్థానమునఁ)గాని, నాలుగవచోటఁ (ఇంద్రగణ స్థానమునఁ) గాని వచ్చి నిలుచును. అనఁగా, మూఁడవ స్థానమున నింద్రగణమును, రెండు నాలుగు స్థానములందు సూర్యగణములును నిలుచుచున్నవి.]

ఇట్టి విశేషములు నన్నయ మధ్యాక్కరలలో ననుశీలింపఁదగినవి చాలఁ గలవు. కనుక, వీనిని తొందరపడి దోషము లనుటయు, సవరింప బూనుటయు సమగ్ర సుందరమైన పరిశీలనపైఁగాని కుదురదు.

నన్నయ మధ్యాక్కరలం దంతటను ఐదవ గణారంభమున యతి నిలువు విషయము ఎల్ల రెఱిఁగినదే. నన్నయ మధ్యాక్కరలకును, ఆంధ్ర లాక్షణికులు చెప్పిన మహాక్కరలకును చాల దగ్గఱి పోలికలు గలవనువిషయమును గూడ నా వ్యాసమున విపులముగా చర్చించియున్నాను.

### నన్నయ మధ్యాక్కరలలోఁగల కొన్ని విశేషములు:

(1) మధ్యాక్కర పూర్వార్ధమున, మూఁడవ (గణ) స్థానములో నుండవలసిన సూర్యగణము, రెండు—లేక, నాలుగు స్థానములకు వచ్చినిలుచును.

1. ''తో నేఁగె| నుత్త| రముమించి| ధర్మని+త్యుఁడు ధర్మ|రాజు'' (అర 4—3)

2. ''భూపాల! నీకు ని| క్కోమలి| యందుఁ+బుట్టిన| సుతుఁడు'' (ఆది. 41—177)

(ఈ పై విశేషము తొలుత సూచించినవారు డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు).

(2) మూఁడవ (గణ) స్థానములో నుండవలసిన సూర్యగణముతోఁబాటు వేఱొక సూర్యగణముగూడ వచ్చి రెండు—నాలుగు స్థానములందు నిలుచుచున్నది.

3. ''మాయమా| ర్గుఁడగు| వాని| గమనంబు+మంద మై|యుండ'' (అర. 3—386)

4. ''కలుగు కొ| ఱఁగియు| పాయపూ| ర్వమునఁ+గడఁ గిత|త్సిద్ధి'' (అర. 1—234.)

పై నాలుగు విధముల విశేషములను మఱి పది చోటులఁ జూడనగును. మఱియు, పూర్వార్ధమున బొత్తిగా సూర్య గణమే లేక ఈ క్రింది పాదము కన్పట్టు చున్నది.

''తనుమధ్య| దానొక్క| కన్యక| సురనదీ+తటమున| నున్న'' (ఆది 4—142)

కాని, ఇందలి 'కన్యక'ను 'కన్య' నుగా మార్చవచును.

''పదుంద్రఁ| బోలెడు| సుతుల| మార్చురఁ+బడయంగ| వలతొ'' (అర 2—351)

అనుదానిలోని ''పదుంద్ర''ను శబ్ద రత్నాకరకారులు ''పదుగుర''నుగా గ్రహించిరి; ''పదుగుంద్ర''నుగా గ్రహించుట యుక్తతరమని నా యభిప్రాయము.

—బండి నాగరాజు

# గ్రంథ విమర్శనము

## న్యాయసారః

(న్యాయ ముక్తావల్యా న్యాయ కలానిధి నానచ సమేతః).

[మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ సీరిస్ నెం. 167 ప్రచురణ కర్తలు : మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ, మద్రాసు. రాయల్ ¼ పేజీలు మొత్తం 666. వెల : రు 18]

మద్రాసు గవర్నమెంటువారి యాజ్ఞచే ప్రచురింపబడుచున్న గ్రంథ పరంపరలో వెలువడిన అనేక ఉత్తమ గ్రంథములలో నిది యొకటి. న్యాయసారము భాసర్వజ్ఞ విరచితమైన గొప్ప న్యాయ (తర్క) శాస్త్ర గ్రంథము. ఇది క్రీ. శ. 9 వ శతాబ్దాంతమందో దశమ శతాబ్దాది యందో రచింపబడినదని ఉపోద్ఘాతములో చక్కగా నిర్ణయించినారు.

14 వ శతాబ్దములో గంగేశోపాధ్యాయులు రచించిన తత్త్వచింతామణిలో, న్యాయశాస్త్రము క్రొత్తదారి తొక్కి, నేడు తర్కశాస్త్ర మని ప్రసిద్ధిపొందిన నవీన న్యాయ మారంభమైనది. గౌతమన్యాయసూత్రములో ప్రథమమున గ్రంథరూప మొందినప్పటినుండి, 13 వ శతాబ్దాంతములోని ఉదయనాచార్య శివవిద్యాచార్యుల వరకు ఆ శాస్త్రము పూజ్యపాదులైన ఆచార్యుల హస్తములలో నుండెననియు, అది నవీన న్యాయముతో పండితమాత్రుల హస్తగత మయ్యెననియు తద్విదు లందురు. "The race of giants was to be succeeded by a remarkably versatile and disputatious troop of dwarfs. Philosophy lost its freshness as well as its charm, and gradually degenarated into a bundle of endless controversies." అని శ్రీ మహాదేవ్ రాజా రామదాస్ అన్న వాక్యములు కఠినముగా నున్నను సత్యేతరములు కావు. న్యాయసార మట్టి యాచార్యకోటిలోని నైయాయికుని గ్రంథ మగుటచే సంభావ్యమైనది. అందులో గ్రంథకర్త సూత్ర వ్యాఖ్యాతలను విమర్శించుటేకాక, ఒకటి రెండు స్థలములలోగౌతమ సూత్రముల ప్రత్యక్షార్థమునకు మరొక విధముగా సమయమ్ము సూచించినాడు. దీనికి అథమ పక్షము 18 వ్యాఖ్యలైన పుట్టినట్లు ఆధారము కలదు. వానిలో 7 మాత్రమే నేడు ఉపలభ్యమవుచున్నవి.

ఈ వ్యాఖ్యానములలో వాసుదేవ విరచితమైన న్యాయన సారపదపంచిక మాత్రము ఇంతకు పూర్వము పూనావారు ప్రచురించినారు. ఈ గ్రంథముతో మొదటిసారి ప్రచురింపబడిన రెండు వ్యాఖ్యానములలో న్యాయముక్తావళి యనునది విశిష్టమైనది. 12 వ శతాబ్దియందు కొంకణ రాజ్యమేలిన అపరార్కదేవుడను ప్రభువు దానిని రచించెను. ఇది స్వతంత్రముగా సమర్థతతో సాగిన గ్రంథము. దీనిలో న్యాయమతమును ఖండించిన బౌద్ధ జైన సాంఖ్య మీమాంసక మతాచార్యులనే కాక, తాను స్వయముగా నద్వైతియై యుండియు, మోమోటము లేకుండ, వాచస్పతి మిశ్రుల భామతిని గూడ కొన్ని సందర్భములలో ఖండించెను.

న్యాయకళానిధి అసంపూర్ణ వ్యాఖ్యానము. ఐనను న్యాయశాస్త్రము నవీన మార్గము పట్టకముందు 13 వ శతాబ్దములో నది వ్రాయబడినందున, దాని విలువ గ్రహించి విడిగా చివర అచ్చు వేసినారు. ఇది న్యాయశాస్త్రాభిమానులకు ఎంతయు సమ్మోదావహము కాగలదు.

గ్రంథ సంపాదకులలో శ్రీ ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి ఆంగ్లమునను, శ్రీ వి. సుబ్రహ్మణ్యశాస్త్రి సంస్కృతములోనును ఉపోద్ఘాతములు వ్రాసిరి. అవి రెండును భిన్న మార్గములతో ప్రసరించి, ఆంగ్ల సంస్కృత విద్వన్మార్గముల ప్రదర్శించుచు ఉత్తమ స్థాయిలో నున్నవి.

భాసర్వజ్ఞుడు కశ్మీరుడని నిర్ధారణ చేయుచు ఆంగ్లోపోద్ఘాతములో తెలిపిన రెండు కారణములును తృప్తికరముగా లేవు. (1) సర్వజ్ఞ మిత్రుడు, సర్వజ్ఞ దేవుడు అనువారు కశ్మీరులు. సర్వజ్ఞ ఉపనామ ముండుటచే భాసర్వజ్ఞుడు కశ్మీరుడై యుండు ననుట మొదటిది. (2) గ్రంథము 'ప్రణమ్య శంభుమ్ జగతః పతిం పరమ్—' ఇత్యాదిగా శైవస్తోత్రముతో ప్రారంభించినది. ఆ కాలములో కశ్మీరములో శైవము విస్తార

ముగా వ్యాపించియుండినందున అతడు కశ్మీరుడై యుండు నని ధ్రువపడుచున్న దనుట రెండవది. మొదటి కారణమునకు మూలమైన సర్వజ్ఞ శబ్దము తక్కిన ఇద్దరిలో నామాదియం దుండగా ఈతనిలో నామాంతమందున్న భేదము గూడ వారు గమనింపలేదు. అంతేకాక ఒక్క ఆంధ్రదేశములోనే సర్వజ్ఞ, సర్వజ్ఞచక్రవర్తి బిరుదధారు లెందరో ఉండుట జగత్ప్రసిద్ధము కదా ! రెండవ కారణముగా చెప్పిన శివభక్తి ఆసేతు హిమాచలము సర్వకాల సాధారణమైనందువలన ప్రాంత నిర్ధారణ చేయుట కెంతమాత్రము నుపయోగపడదు. అది కాక కొన్ని గ్రంథములలో ఈ ఆదిమ శివస్తోత్రమునకు ఈ క్రింది పాఠాంతరము కలదని అథసూచికలో ముద్రించిరి.

'యత్త్ర ద్బ్రహ్మ జగద్బీజ మామనంత్యాగమోక్తయః
శ్రీమచ్ఛివకర గ్రామ వాస్తవ్యం వస్తుతం (తత్)స్తుమః'

ఈ పాఠాంతరము గ్రహించినచో రెండవకారణము నిరాధార మగును. ఆ శివకర గ్రామ మెక్కడిదో విచారించినచో కొంత సత్యము తేలెడిదేమో ! అంత మంచి ఉపోద్ఘాతములో ఇట్టి నిరాధారమైన ఊహ సిద్ధాంతమని భ్రాంతి కలిగించునట్లు వ్రాయుట సంభావ్యముకాదు. **Even Homer nods.**

విషయానుక్రమణిక 50 పేజీలు పట్టినది. గ్రంథస్థ విషయములు సమగ్రముగా తెలిసికొనునట్లుగా సంపాదకు లిందులో ఓపికతో కావించినకృషి ఎంతయు శ్లాఘాపాత్రముగా నున్నది. పాఠకుల కిది విశేషోపయోగకారి కాగలదు.

కాని అది ఎవరి లోపమువలన సంభవించినదైనను, విషయానుక్రమణిక తర్వాత దేవనాగరి లిపిలో వేసిన 'శ్రీ భా సర్వజ్ఞ విరచితే న్యాయసారే' ఇత్యాదికమైన హెడ్డింగులు తల క్రిందుగా పడుట మాత్రము క్షంతవ్యముకాదు.

ఇట్టి ఉత్తమ గ్రంథమును చక్కని తీరులో ప్రచు రించినందుకు నైయాయికులు మద్రాసు గవర్నమెంటు ఓరి యంటల్ సీరిస్ వారికి కృతజ్ఞులై ఉండెదరు.

—నోరి నరసింహశాస్త్రి

# స్తోత్రార్ణవః

[ప్రకాశకులు : మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు సీరీస్ నెం. 70. సంపాదకులు : టి. చంద్ర శేఖరన్, ఎం. ఎ. ఎల్. టి; రాయలు ¼ పేజీలు 780—వెల రు. 20—30. న. పె.]

మద్రాసు గవర్నమెంటువారి యాజ్ఞచే ప్రచురింపబడు చున్న పై గ్రంథ పరంపరలో ఇది మరియొక ఉత్తమ గ్రంథము. దీనికి మదరాసు గవర్నమెంటు ఓరియంటలు మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ క్యూరేటరుగారే స్వయముగా సంపాద కత్వము వహించుట విశేషము.

ఈ సంపుటములో చేతనయినంత వరకు ఇంతకు పూర్వము ముద్రితములు కాకున్న స్తోత్రములే ముద్రింప బడినవని ఉపోద్ఘాతములో వ్రాయుచు ఒకటి రెండు స్తోత్రము లెక్కడైన అచ్చయి యుండవచ్చునని తెలిపినారు. ముందు గ్రంథము పేజీలు తిరుగవేయు చుండగానే 84, 85 పేజీ లలో అచ్చయిన శ్రీ నమస్కార దశక స్తోత్రములోని 9 వ శ్లోకము 'నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యామ్' ఇత్యాదిగా కంటబడినది. అది నా బాల్యములో మా తల్లిదండ్రులు చదువుచుండినదని తోచి తక్కినది చదు వగా అంతయు విన్నదానివలె స్ఫురించినది. అట్లే 75, 76 పేజీలలో శ్రీ అరుణాచలస్తోత్రమని ముద్రితమైన 'వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం ........ వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివమ్ శంకరమ్' అను శ్లోకముతో ప్రారంభించిన స్తోత్రము కూడ మా తల్లి దండ్రులు తరుచుగా చదువుచుండినదే కాక నాకే బాల్యములో కంఠస్థమైనది. అని ఎన్నడో తెనుగు లిపిలో అచ్చయి ఆంధ్ర దేశములో బహుళ వ్యాప్తి చెందినని. 425-428 పేజీలలో ముద్రితమైన గోవిందరాజ సుప్రభాతము ఆర్. వెంక టేశ్వర కంపెనీవారు స్తోత్రార్ణవః అను పేరుతో మూడు తరంగములుగా ప్రచురించిన గ్రంథములో రెండవ తరంగములో 208—211 పేజీలలో ముద్రితమైనది. మరికొన్ని కూడ ఎక్కడెక్కడనో ముద్రితములై యుండవచ్చును. ఉత్తమ స్తోత్రముల విలువ ఎన్నిమారులు పఠించినను తరుగునట్లే, ఎన్ని మారులు ముద్రించినను తరుగనేరదు.

స్తోత్రములు అనంతములు. పురాణములలో లభ్యమగు ఉత్తమ స్తోత్రములే అనేకములు కలవు. రచయితల భేద మునుబట్టి స్తోత్రములును అనంతమార్గముల కనిపించును. కావ్యరచన చేయు నుబలాటము కలవారు సామాన్యముగా స్తుతి కావ్యముతో నారంభింతురు. స్తుతులు కనుక ఎట్టివైనను వాని నితరులు తీవ్రముగా విమర్శింపరు. స్తోత్రవాఙ్మయ మందుచే మహోదధి వంటిది. అందులో అమూల్య రత్న ములే కాక, నేత్రములకు విభ్రమము కలిగించు వర్ణరూపము లతో ప్రకాశించు గుల్లలును, కేవలము నత్తగుల్లలు కూడ దొరుకును. రత్నముల నేరుటే కష్టసాధ్యము.

ఈ సంకలనములోని స్తోత్రము లన్నియు అనర్ఘ రత్నము లన వీలులేదు. ఏ సంకలనమునందును అది సాధ్యపడదు.

సంపాదకులు విద్వాంసులును అనుభవముకలవారును అగుట వలన ఏదో ఒక విశిష్ట గుణము లేని స్తోత్ర మిందులో చేర్చ లేదని నిశ్శంసయముగా చెప్పవచ్చును.

ఈ స్తోత్రములను అధిష్ఠానదేవతా భేదమును బట్టి వేరువేరుగా ముద్రించినారు. 'ఆదౌపూజ్యో గణాధిపః' అను సూక్తి ననుసరించి శ్రీ గణేశ స్తోత్రములతో గ్రంథారంభము కావించి, శ్రీ మంగళాష్టకముతో గ్రంథసమాప్తి చేసినారు.

వరుసగా గణేశ స్తోత్రములు 10, శ్రీ శివస్తోత్రములు 57, శ్రీ విష్ణుస్తోత్రములు 17, శ్రీరామ స్తోత్రములు 26, శ్రీ కృష్ణ స్తోత్రములు 19, ఉన్నవి. ఆపిమ్మట ప్రకీర్ణ స్తోత్రము లారంభమైనవి. అవి 44. అందులో కృష్ణమంగళ స్తోత్రము, నటేశస్తవము, రామానుస్మృతి, గణేశ పూర్వోత్తర శతకములు, మహాదేవాష్టకము వంటివి కూడా ఏల చేర్చబడినవో తెలుపలేదు. వాని తర్వాత సుబ్రహ్మణ్య స్తోత్రములు 6, దేవీ స్తోత్రములు 30 చేర్చినారు. ఈ రెండును ప్రకీర్ణ స్తోత్రముల కంటె ముందు ముద్రించినచో సక్రమముగా నుండెడిది.

మొదట 1958 లో శ్రీ ఎన్. ఎస్. రామానుజం యిక్కడ సంస్కృత పండితులుగా నుండి ఈ గ్రంథము వ్రాతప్రతి చాలవరకు సిద్ధముచేసి పిమ్మట పూనా వెళ్లిరట. మరల తక్కిన వ్రాతప్రతి 1961 లో అచ్చుకు తయారు చేయబడినదని ఉపోద్ఘాతములో తెలిపిరి. ప్రూఫ్‌లలో ప్రెస్సువారు ఎంతో ఓపికతో ఎన్నో తప్పులు సవరించినట్లు కూడా అందులోనే వ్రాసిరి. అట్లయినను శుద్ధాశుద్ధ సూచి 13 పేజీలు నిండుటయే గాక, అందులోని కెక్కని తప్పులు ఇంకను ఎన్నో మిగిలియుండుట (ఉదా. పే. 101, పం. 10 "రంభా కనన వాటికా విహారణోద్యుక్త(స్త్రి)యా గోచరః"— కానన అని యుండవలె) ఇట్టి ఉద్గ్రంథ ప్రచురణలో శోచనీయము.

శ్రీ మంగళాష్టకముతో కలిపి యీ సంపుటములో మొత్తము 210 స్తోత్రము లున్నవి. ఇన్ని ఉత్తమ స్తోత్రములు, ఎక్కువ భాగము క్రొత్తవి, ఏకముఖముగా ప్రకటించినందుకు భక్తులే కాక, విద్వాంసులును, కవులును, సహృదయులును మిక్కిలి ఆనందింతురు. వారు మరల మరల తమ తమ అభిమాన స్తోత్రములను పఠించుచు భగవన్మాహాత్మ్యములో లీనము కాగలరు. మల్లికార్జున పండిత కృతమైన శ్రీముఖ దర్శన గద్యము ఆంధ్ర పాఠకులకు ప్రత్యేకముగా ప్రీతి భాజనము కాగలదు.

—నోరి నరసింహశాస్త్రి.

# ప్రస్థానత్రయము

## (సుధావ్యాఖ్యానమేతమ్)

(రచయితలు : శ్రీ శ్రీ శ్రీ శంకరానందగిరి స్వాములవారు, ప్రకాశకులు : శ్రీ సద్గురు ప్రణవానందాశ్రమము, గంజిగుంట మఠము, వజ్రకరూరు (పోస్టు), (వయా) గుంటకల్. పుటలు : 770+12. డెమ్మీ 1/8 వెల : రు 8 లు. కాలికో బైండు.)

త్రిమతస్థులు ప్రమాణ గ్రంథములుగా అంగీకరించు భగవద్గీత, బ్రహ్మసూత్రము, దశోపనిషత్తులు—ఈ శ్రుతి న్యాయ స్మృతిప్రస్థానములు మూడును ఒకే కోశములో కలిపి ప్రచురించుట ఇందులోని విశేషము. మూల గ్రంథముతో పాటు శ్రీ విద్యాశంకర భగవత్పాదుల భాష్యముల ననుసరించి శ్రీ శంకరానంద గిరిస్వాములవారు వ్రాసిన తెలుగు తాత్పర్యము కూడ ఇందులో కలదు. వ్యాఖ్య సులభగ్రాహ్యముగా నుండి మూలగ్రంథార్థమును విశదీకరించుచున్నది. సద్గురు ముఖమున ప్రస్థానత్రయమును అధ్యయనము చేయు నవకాశము లేనివారికి, ఆ గ్రంథముల స్వరూపమును స్థూలముగా ప్రదర్శించుటకు ఈ కోశము మిక్కిలి ఉపయోగకారిగా నుండగలదు. ఒకే కోశములో మూడు మహా గ్రంథముల తాత్పర్యమెంతవరకు బోధపరచుట సాధ్యమో అంతవరకు దీనిలో సాధింపబడినది. రెండు ఉపనిషత్తులలో కొన్ని భాగములు మాత్రము వదలబడినవి.

మూలార్థమును తమ తాత్పర్యములో వివరించుటకు శ్రీ స్వామివారు ఎంతో శ్రద్ధ తీసుకున్నారు. ఐనను స్వల్ప విషయములలో ఎన్నో పొరపాట్లు దొరలినవి. ఉదా :—ఛాం. ప్ర. 1, ఖం. 2, పేజీ. 539:

పునరేవ జానశ్రుతిః పౌత్రాయణ స్సహస్రంగవాం నిష్కమశ్వతరీ రథం దుహితరం తదాదాయ ప్రతి చక్రమే. 3.

తగ్ం హాభ్యువాద రైక్వేదగ్ం సహస్రం గవా మయం నిష్కోఽయ మశ్వతరీ రథ ఇయం జాయాఽయం గ్రామో యస్మిన్నా స్సేఽన్వేవమా భగవశ్శాధీతి. 4.

పై వానిలో 4 వ వాక్యము తాత్పర్య మిట్లు వ్రాసి వారు. "ఓ రైక్వదేవా ! ఈ వేయి గోవులను కంఠాభరణమును రథమును నా ఇల్లాలు నా బిడ్డయు నీ వుండు గ్రామము ఈ సర్వస్వము నీకే నీయువియే. న న్ననుగ్రహించి నాకు జ్ఞానోప దేశము చేయుమనెను."

జానశ్రుతి తన కూతురును రైక్వునకు భార్యగా నర్పించెనే కాని తన ఇల్లాలి నర్పింపలేదు. పై తాత్పర్య ములో అశ్రద్ధ వలన మిక్కిలి అసమంజసమైన భావము వచ్చినది. ఉపనిషత్తులలో ఎన్నో ఉత్తమమైన కథలు కలవు. ఇట్టి విపరీతార్థములు వ్రాసినచో, అవే ప్రమాణములుగా తీసికొని అల్పజ్ఞులు తమ తమ ఊహల కొలది వేదకాలము లోని దురాచారములని సిద్ధాంతములు చేయు ప్రమాద మున్నది. అశ్రద్ధవలన నిట్టి పొరపాట్లు గ్రంథములో అసం ఖ్యాకముగా దొరలినవి.

(2) పే. 537 పం. 5 'రెండవ హంస'—కాదు, మొదటిది.

(3) పే. 552 "అథహైనం వాగువాచ యదహం వసిష్ఠాస్మి త్వం తద్వసిష్ఠోఽసీత్యథ హైనం చక్షురువాచ యదహం ప్రతిష్ఠాఽస్మి త్వం తత్ప్రతిష్ఠాఽసీతి."

"అప్పుడు వాక్కు ముఖ్య ప్రాణమును గురించి నేను వశిష్ఠుడనై యుండినది (పెద్దవాడనై యుండినది) నిజ ముగా నీవు ప్రతిష్ఠితుడవై యున్నందువలననే యని పలికెను'.'

పై తాత్పర్యములో చక్షుస్సు పలికిన సంగతియే పోయెను. వాక్కు 'నీవు వసిష్ఠుడవై యుండుటవలననే నేను వసిష్ఠుడనైతి' ననెను. చక్షుస్సు 'నీవు ప్రతిష్ఠితవై యున్నందు వలననే నేను ప్రతిష్ఠ నందితిని' అనెను.

(4) పే. 531; పం. 3 లో 'అంతరిక్షం గీః పృథివీ థ మాదిత్య ఏ వోత్' అను మూలపంక్తి అర్థము పోయినది. చివర కొంతభాగము కూడ వదలబడినది.

(5) 2 వ పేజీలో ఈ అధస్సూచిక యున్నది.

"ధృతరాష్ట్ర ఉవాచ : సంజయ ఉవాచ" అన్నట్లే ఇచట "దుర్యోధన ఉవాచ" అను వాక్యమును చేర్చుట సమంజసము.".

ఇది భగవద్గీతలో అ. 1 శ్లో. 3 కు సంబంధించినది. పై సూచిక పవిత్రమైన మూల గ్రంథమునకు సూచించిన మార్పు. ఆ క్రిందటి శ్లోకములోనే 'దుర్యోధనః .... రాజా వచన మబ్రవీత్' అని ఉన్నది. 'దుర్యోధన ఉవాచ' అని చేర్చుట పునరుక్తి కాబట్టి అధస్సూచిక అసమంజసమే కాక సాహసవచనము.

వేదాంత శాస్త్రమునకు పరమ ప్రమాణ మైనది ఉపనిషద్వాఙ్మయము. ఉపనిషదర్థములను వివరించుచు, వానికి ఏకవాక్యత చేకూర్చుచు, సందర్భవశమున అప్పటికి పుట్టిన పర మతములను ఖండించుచు, బాదరాయణులు చేసిన సూత్రగ్రంథము బ్రహ్మసూత్రము. ఈ రెండు గ్రంథము లును అధ్యయనము చేయుటకు పూర్ణాధికారులు బ్రహ్మ నిష్ఠులైన తురీయాశ్రములు మాత్రమే. భగవద్గీత యట్లు కాక వేదమునకును వేదాంతమునకును నిర్మించిన సేతువు వంటిది. అది బ్రహ్మనిష్ఠులైన సన్యాసులనే కాక బ్రహ్మ నిష్ఠులు కాదలచు కర్మనిష్ఠులను గూడ ఉద్దేశించి చెప్ప బడిన గ్రంథము. విధ్యుక్తధర్మమునుండి తప్పించుకొను టకు మెట్టవేదాంతులు పలుకు వాక్యములు పలికిన అర్జునుని శ్రీకృష్ణ భగవానుడు శిక్షించి స్వకర్మానుష్ఠానమునకు ప్రేరే పించిన దీ గ్రంథ విషయము. సులభ సంస్కృత భాషలో నున్నందున నది జగత్ప్రసిద్ధి కాంచినది. ప్రస్థానత్రయ ములో ముందు ఉపనిషత్తులు, తర్వాత బ్రహ్మసూత్రము, చివరకు భగవద్గీత ఉండుట సరియైన వరుస. ఈ ప్రచురణ ములో క్రమము దానికి విపరీతముగా నుండి భగవ ద్గీతతో నారంభించినది. రాబోవు ముద్రణములలో ఈ వరుస మార్పు చేసిన బాగుండును.

దీనితో బ్రహ్మసూత్రము అచ్చు వేయుటలో సూత్ర భాగము ఒక వైపులోను తాత్పర్యాదులు వేరు వైపులోను వేసినారు. భగవద్గీత, ఉపనిషత్తులు మూలము తాత్పర్యము ఒకే వైపులో అచ్చు వేయబడినవి. అట్లు కాక అవికూడ మూలము తాత్పర్యము వేరు వేరు వైపులలో ముద్రించిన నెక్కువ బాగుండెడిది.

అచ్చు తప్పుల పట్టిక 3½ పేజీ లున్నది. అందు లోని కెక్కని తప్పు లింకా ఉన్నవి. ఐనను ఇంత గ్రంథములో అవి ఎక్కువ కావు. తక్కువ అచ్చుతప్పు లున్నందుకు ప్రక టనకర్తలు ప్రశంసార్హులు.

మొత్తముమీద గ్రంథము వేదాంతశాస్త్రమందు ఆస్థ గలవారు పఠింపదగినది. పైన చూపిన స్వల్ప దోషములు ఇట్టి ఉద్గ్రంథము నిర్దుష్టముగా నుండవలెనను తాత్పర్య ముతో చేసినవి మాత్రమే యని విజ్ఞులు గ్రహింతురుగాక !

—నోరి నరసింహశాస్త్రి

# గ్రంథ విమర్శనము

## కావ్యానుశీలనము

[రచయితలు:—యం. కులశేఖరరావు, పి. యశోదారెడ్డి. ప్రాప్తిస్థానము:—వేంకటరమణ పబ్లికేషన్సు, సుల్తాన్‌బజారు, హైదరాబాదు, వెల: నాలుగు రూపాయలు.]

"కావ్యానుశీలము" విమర్శాత్మకమయిన గ్రంథము. ఇందేడు వ్యాసము లున్నవి. "నన్నెచోడుడు చిత్రించిన పార్వతి", "నైషధము—సందేశ ఘట్టము", "విజయ విలాసము" అను మూడు వ్యాసములను యం. కులశేఖరరావుగారు రచించిరి. "ఉత్తర హరి వంశమునందలి సామెతలు—జాతీయములు", "పాండురంగ మాహాత్మ్యము", "యయాతి చరిత్రము", "ముగ్గురు ఆంధ్ర కవియిత్రులు" అను నాలుగు వ్యాసములను పి. యశోదా రెడ్డిగారు రచించిరి.

" ఆ యా కావ్యాధ్యయనముపట్ల మాకు గల ఆసక్తి వలననేమి, వృత్తిధర్మముచేనేమి, ప్రాచీనాంధ్ర కావ్యములను విమర్శనాత్మకదృష్టితో పరిశీలించుట సంభవించినది. ఆ సందర్భమున కావ్యేతివృత్తము, రచనారీతి, కథాసంవిధానము మున్నగు వానికి సంబంధించిన వివిధ విశేషములు రమణీయములై కాన్పించినవి. తనకు గలిగిన అనుభూతిని సహృదయులకు నివేదించుకొనుట మానవనైజముకదా! ఆ స్వాభావికోత్సాహమే "కావ్యానుశీలన" స్వరూపమును దాల్చినది" యని రచయితలు "ఆకాంక్ష"తో బేర్కొనిరి. గ్రంథకర్తల ఈ "ఆకాంక్ష" యభినందింపదగ్గది. ఏలయన మన ఈ యాంధ్ర భాషలో విమర్శ వాఙ్మయము బహుస్వల్పము. ఉత్తమ విమర్శకులయినవారే కొలదిమందియో యున్నారు. ఇక మిగిలినవా రుత్తమ విమర్శకులు కారు. వారి విమర్శ సహృదయ విమర్శకాదు. ఒక కవిని మెచ్చుకొనుటకుఁ బదిమంది కవులపై దుమ్మెత్తిపోసిన వారు కొందరు. కావ్యమునకుగాక, కావ్యకర్త పదవులకుఁ బ్రాభవములకు నధిక ప్రాధాన్య మొసఁగి, మోమోటమును గొంత కక్షిగా నంగీకరించి, విమర్శ చేసినవారు కొందరు. రాగద్వేషములు కరుడుగట్టగా నొకా నొక ప్రత్యర్థిని దృష్టియందుంచుకొని, కావ్యపరిశీలనము గావించినవారు కొందరు. ఆ ప్రత్యర్థి స్వప్రతిభనుబట్టి హేతుబద్ధములయిన యొక కొన్ని సాహిత్య సిద్ధాంతములు చేయును. ఆ సిద్ధాంతములకు ఖండనములు బయలుదేరును. ఈ ఖండనములకు మూలము వివేకముగాదు. మఱి విద్వేషము. ఈ ఖండనకర్తలా ప్రత్యర్థికి నచ్చని కవిని దీసికొని యా కవి కావ్యమునందులేని గుణముల నెక్కువగా, మున్న దోషములను దక్కువగాఁ బ్రకటించి, "యితనిని మించిన మహాకవి మఱియొకఁడులేడు. తరవాతి కవుల కెల్లర కీతఁడే భిక్ష పెట్టినాఁడు. పరప్రత్యయనేయబుద్ధుల కీ మహాకవి యనంతముఖశిల్పము గోచరింపదు. మహా ప్రతిభాశాలికే ఈ మహాకవి కావ్య రహస్యములు గోచరించు"నని కొంత పరనింద, కొంత యాత్మ ప్రశంసచేసి యేదో యొక కృత్రిమ సిద్ధాంతము చేయుదురు. వారు చేయు విమర్శలో గావ్యకర్త ప్రతిభకంటె, వారి ప్రతిభయే సర్వదా సాక్షాత్కరించును. అనఁగా వారి విమర్శయంతగా నేలవిడిచి సాము చేయుచున్నమాట. కావ్యతత్త్వ విచారముకంటెఁ గావ్యగత శాబ్దిక పరామర్శ చేయుటయే విమర్శకుఁ బ్రాణభూతమని భావించినవారు కొందరు. "ఈ కవి యా గ్రంథమునుండి ఈ మాటను దీసికొనెను. ఈ గ్రంథమునుండి యా మాటను దీసికొనెను. ఈ మాట యా కవిది. ఆ మాట ఈ కవిది" యను పోకడలు పోవునట్టిది వారి విమర్శ. తా మువయోగించిన పదము లే గ్రంథమునందయిన నుండవా? యను నాత్మ విచార మీనిఘంటు పరిశీలనా నిపుణులకుఁ గిట్టదు. ఇంకఁ గొందరున్నారు. కావ్యములో నెన్ని "ఇజము" లున్నవని పరిశీలించుటయే యా నవీన యుగ తత్త్వాన్వేషకుల పని.

"కావ్యానుశీలన" మిట్టి విమర్శాభాసములతోఁ గూడిన గ్రంథముగాదు. రచయితలు నిష్కల్మష హృదయముతోఁ, జిత్తశుద్ధితోఁ గావ్య విమర్శ చేసిరి. రాగద్వేషములకు రచ్చపట్టుగానిది ఈ రచయితల వాక్కు. ఆ వాక్కునకు వన్నెవెట్టినది ఈ గ్రంథమునందలి సరళమయిన గ్రాంథిక శైలి. ఈ శైలిలో స్పష్టత యెక్కడను మొక్కపోలేదు. రచయితల "యాకాంక్ష" ఎంతవఱకు నెఱవేరినది? యనునది యొక ప్రశ్న. ఈ ప్రశ్నకు "నన్నెచోడుడు చిత్రించిన పార్వతి", "నైషధము—సందేశ ఘట్టము" "ఉత్తర హరివంశమునందలి సామెతలు - జాతీయములు", "విజయ విలాసమునందలి కథా సంవిధానము" నను నాల్గు వ్యాసములు సమాధానములు. పార్వతీ మనస్తత్త్వ పరిశీలనము చేయుటలో, నలదమయంతుల మర్మ గర్భిత సంభాషణములను వివరించుటలో గావ్యానుశీలనగ్రంథకర్తలు కృతకృత్యులయిరి. ఉత్తర హరివంశమునందలి సామెతలను, జాతీయములను విపులముగా సుందరముగా వ్యాఖ్యానించిరి. విజయవిలాసమునందలి కథ యల్పము. కాని, వేంకటకవి యా యల్ప కథ నెట్లు సొగసుగాఁ

దీర్ఘదిద్దెనో తద్వాసకర్త గారు ముచ్చటగా వివరించిరి. మిగిలిన వ్యాసములలో విమర్శ యను పదార్థము చాల తక్కువ. ఎడనెడ పద్యముల నుదాహరించుచు, విమర్శ చేయక కథ చెప్పుచుఁబోయి నారు గ్రంథకర్తలు. "యయాతి చరిత్ర" మందలి కథాబంధ విమర్శ యుత్తమముగా నున్నది. శేషవ్యాసమంతయుఁ, బద తాత్పర్య వివరణముతో నిండియున్నది. ఇది లోతులుచూపు విమర్శ గాదు. కవి, కవయిత్రుల ప్రతిభాదులఁ ప్రశంసించుటలో నొక్కొక్కచోట నతిశయోక్తులు దొరలినవి.

"రచనాపద్ధతియందును, అలంకారాన్విత వర్ణనలోను శయ్యా విధానమునందును ఈ కవి (వేంకటకవి) వసుచరిత్ర కారుని సాయముగా తీసికొని, కావ్య నిర్మాణమునకు పూనుకొని నాడు. ఇఁక పాత్ర పోషణలో ఇతని మార్గ మితనిదే" యని కుల శేఖరరావుగారు పేర్కొనిరి. (పుట 78). శ్లేష రచనా పద్ధతిలో వేంకటకవి వసుచరిత్రకారుని ననుసరించినవాఁడనుట లెస్స యయిన నగునేమో! వేంకటకవి శ్లేషరచన మం దనితరసాధ్య మయిన లాలిత్య మెక్కువ. అలంకారాన్విత వర్ణన యనుదాని కర్థమేమి? అలంకారాన్విత వర్ణన యొక వసుచరిత్రకారుని సమ్మత్తెగాదు. అది ప్రబంధ కవుల యుమ్మడి సొత్తు. శయ్యా విధానమునందు వేంకటకవి రామరాజభూషణు ననుసరించె ననుట పొసఁగదు. ఏలయన వేంకటకవి "సంగీత రహస్య కళా నిధి"గాదు. అందుచే, నతని కావ్యశయ్య ప్రసాద మాధుర్య గుణములుకలదేగాని సంగీతాత్మ కలదిగాదు. "వరూధిని వాదన ఒకానొక పవిత్రుని, శీలవంతుని అపవిత్రునిగా అవినీతికి ప్రేరణ చేయునది. ఇట ఉలూపి తనను ద్వితీయ భార్యగా చేపట్టుమని ప్రబతిమాలుచున్నది. సామాన్య నాయికకును, ముగ్ధా నాయిక కును ఉన్న ముఖ్య భిన్నత్వ మిదియే. అందుకే, సామాన్యవాదన, వాదనగానే యుండిపోయినది. ముగ్ధ ఎదుటివానిని ముగ్ధుని చేయువఱకు వదలలే"దని కులశేఖరరావుగారి తీర్పు (పుట 86). ఉలూపి ముగ్ధయని కులశేఖరరావుగారు భావించుచున్నారు. కాని, యామె ప్రౌఢ. విజయవిలాస నాయికలలో నొక చిత్రాంగదయే ముగ్ధ. ఉలూపి వాఙ్మనఃక్రియలు ప్రౌఢా నాయికవై యున్నవి. సాహిత్యదర్పణమందలి ఈ శ్లోకమును గమనింపుఁడు.

"స్మరాంధా గాఢతారుణ్యా సమస్తరతికోవిదా
భావోన్నతా దరవ్రీడా ప్రగల్భాక్రాంత నాయికా"

(స్మరాంధురాలు, సంపూర్ణ యౌవనము గలది, సమస్త సురతబంధ భేదములు తెలిసినది, ఉన్నత శృంగార భావములు కలది, స్వల్ప లజ్జకలది, నాయకుని వశీకరించుకొనిన స్త్రీ ప్రౌఢయగును). ఈ లక్షణములన్నియు సంపూర్ణముగాఁ గలది యులూచి. అభి ప్రాయ భేదములకేమిగాని, "కావ్యానుశీలనము" విద్వాంసుల యామోదముద్ర పొందఁగల విమర్శాత్మక గ్రంథము.

—నాగళ్ళ గురుప్రసాదరావు

# ఉ త్త ర మే ఘ ము

## [పద్య కావ్యము]

[కవి: భళ్లమూడి నరసింహమూర్తి; ఎస్. ఇ. రైల్వే. ఎం. హెచ్. స్కూల్; కుర్దారోడ్; (ఒరిస్సా)]

మేఘసందేశమునకు మేఘము నామైకదేశము. మేఘమనగా మేఘసందేశమని యర్థము. మేఘసందేశమునందు రెండు భాగము లున్నవి. మొదటిభాగమునకు పూర్వమేఘమనియు, రెండవ భాగమున కుత్తరమేఘమనియు విద్వత్ప్రసిద్ధి కలదు. ప్రకృత గ్రంథము కాళిదాసుని ఉత్తర మేఘమునకు తెనుగుసేత కాదు. మేఘ సందేశమునందలి ఇతివృత్తమున కనంతర భావిగా కొంత కథ కల్పించి, దానిని 5 గుచ్ఛముల గ్రంథముగా కవి రచించెను. మేఘసందేశమునకు తరువాతి వృత్తాంతమును నిబంధించుటవల్ల దీని కుత్తరమేఘమను పేరు కుదురవచ్చును. ఈ మేఘుని సందేశము విని కుబేరుడు పంపగా మాధురియన్న యామె యక్షునివద్దకు వచ్చి, యాతని పరీక్షించి శాపావసానమును తెలియజేయును. యక్షుడు రామగిరిపైనున్న వారి వద్ద సెలవు తీసికొని, మేఘునికి తా నుపదేశించిన మార్గము వెంట అలకాపురమునకు పోవును. ఇది సంగ్రహముగా నీ గ్రంథ మందలి కథ.

కాళిదాసు మేఘసందేశమునందు విప్రలంభ శృంగార మును నిబంధించెను. కావ్యాంతమున నాయికా, నాయకుల సంగమమును సూచించి వదలెను. ఆ సూచనను పట్టుకొని సాగ లాగుటవల్ల అధికప్రయోజన ముండబోదు. కథ సాగతీసినందు వల్ల కావ్యమునకు కలిగిన కొత్తదన మేమియులేదు. కాళిదాసుని వర్ణనమునే చాలవరకు అనుసరింపక తప్పినదికాదు. మాధురి యక్షుని పరీక్షించుట పొందికగా లేదు. మరి యక్షునికి శాపాంతము ఉత్థానైకాదశినాడని ద్వితీయ గుచ్ఛమున నున్నది. ఆ సందర్భములో యక్షుడు శాపకాలమంతయు ననుభవించి నట్లే. మఱి కుబేరుడు దూతికను పంపుటేల? తృతీయ గుచ్ఛమునందు యక్షుఁడు పోయిన మార్గమంతయు పూర్వ మేఘమునందు వర్ణితమైనదే. కాళిదాసు యక్షునిచేత మేఘుని కా మార్గ ముపదేశింపజేయుటలో రమ్యత యున్నది. మేఘునకు త్రోవ తెలియదు కావున ఆ ఉపదేశమంతయు అవసరము.

# గ్రంథ విమర్శనము

మతి యక్షుడు శాపానుభవమునకై వచ్చునప్పుడు ఆ మార్గము వెంట వచ్చినాడు. శాపాంతమున తిరిగిపోవునప్పుడు అతని చిత్త వృత్తి ప్రియాభిముఖమై యుండును. అట్టివానికి మార్గ మందలి సౌందర్యమును కొంత యుత్ప్రేక్షతో కలిపి యానం దించు నెమ్మది యుండదు. మేఘునికి చెప్పునప్పుడు మాత్ర ముత్ప్రేక్ష లేదా యన్నచో అచ్చట మార్గోపదేశముతోపాటు మేఘ ప్రరోచనకూడ అవసరము. కాబట్టి ఆశంక కక్కడ తావులేదు. ఇందువల్ల కథా సంవిధానము పిష్టపేషణమైపోయినది.

దీనిని వదలి చూచినచో ముందుముందు మంచి ప్రౌఢ మైన పాకములో ఈ కవి వ్రాయగలడనుటకు తగినంత సాక్ష్య మీ గ్రంథమునందున్నది. ఈ కవి పద్య రచన సొగసుగా, తీవిగా నడచును. మొదలుపెట్టిన చివరంట బంగారుతీగ తీసినట్లుం డును. సంస్కృత సమాసములు, తెలుగు పలుకుబళ్లు, చక్కని అనుస్యూతితో ఈ కవి రచనయందు చెలువారుచున్నది.

"పటుతర గంధ బంధురతఁ బైకెగఁ జిమ్ము ప్రసూనరాజిచేఁ
గుటజ సమావృతంబయిన కొండశిరంబున నివ్వదృష్టిచేఁ
దటుకునఁ గాంచి ధౌతపరిధాననిబద్ధ మహీసతీ కుచం
బటు తలపింప సంశయసమాశ్రిత మానసుడయ్యె నంతటన్"

ఈ పద్య మీయన పద్య రచనా ప్రౌఢికి మచ్చుతునక.

"శితవర్ణాంబర ధారిణుల్, శిత సుమశ్రేణీ శిరోభూషణల్"

సంస్కృత సమాసములిట్లు.

"విరిసిన జాజిపూవు లలివేణుల వేణుల నాక్రమింప"

"వలిపెపు పైటలోని కుచభారము సారెకు దొంగలింపగా"

తెలుగు పలుకుబళ్ల ఇట్లు. కవియొక్క పద్య రచనయందలి ఫామేదా తనమును తెలియజేయుచున్నవి. ఇంత చిక్కని పద్య రచనయందు అచ్చటచ్చట "శ్రీమంత శరత్సమాగమము"; "మహద్భీకర శాపము" "నిగ్రహత్వము", "కృత సుస్నాతలు" మొదలైన నెరసు లున్నవి. సంస్కృతసమాసములు, తెలుగు పలుకుబళ్లు, ఎత్తు గడలు, యతిప్రాసలదుకుటలు మొదలైన పద్యరచనాసామగ్రి పుష్కలముగా కలవాడే కవి. ఈ కవిని పరిచయము చేయుచు శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు ఈ బాలకవి కవనమున మంచి సరళమగు ధారయున్నదన్నారు. అది యదార్థము. బాలకవియను టచే నీయన వయసున చిన్నవాడని తెలియుచున్నది. ముందు ముందు ఈకవినుండి మనము ఉత్తమ కావ్యసృష్టి యాసింప వచ్చును. ఈ గ్రంథము సహృదయులు చదివి యానందింప తగ్గది.

—ధూళిపాళ శ్రీరామమూర్తి

## 1. అచ్చతెలుగు మెచ్చులపచ్చ ముచ్చిలి

(అను శుద్ధాంధ్ర నిర్వచన పారిజాతాపహరణము)

ఈ గ్రంథమును "వైద్య విద్వత్ పండిత సత్కవి" శ్రీ నాగు నాగనార్య రచించారు. ఇందులో కతము, కర్జము, కైకోలు అన్న మూడు భాగములు ఉన్నాయి. గడియారము వేంకటశేషశాస్త్రి పరిచయ వాక్యము, శ్రీ మధునాపంతుల సత్య నారాయణశాస్త్రి అభిప్రాయము వ్రాశారు. 110 పేజీలు. 3 పేజీల తప్పొప్పుల పట్టిక. ఆర్యకవి గ్రంథమాలలో 10 వ పుష్పముగా ప్రకటింపబడినది.

విలాసము : పండిత నారు నాగనార్య, శ్రీ ఆత్మారామ విహా రము, నాగవరము పోష్టు, కడపజిల్లా.

## 2. జ ప ము

జపమును గూర్చి శ్రీ మాధవ పుండలీక పండిట్‌గారు ఇంగ్లీషులో వ్రాసిన వ్యాసమున కిది శ్రీ ముదిగంటి జగ్గన్నగారి తెనుగు అనువాదము. దీనిని శ్రీ అరవింద సర్కిల్, నిడద వోలువారు ప్రకటించారు. వెల : 50 నయాపైసలు. వలయు వారు శ్రీ మానాప్రగడ శ్రీరాములు (అడ్వకేట్, కొవ్వూరు) గారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

## 3. శ్రీరామస్తోత్రావళి

శ్రీ పురాణపండ రామమూర్తిగారి సంపాదకత్వమున, ఆధ్యాత్మ ప్రచార సంఘం, రాజమండ్రి వారు దీనిని ప్రకటిం చారు. ఇందులో పది స్తోత్రాలు ఉన్నాయి. (1) శ్రీరామః శరణం మమ, (2) శ్రీరామస్తుతి, (3) ప్రాతః స్మరణము, (4) ఇంద్రకృత రామస్తుతి, (5) శ్రీరామచంద్రాష్టకం, (6) జటాయుకృత శ్రీరామస్తుతి, (7) బ్రహ్మదేవకృత శ్రీరామస్తుతి, (8) శ్రీరామ ప్రేమాష్టకం (9) అహల్యా స్తవం, (10) శ్రీరామ మంగళా శాసనం. వెల : 31 నయా పైసలు.

## 4. పూఁ దోఁ ట

ఇది ఒక ఖండకావ్యముల గుచ్ఛము. రచయిత శ్రీ కొల్లా కృష్ణారావు. ఇందులో దివ్యస్మృతి, నీరాజనము, అభినుతి, ప్రశంస, అవేక్ష, పరితాపము, సంఘము, ఆవేదన, పరి ష్కృతి అన్న ఖండిక లున్నాయి. 46 పేజీలు. వెల ఒక రూపాయి. ప్రతులకు సాహితీ పబ్లికేషన్స్, అరండల్‌పేట, గుంటూరు—2 కు వ్రాసుకోవాలి.

## 5. ఆంధ్ర సేవకులు

ఇది ఐదుగురు మహాపురుషుల చరిత్రలు గల వచన గ్రంథము. (1) దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు, (2) దేశ భక్తురాలు మాగంటి అన్నపూర్ణాదేవి, (3) ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, (4) కలియుగభీమ కోడి రామమూర్తి, (5) మహా మేధావి కట్టమంచి రామలింగారెడ్డి. దీనిని రచించినది శ్రీ జాస్తి వేంకటనరసయ్య. 86 పేజీలు. వెల : రూపాయి. ప్రతులకు : భారతీసమితి, పామర్రు, కృష్ణా జిల్లా.

## 6. బంగారుభూమి

(సాంఘిక నాటకము)

శ్రీ గిద్దలూరు గోపాలరావు దీనిని రచించారు. ఇందులో మూడు రంగాలు ఉన్నాయి. పేజీలు 80. వెల : రు. 1—50. తులసీ ప్రచురణలు, 16/518 (1) కాసికోల అగ్రహారం, నెల్లూరు.

## 7. శ్రీరాజలింగేశ్వర శతకము

గ్రంథకర్త శ్రీ లొల్లా సుబ్బరామయ్య. పబ్లిషర్లు : శ్రీపూర్ణానంద నిలయము, బాపట్ల, వెల : రు. 37 న. పైలు.

## 8. మగువ తెగువ

రంగూన్‌వాసి శ్రీ పోలవరపు సన్యాసిరావుగారి నవల. 119 పేజీలు. వెల : ఒక రూపాయి. విలాసము : పోలవరపు సన్యాసిరావు, 30.90, 16 వ వీథి, రంగూన్.

## 9. శ బ రి

పద్యకావ్యము. రచించినది శ్రీ పెమ్మరాజు వేణుగోపాల కృష్ణమూర్తి. నాటక కళానిధి శ్రీ ఊటుకూరు సత్యనారాయణరావు దీనికి "తోచిన మాట" వ్రాశారు. వాత్సల్యము, ప్రబోధము, నిరీక్షణము, రామలక్ష్మణులు, అన్వేషణము, సమాగమము, విశ్రాంతి, సంభాషణము, నివేదనము, ఆత్మార్పణము అన్న విభాగములుగా కావ్యరచన సాగింది. దీనిని తిరువూరు కళాకుటీరంవారు ప్రకటించారు. ప్రతులకు : జయంతి పబ్లికేషన్స్, గోపాలరెడ్డి రోడ్డు, విజయవాడ—2.

## 10. అద్దానికి అటూ ఇటూ

కనక్‌ప్రవాసిగారి కథల సంపుటి. ఇందులో అద్దానికి అటు ఇటూ, ధర్మప్రభువు, ఆమ్రేడితం, ఇంతలో ఉంది, సినిమా కథ—అనే కథలు ఉన్నాయి. సాహిత్య గౌతమి (రాజమండ్రి) వారు ప్రకటించారు. పేజీలు : 80. వెల : రూపాయి. ప్రతులకు : సిహెచ్. సుబ్రహ్మణ్యం, సాహిత్య గౌతమి, 10/820 వీరభద్రపురం, రాజమండ్రి—1.

# వార్తలు

ఆగస్టు 1 : ఋణప్రదాతల సంఘ రాజ్యాలు భారత దేశానికి మరో 1550 లక్షల డాలర్ల సహాయం ఇవ్వడానికి అంగీకరించాయి.

మలయా, సింగపూర్, సారవాక్, ఉత్తర బోర్నియోలను కలిపి, మలేసియా ఫెడరేషను ఏర్పాటుకు బ్రిటన్ అంగీకరించింది. 1963 ఆగస్టు 31 లోగా ఇది ఏర్పడవచ్చు.

—దేశంలో వెనకబడిన ప్రాంతాలు అంటే ఏమిటో నిర్ణయించడానికి ప్రధాన లక్షణాలను నిరూపించడం, నిర్ధరించడం అవసరమని ప్రణాళికా సంఘం నిర్ణయించింది.

ఆగస్టు 2 :ఘనా అధ్యక్షుడు డా. న్క్రుమా హత్యకు విఫల ప్రయత్నం జరిగింది.

—అల్జీరియాలో రాజకీయ నాయకుల మధ్య తగాదా అంత మయింది. రాజకీయసంఘం ఎట్లా ఉండాలో నిర్ణయించే అధికారం పార్లమెంటుకు ఉండాలని నిర్ణయించుకున్నారు.

—నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణాదికనిర్వహణాన్ని కేంద్రం తీసుకోవడం మంచిదని ముఖ్యమంత్రి శ్రీ సంజీవ రెడ్డి ప్రకటించారు.

—మద్రాసు రాష్ట్రంలో ప్రాతిపదిక విద్యావిధానం దాదాపు విఫలం అయినట్లేనని ఆర్యానాయకం సంఘం తేల్చింది.

ఆగస్టు 3 : భారతదేశం, చైనా సరిహద్దులలో చిల్లర తగాదాలు జరిగినా, అది పెద్ద యుద్ధానికితీయవని, యుద్ధం అనే ప్రసక్తే అక్కడ లేదని చైనా విదేశాంగమంత్రి శ్రీ చెన్‌యీ జనీవాలో ప్రకటించారు. ఈ తగాదా పరిష్కారానికి చైనా భారత ప్రధానులు కలిసి మాట్లాడ్డం యోగ్యం అని గూడా సూచించారు.

—ఢిల్లీలో ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ, శ్రీ చెన్‌యీ సూచనపట్ల సౌముఖ్యాన్ని ప్రదర్శించినా, అట్టి సమావేశానికి అనుకూల పరిస్థితులు ఏర్పడటం అవసరం అన్నారు.

ఆగస్టు 4 : సరిహద్దుల విషయంలో చైనాతో ఉన్న తగాదాలో భారతదేశం లొంగిపోవడం అంటూ ఉండదని రక్షణ మంత్రి శ్రీ కృష్ణమీనన్ పూనాలో మాట్లాడుతూ విశదం చేశారు.

—చైనా దురాక్రమణ చరిత్రను విశదీకరించే కరపత్రాన్ని భారత ప్రభుత్వం ప్రకటించింది.

—100 మిలియన్‌ల టన్నుల ఆహారధాన్యాలను తృతీయ ప్రణాళిక కాలంలో పండించడం సాధ్యమేనని కేంద్రీ ఆహార మంత్రి శ్రీ పాటిల్ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ విశదం చేశారు.

—ఆంధ్రప్రదేష్ భూమిశిస్తు హెచ్చింపు బిల్లును రాష్ట్ర శాసనసభ ఆమోదించింది.

ఆగస్టు 5 : నైవేలీలో విద్యుత్ కర్మాగారానికి రాష్ట్రపతి డా. రాధాకృష్ణన్ ప్రారంభోత్సవం చేశారు.

—సమిష్టి విపణిలో బ్రిటన్ ప్రవేశంపై మంతనాలు వాయిదా పడ్డాయి.

—రష్యా అణ్వాస్త్ర పరీక్షలు ప్రారంభం చేసింది.

—లడక్‌లో పరిస్థితి ఇంకా విషమంగానే ఉన్నదని శ్రీ నెహ్రూ పార్లమెంటులో ప్రకటించారు.

ఆగస్టు 6 : మద్రాసు హైకోర్టు శతవత్సరోజలు జరిగాయి.

—సరిహద్దుల విషయంలో ఉద్యోగుల నివేదికలు ఆధారంగా త్వరలో మంతనాలు ప్రారంభం కావాలని చైనా కోరింది.

—పుదుచ్చేరిని కేంద్ర పాలిత ప్రాంతంగా ఉంచుతామని శ్రీ నెహ్రూ ప్రకటించారు.

—భారత తృతీయ ప్రణాళికకు తాము 470 మిలియన్‌ల మార్కులు (1175 లక్షల డాలర్లు) సహాయం ఇవ్వగలమని పశ్చిమ జర్మనీ ప్రకటించింది.

ఆగస్టు 7 : ఆహారపు కల్తీని అరికట్టేందుకు తీవ్ర చర్యలు అవలంబించాలని కేంద్రం సంకల్పించింది.

—సరిహద్దులలో చైనా తిరిగి కాల్పులు సాగించినట్లు వార్తలు వచ్చాయి.

ఆగస్టు 8 : ఎగుమతులు అధికం చేయడానికి స్థిరీకరణ నిధిని ఏర్పాటు చేయడానికి కేంద్రం సంకల్పించింది.

ఆగస్టు 9 : పంచదార ఎగుమతులు పెరిగినట్లు కేంద్ర ఆహారశాఖ కార్యదర్శి ప్రకటించారు.

—మేలిరకం బియ్యాన్ని ఎగుమతి చెయ్యడానికి కేంద్రం ఆలోచిస్తున్నట్లు ఆహారశాఖ కార్యదర్శి శ్రీ శంకర్ ప్రకటించారు.

ఆగస్టు 10 : దేవాదాయ ధర్మాదాయ పరిశీలనసంఘం నివేదిక ప్రకటింపబడింది.

ఆగస్టు 11 : రష్యా మనుష్యునితో వ్యోమనౌకను ప్రయోగించింది.

—పాకిస్తాన్ సైనికులు కాశ్మీర్‌లో భారత సైనిక స్థావరంపై దాడి చేశారు.

ఆగస్టు 12 : ఇంకో వ్యోమనౌకను మనుష్యునితో సహా రష్యా ప్రయోగించింది.

—1963 మార్చి నాటికే వచ్చే సాధారణ ఎన్నికలకు కాంగ్రెస్ అభ్యర్థులను నిర్ణయించాలని కాంగ్రెస్ కార్యవర్గం తీర్మానించింది.

ఆగస్టు 13 : చైనా తన సైన్యాలను ఉపసంహరిస్తేనే గాని సరిహద్దుల విషయంలో మంతనాలు ప్రారంభం కావని శ్రీ నెహ్రూ పార్లమెంటుకు హామీ యిచ్చారు.

—తిరుచెంగోడ్ పార్లమెంటరీ నియోజకవర్గంలో కాంగ్రెస్ ఓడింది; డి. ఎం. కె. గెలిచింది.

ఆగస్టు 14 : గాల్వాన్‌లోయలో భారత సైనికులు తమ సైనికులపై కాల్పులు సాగించినట్లు చైనా ఆరోపించింది.

—రాష్ట్రపతి స్వాతంత్ర్య దినోత్సవ సందేశం యిచ్చారు.

—ప్రభుత్వ చైనా విధానాన్ని పార్లమెంటు ఆమోదించింది. శ్రీ చౌ ను తాను కలుసుకునేదిలేదని ప్రధానమంత్రి ప్రకటించారు.

—మనుష్యుడు లేకుండా ఇంకో వ్యోమనౌకను రష్యా వదిలింది.

ఆగస్టు 15 : సరిహద్దుల రక్షణ ప్రాధాన్యాన్ని గురించి శ్రీ నెహ్రూ స్వాతంత్ర్య దినోత్సవ ప్రసంగంలో వివరించారు.

ఆగస్టు 16 :రష్యా వ్యోమయాత్రికులు,—మేజర్ నికొలాయ్, లెఫ్టినెంట్ కల్నల్ పోపోవిచ్—క్షేమంగా భూమికి దిగివచ్చారు.

—పుదుచ్చేరి న్యాయసిద్ధంగా గూడా భారత్ పరం అయింది.

—పశ్చిమ ఇరియన్‌ను గూర్చిన ఒప్పందంపై సంతకాలు జరిగాయి.

ఆగస్టు 17 : హిందూస్థాన్ ఎయిర్‌క్రాఫ్ట్ లిమిటెడ్ వారు సూపర్ సోనిక్ విమానాలకు రష్యన్ ఇంజన్లను వాడడానికి ఒప్పందం కుదుర్చుకున్నారు.

—త్రిపురా సరిహద్దుల రక్షణ బాధ్యతను భారత ప్రభుత్వం సైన్యానికి అప్పగించింది.

ఆగస్టు 18 : అకాలీల మూక ఉమ్మడి అరెస్టులు; తారాసింగ్, ఫతేసింగ్‌లతో సహా 100 మంది అరెస్టు చేయబడ్డారు.

ఆగస్టు 19 : జపానుకు సాలుకు 1 లక్ష 50 వేల టన్నుల పంచదారను ఎగుమతిచేయడానికి ఏర్పాట్లు ప్రారంభమైనాయి.

—సురవర్ధీని ఖైదులోంచి విడుదల చేశారు.

ఆగస్టు 20 : రెండో అణు విద్యుత్ కర్మాగారాన్ని రాజస్థాన్‌లో నెలకొల్పడానికి కేంద్రం నిశ్చయించింది.

ఆగస్టు 21 : కృష్ణా, గోదావరి జలాల వ్యవహారంలో గుల్హాతీ సంఘం నివేదికలో కొన్ని అంశాలు ప్రకటింపబడినాయి.

—కటాంగా ప్రత్యేకతను అంతం చెందించడానికి సమితి కార్యదర్శి ఒక పథకాన్ని ప్రకటించారు.

ఆగస్టు 22 : దురాక్రమణ రద్దు కానంతవరకు చైనాతో మంతనాలు ఉండవని ప్రధానమంత్రి రాజ్యసభలో ప్రకటించారు.

ఆగస్టు 24 : బెర్లిన్ సమస్యా పరిష్కారానికి నాల్గు అగ్రరాజ్యాల. సమావేశం జరగాలని బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సులు రష్యాకు సూచించాయి.

ఆగస్టు 25 : అల్జీరియాలో తిరిగి రాజకీయ కల్లోలం ప్రారంభమైంది. ఎన్నికలు వాయిదా వడ్డాయి.

ఆగస్టు 26 : సమితి కార్యదర్శి కాంగో పథకాన్ని బ్రిటన్ బలపరచింది.

ఆగస్టు 27 : చిత్తూరు పార్లమెంటరీ నియోజకవర్గంలో స్వతంత్రపార్టీ నాయకుడు శ్రీ ఎన్. జి. రంగా గెలుపొందారు.

—శుక్రగ్రహంమీదకు అమెరికా వ్యోమనౌకను ప్రయోగించింది.

—అణ్వస్త్ర పరీక్షల నిషేధాన్ని గురించి అమెరికా ప్రతిపాదించిన కొత్త పథకాన్ని రష్యా తిరస్కరించింది.

ఆగస్టు 28 : రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన 10 కోట్ల రూపాయల ప్రజా ఋణం వసూలయింది.

—వ్యవసాయాభివృద్ధికి మరో 50 కోట్లు కేటాయించడం జరుగుతుందని కేంద్ర ప్రణాళికల మంత్రి శ్రీ నందా ప్రకటించారు.

ఆగస్టు 29 : పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణానికి ఏర్పడుతున్న అవాంతరాలను గురించి రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధి విమర్శించారు.

ఆగస్టు 30 : ఆంధ్రప్రాంతంలోని పెద్ద పురపాలక సంఘాల్లో గూడా ఆక్ట్రాయ్ పన్నును విధించడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు రాష్ట్ర పురపరిపాలనశాఖామాత్యులు ప్రకటించారు.

—పాత ఫ్రెంచి ప్రాంతాలకు కేంద్ర పాలిత ప్రతిపత్తిని ఇచ్చేందుకు రాజ్యాంగం సవరణబిల్లు పార్లమెంటులో ప్రతిపాదించబడింది.

—భూమి స్వాధీనపు బిల్లును లోక్‌సభ ఆమోదించింది.

—రాష్ట్రంలో నీటి సరఫరా, డ్రైనేజి సౌకర్యాల పరిశీలనకు ప్రభుత్వం ఒక సంఘాన్ని శ్రీ ఆలపాటి వెంకటామయ్య అధ్యక్షులుగా నియమించింది.

ఆగస్టు 31 : ట్రినిడాడ్‌కు బ్రిటన్ స్వాతంత్ర్యం యిచ్చింది. అది నేటితో స్వతంత్రరాజ్యమైంది.

—ఎగువసీలేరు ప్రాజెక్టు తగాదాలో మధ్యవర్తి శ్రీ త్రివేది ఆంధ్రప్రదేశ్‌కు అన్యాయం జరిగేట్లు తీర్పు ఇచ్చారు.

—సెప్టెంబరు 7 న ఆంధ్రప్రదేశ్ కొత్త గవర్నర్‌గా జనరల్ శ్రీనగేష్ పదవిస్వీకారం చేస్తారు.

—అణ్వస్త్ర వ్యతిరేక మహాసభ నిర్ణయాలను గూర్చి అమెరికా అధ్యక్షునికి తెలియజేయడానికి శ్రీమాన్ రాజాజీ వాషింగ్టన్‌కు వెళ్లడానికి అంగీకరించారు.

—విజయవాడ పురపాలకసంఘం ఎన్నికలలో 1948 తర్వాత కాంగ్రెసుకు అధికసంఖ్యాబలం లభించింది.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad,**